# కవిరాజశిఖామణి

శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

వ్రతకుటీరము

రాసు-21.

సారస్వతకుటీరగ్రంథమాల — 4.

# కవిరాజశిఖామణి

[ప్రథమభాగము]

కర్త:

ఆచార్య శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య. యం.ఏ.బి.ఓ.యల్.

ఆంధ్రభాషాశాఖాధ్యక్షుఁడు,

సర్ త్యాగరాయ కళాశాల, మదరాసు.

**సారస్వతకుటీరము**

**మదరాసు -21.**

సర్వస్వామ్య సంకలితము

19[illegible]9

మూల్యము రెండున్నర రూపాయ

వికారి

శ్రావణ పూర్ణిమ

ప్రతులు

అయిదు వందలు

వెల్డన ప్రెస్సు,
మదరాసు-21.

# అంకితము

మహావిద్వాంసులు, పరిశోధకాగ్రగణ్యులు నగు

శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారికి

భక్తిపూర్వకముగా

సమర్పింపఁబడినది.

దోహద మొసఁగినమహాప్రబంధము కుమారసంభవము. ఇంక
నెందఱు పరిశ్రమింప నెంచినను వారికిని గ్రొంగ్రొత్త సాహిత్య
నిధులను ద్రవ్వి తల కెత్తఁగలగ్రంథరాజ మది!

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో శ్రీ వేటూరి
ప్రభాకరశాస్త్రిగారికడ నంతేవాసిగా నుండినప్పుడే వారి యను
గ్రహమున నా కీగ్రంథముపై నభిమాన మేర్పడినది. ఎన్నో
యపూర్వవిషయముల నప్పుడు వారిసన్నిధిభాగ్యమున నేను
బడయఁ గల్గితిని. నాఁటినుండియు నొక ప్రత్యేకాభిమానముతో
నాగ్రంథమును బఠించుచు, దాని గూర్చినవిమర్శలు చదువుచు
వచ్చితిని. అప్పుడప్పుడు పత్రికలలో వ్యాసములుగా నాపరిశ్రమ
కొకరూపము కల్పించుకొనుటతోఁ దృప్తి పడక యా గ్రంథ
మున కొక విపులవ్యాఖ్యానము వ్రాయఁ దలపెట్టి యందుఁ
దొలి రెండాశ్వాసములకును వ్రాసి ముగించి 'త్రిలిఙ్గ' పత్రి
కలోఁ బ్రకటించితిని. అది పలువురు పండితులప్రశంసకుఁ బాత్ర
మయి, తక్కిన యాశ్వాసములకును నట్టివ్యాఖ్య వ్రాసి పూర్తి
చేయవలయు నని, యచిరకాలముననే ప్రకటింప వలయు నని
నాకుఁ బ్రోత్సాహము గొల్పినది. భగవంతుఁడు నాసంకల్పము
నెఱవేరున ట్లనుగ్రహించును గాక!

కుమారసంభవమునుగూర్చి నేను జరపినపరిశ్రమఫలమే
యిప్పు డిట్లు 'కవిరాజశిఖామణి' రూపమును దాల్చినది. అనువాద
సారస్యము, కవితాశిల్పము మున్నగువిషయము లిందు విషయ
విభాగపురస్సరముగా, విపులముగాఁ జర్చింపఁబడినవి. ప్రథమ
భాగముగాఁ బ్రకటింపఁ బడుచున్న యీ గ్రంథమునందుఁ
బదుమూఁడుశీర్షికలను గూర్చిన సమగ్రచర్చ కలదు. తక్కిన
విషయములు రెండవభాగమునఁ బ్రదర్శింపఁబడినవి.

నన్నిచోడుని కుమారసంభవమును వెలుఁగులోనికిఁ దెచ్చి యాంధ్రవిద్వల్లోకమునకు మహోపకారము గావించిన మహావిద్వాంసులు, పరిశోధకాగ్రగణ్యులు నగు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారి కీర్తిమూర్తి కిది యుపాయనముగా సమర్పింపఁ బడినది. వారు దీని వాత్సల్యముతోఁ బరిగ్రహింతురనియే భావింతును.

తొలుత సాక్షాత్ పరిచయము లేకున్నను నాయభ్యర్థనము మన్నించి గ్రంథమును సాంతము చదివి సంతృప్తులయి తమపరితోషమును దెలుపుచు నీగ్రంథమునకు 'పరిచయము' వ్రాసి యొసఁగిన సాహిత్యప్రియులు, సాహిత్యపోషకులు, సహృదయవతంసులు నగు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారికి మిక్కిలి కృతజ్ఞుఁడను. 'పరిచయము'లో వారు తెలిపిన విషయములు వారి సమ్యగ్దర్శిత్వమునకు నిదర్శనము లని వేఱ చెప్పఁ బని లేదు.

ఏతద్ గ్రంథమును రచించుసందర్భమునఁ జేదోడు వాదోడుగా నుండి నా కనేకవిధములఁ దోడ్పడిన నా సోదరుఁడు చిరంజీవి తిమ్మావజ్ఝల త్యాగరాజమూర్తి, బి.ఏ. కును, చిరంజీవి సౌభాగ్యవతి నాశ్రీమతికిని నా యాశీర్వచనములు.

దీని నిట్లు పసిగాఁ, జక్కఁగా, సర్వాంగసుందరముగా ముద్రించి యిచ్చి యభిమానమును బ్రకటించిన 'వెల్డను ప్రెస్సు' అధిపతులు శ్రీ గుత్తి భావనారాయణగారి నభినందించుచున్నాఁడను.

నా యీ జతనమునందలి నిగ్గుతగ్గుల నిర్ణయింప సహృదయపండితులు ప్రమాణము.

—తిమ్మావజ్ఝల కోదండరామయ్య.

# విషయానుక్రమణిక

# పరిచయము

ఆధునికాంధ్రవాఙ్మయమున నవలలు. నాటకానువాదములు. ఖండకావ్యములు. చిన్నికథలు. అతిచిన్నపద్యరత్నములు. మాలలు. గుచ్ఛములు నెక్కువగా పెరిగినవి. వాని పెరుగుదలకు ప్రజాభిమానముతోడ పత్రికలు చేయూత నొసగినవి. చదువుటకంటె వ్రాయవలయు ననుఅపేక్ష వెలసినది. వాడుక భాషాప్రాచుర్యములో నియమపేక్షకు కొంత ఆశ్రయము దొరకినది. భాషయందు సౌష్ఠవము కొంత తఱిగినను అభిమానము పెరిగినది. ముద్రణాలయముల పెరుగుదలతో కవులు. భాషాభిమానులు. ఉత్కర్షాభిమానులు, స్వర్ణాపేక్షకులు తమరచనలకు రూపమును జూడ గల్గిరి. తమ ప్రచురణములను జూచుకొని కొందఱు మోదమును పొంద గల్గిరి. అదియును వారియుత్సాహమునకు దోహద మొనరించెను.

రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు విడెముల శృంగారకవితలు ఇటీవల ప్రత్యక్షప్రయోజనము బొందక, రాజకీయపు టారాటము హెచ్చుకొలది, ఆకలిమంట లెగయుకొలది. స్వర్ణాపేక్ష యెదుగుకొలది భాషాప్రయోగోపయోగములు కొంత మార్పు జెందెను. ఇట్టిపరిస్థితులలో నవరసములు చాలక క్రొత్తరసములు విరివి గాజొచ్చెను.

కాని నిర్దుష్టమైనవాఙ్మయవికాసమునకు నూత్నరుచులు అడ్డు పడ లేదు. భాషాసేవకులు భాషాకోవిదులై,

ఇతరభాషలలోని విశిష్టతను గుర్తింప నుంకించిరి. ఇది ముఖ్యముగా ఆంగ్లభాషావిజ్ఞానము సేకరించినవారికి సులభమాయెను. సంస్కృతములోని సర్వతోముఖ ప్రజ్ఞావైదుష్యములు వారికృషికి తొలకరులై ఫలిత మీయ సాగెను. అట్టివారిలో శ్రీయుత తిమ్మావజ్ఝల కోదండరామయ్య, యం. ఏ. బి. ఓ. యల్. ఒక రగుట వారిభాషాపరిజ్ఞానము, పుస్తకరచనాసామర్థ్యము, పరిశోధనాపటిమ ఋజువు చేయు చున్నవి. 'పరిశోధన' పత్రిక చిరకాలజీవి కాక పోయినను, బ్రతికి నన్నాళ్లు చక్కని జీవితమును జరిపె నని పూర్వ ప్రతులు తెల్పుచున్నవి. అందలి కోదండరామయ్యగారి వ్యాసములు వారి భాషాసేవనే కాక చారిత్రకపరిశోధనా పరిజ్ఞానమును. భాషలో గలవివిధప్రక్రియలలోని రుచులను గూడ తెల్పుచున్నవి. కోదండరామయ్యగారి పరిచయము నాకు నూత్న మయ్యెను, భాషాప్రియులకు క్రొత్త గాదు.

సారస్వతవిమర్శకు భాషావిమర్శ, చారిత్రకవిమర్శ యని రెండంగములు గలవు. కేవలభాషావిమర్శలో భాషావైదుష్యము, భావవిస్ఫురణము, పాండిత్యము, ప్రతిభ ద్యోతకము లగును. చారిత్రకవిమర్శనలలో భాషయు, భావములు చరిత్రాంతర్గతము లై యెట్లు నెగడెనో వ్యక్త మగును. కేవలము భాషావిమర్శనములో విఖ్యాతపండితులు గూడ రసావరణము చాలక పోయినప్పుడు విరసార్ణవములో దుముకుట, అందు కొంచెము కారము, ఇంచుక వికారమును ప్రదర్శించుట తెలిసినప్రకృతియే. చారిత్రక

విమర్శలలో స్పష్ట మైనయభిప్రాయభేదము లున్నను. రసభంగి మునకు. అన్యోన్యదూషణమునకు, పరస్పరజ్ఞానసౌష్ఠవావ లోకనమునకు తా వుండెను. కోదండరామయ్య తన విమర్శ నములలో ముఖ్యముగ గాక చరిత్రాంశపరిశోధనములం దెక్కువ శ్రద్ధ వహించియుండిన ఇతరుల దృష్టికి వచ్చినను దృష్టి నిలుపలేక తప్పించుకొను ననుకొన వలయును. ఇం దాయన ధన్యుడు. ఒకప్పుడు వాడుకభాషలో కలము ముంచి నను. విశిష్ట మైన తెలుగుబాసనే వాడుకలో నుంచుకొనెను. వారి విమర్శనలలో సారళ్యము. సౌలభ్యము, సారస్యము ద్యోతకములు. సామాన్యపాఠకులు రచనలలో కథ, వస్తువు, రసము. రచనాసామర్థ్యములను గ్రహింతురు. విమర్శనా దృష్టితో చదువువారు మఱికొంత దూర మేగెదరు.

'కవిరాజశిఖామణి' కోదండరామయ్యగారి విశాల కృషిఫలిత మై, వివిధానుభవద్యోతక మై మెఱు గెక్కెను. కవిత్వసర్వతోముఖవిమర్శ కవిహృదయావిష్కరణ మొన ర్చెను. ఆప్రయత్న మిటు నెఱవేరె ననుకొందును. అది యును గాక ఆంగ్లవిమర్శాకృతికి ఈ యాంధ్రవిమర్శ గ్రంథము మెఱుగులు దిద్దె ననుకొందును. ఈ విమర్శనా వైఖరిలో నూత్నత్వము గూడ నున్న దనవలయును. సగమే యిప్పటికి ముద్రణములో రూపము దాల్చెను. రెండవ భాగము ఇక ముద్రణము గావింపబడును. శుభస్య శీఘ్రం.

నన్నిచోడని కవితావిశేషములను కనుగొనుటకు గీర్వాణాంధ్రములలోనే కాక, కన్నడ తమిళ వాఙ్మయ

ములలో గూడ నెక్కువ పరిచయ మవశ్య మనుట నిర్వివాదము. కోదండరామయ్యగా రది సాధించి ధన్యు డయ్యె ననుటకు సందేహ మెంత వలయును.

కవిరాజశిఖామణి చరిత్రనిర్ణయమునుగూర్చి వాదోపవాదములు ము న్నొకప్పుడు తర్జన భర్జన గర్జనలతో సాగి నదుట ఆంధ్రపండితులకు జ్ఞాపకములోనిదే. అతని కాలనిర్ణయమును ఒక నూత్నవిధముగ సమర్థించి కోదండరామయ్య ధన్యు డయ్యెను. 'కవిరాజశిఖామణి' మొదటిభాగములో అనువాదనారస్యము. కవితాశిల్పము. వస్తుకవిత, జాను తెనుగు. పాటితము. సాంఘికజీవనము మున్నగు పదమూడు శీర్షికలు గలవు. రెండవభాగములో నెన్ని కలవో వేచి చూతము.

కోదండరామయ్యగారి 'కవిరాజశిఖామణి'ని నఖశిఖపర్యంతము వివరించి చూపవలయు నని నేను ప్రయత్నించ లేదు. పండితులకు పుస్తకమును చదివి చూచి యందలి విశిష్టతను గ్రహించుశక్తి యున్నప్పుడు నా పరిశీలనా ప్రయత్నము వారికి శ్రమ యిచ్చు ననుకొందును.

తెలుగు విమర్శగ్రంథములలో ఒక నూతనమార్గమును త్రొక్కి చూపించిన కోదండరామయ్యగారికి నాధన్యవాదములు. పరమేశ్వరుడు వారిని త్రిభంగుల నాశీర్వదించి, తెనుగుణాట ప్రవర్ధమాన సాహిత్యకళాపోషణమునకు కళ్యాణము నొనగూర్చు గాత!

బుచ్చిరెడ్డిపాలెము.
నెల్లూరు జిల్లా.

బెజవాడ రామచంద్రారెడ్డి.

# అనువాదసారస్యము

స్వతంత్రకావ్యరచనమునందువలె ననువాదరచనమునందుఁ గవీశ్వరునికి స్వేచ్ఛ యుండదు. కథావస్తువు స్వకపోలకల్పిత మయినప్పుడు కవీశ్వరుఁడు స్వైరవిహారి! అతఁడు నడపిన ట్లెల్ల కథ నడచును. అతడు తలఁచిన ట్లెల్ల తలఁపు మలఁగును. ఈ స్వాతంత్ర్య మనువాదరచనములో నతని కుండదు. అనువాదపుసంకెల లతని స్వతంత్రభావతరంగముల నదుపులో నుంచును. అనువాదరచయితకు భాషమాత్రమే తనది; భావము కాదు.

తెలుఁగుకవుల యనువాదరచనములు పయితిరున మూలమునకు దాస్యము చేయలేవు. కథావస్తువు సంస్కృతమూలకమే యయినను మూలమునకు ముక్కికి ముక్కి యనువాదము తెలుఁగుకవుల లక్ష్యము కాదు. మూలములోని కథావస్తువును తెలుఁగులోనికిఁ దెచ్చుటతో వారికిఁ దృప్తి లేదు. మూలకథావస్తువుతో, మూలమునకు మెఱుఁగు తెచ్చుసన్నివేశములతో, సరససంభాషణాదికములతో, స్వతంత్రముగాఁ గావ్యమును సవదరించుటయందే వారికిఁ దృప్తి. అదియే వారికాదర్శము. ఈ లక్ష్యసిద్ధిప్రయత్నములో వారి గుఱి కడ్డుతగులుచున్న మూలఘట్టములను దొలఁగించుటకుఁ గూడ వారు వెనుదీయరు. రససంపాదనమునకై, యౌచితీపరిపోషణమునకై మూలము ద్రొక్కనిత్రోవలు కూడ వీరు

ద్రొక్కుదురు. మనలను లక్ష్యమును పొందించుచో నవి యమూలకము లని యాడిపోసికొనునరసికులు మనలో మాత్ర మెవ రుందురు? తెలుఁగుకవీశ్వరులలో నన్నిచోడఁడు, తిక్కన సోమయాజి, శ్రీనాథకవిసార్వభౌముఁడు ననువాదరచనముల యం దిట్టి స్వాతంత్ర్య మవలంబించినవారే.

నన్నిచోడమహాకవి కుమారసంభవములో రసనిర్వహణమునకై, యౌచితీపరిపోషణమునకై కవీశ్వరుఁడు మూల గ్రంథము నతిక్రమించినసందర్భములు కలవు. ఆయా సందర్భములలో నాయాయి ఘట్టములను నిశితముగాఁ బరిశీలించిన వారికి మూలము నతిక్రమించి క్రొత్తపుంత పట్టుటకుఁ గవీశ్వరునికిఁ గలిగినయావశ్యకత యెట్టిదో గోచరము కాఁగలదు. కుమారసంభవములోని యమూలకఘట్టము నొకదానిని మాత్రము గైకొని యేయే కారణములవలన నది యచట నమూలక మయినను నావశ్యక మయ్యెనో పరిశీలింతము.

మూలములో—బ్రహ్మదేవుఁ డింద్రాది దేవతలకుఁ దారకాసురవధోపాయమును, నందుకై మునుముందు చేయవలసిన కార్యమును జెప్పి యంతర్ధాన మయినాఁడు. అప్పుడు—

'తత్ర నిశ్చిత్య కందర్ప మగమత్ పాకశాసనః
మనసా కార్యసంసిద్ధౌ త్వరాద్విగుణరంహసా'—

దేవేంద్రుఁడు కందర్పుఁడే యిందుకుఁ దగినప్రయోజకుఁడని యతనిఁ దలఁచినాఁడు. వెంటనే మన్మథుఁడు—

'అథ సలలితయోషిద్భ్రూలతాచారుశృఙ్గం
రతివలయపదాఙ్కే చాప మాసజ్య కణ్ఠే

సహచరమధుహస్తన్యస్తచూతాఙ్కురాస్త్రః
శతమఖ ముపతస్థే ప్రాఞ్జలిః పుష్పధన్వా'

ప్రాంజలియై దేవేంద్రునెదుట సాక్షాత్కరించినాఁడు. అప్పు డతనివెంట నున్నవాఁడు హస్తన్యస్తచూతాంకురాస్త్రుఁడు, సహచరుఁడు, మధుఁడు మాత్రమే. దేవేంద్రుఁ డతనియెడఁ బ్రయోజనాపేక్షచేత నేయనుకొనుఁడు-ప్రత్యేకాదరము చూపి తనయాసనమునకుఁ జేరువ నతనికిఁ బీఠ మొసఁగి సత్కరించినాఁడు. పాపము! దేవేంద్రుఁ డందఱిలోఁ దన కిట్టి సత్కారము గావింపఁగానే కందర్పునికి బుజములు నాలుగైనవి! అంతలో సంతోషముచే నుప్పొంగి పోయి—

'తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి
సహాయ మేకం మధు మేవ లబ్ధ్వా
కుర్యాం హరస్యాపి పినాకపాణేః
ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోఽన్యే !'

అని సవాలు చేసి మీసము దువ్వినాఁడు. దేవేంద్రుఁ డిదే యదను యతనిని గొండమీఁదికి నెక్కించి సన్నగాఁ బని వినిచినాఁడు. అంతతో నూరకొనక,

'ఐరావతాస్ఫాలనకర్కశేన
హస్తేన పస్పర్శ తదఙ్గ మిన్ద్రః'

బుజము తట్టి పురి యెక్కించినాఁడు. ఇంద్రుని పాచిక బాగుగా పాఱినది. మన్మథుఁడు—

'స మాధవే నాభిమతేన సఖ్యా
రత్యా చ సాశఙ్క మనుప్రయాతః

అజవ్యయ ప్రార్థిత కార్యసిద్ధిః
స్థాణ్వాశ్రమం హైమవతం జగామ'

రతీమాధవులతో హిమవంతమునకు బయలుదేఱినాఁడు. ప్రాణములు పోయినను సరే, దేవకార్యము నెఱవేర్తు నని యప్పటి యతనిపూనిక! పాపము! రతీమాధవుల కీ కార్య మిష్టము కాదు. ఎదు రాడుటకు వారికి దిటవు చాలదు. ఐనను దేవకార్యము! మన్మథుఁడా దేవేంద్రుఁడు త్రావించిన స్తోత్రసుధను గ్రోలి యా కైపులో నున్నాఁడు. అతని కప్పు డెడలు తెలియదు! అందుకనియే వారు చేయునది లేక 'సాశఙ్కము'గా నతనివెంట బయలుదేఱినారు.

ఈ చోట నన్నెచోడుఁడును సాశఙ్కుఁ డయినాఁడు. అతనికిఁ గలిగినశంకలు మూఁడు! మూలములో—ఇంద్రాస్థానమునకు మన్మథునివెంటఁ బోయినవాఁడు. నతనివెంట నుండినవాఁడు వసంతుఁ డొక్కఁడే! హిమవంతమునకుఁ బోవు నపు డీ రతి యెక్కడినుండి వచ్చినది? ప్రయాణమునకు ముం దతఁ డింటికిఁ బోయి రతిని వెంటఁ గొనిపోయినాఁ డన వలయును. లేకున్న నింద్రుఁడు తన్నుఁ దలఁచినట్లే తాను రతిని దలఁచి సంకల్పముచేతనే యామెను దనయెదుటికిఁ దెప్పించుకొనినాఁ డనుకొనవలయును. ఇంత సాహసకార్యము పూనుకొనువాఁడు తుదకు మాటవరుస కయినను రతితోఁ దన ప్రయాణవిషయ మెఱిఁగింప వలదా? పోనిండు. రతి యయినను దన మగనిపూనిక యెఱిఁగి, మగనికిఁ గలుగఁగల ప్రమాదమును శంకించి, యందుచేఁ దనకు సంభవింపఁగలదుఃస్థితి దలఁచుకొని

మగనికిఁ దన దిగులునెగులు తెలుపకుండునా? రతికి మన్మథుని కార్యసాధకత్వమున గట్టివిశ్వాసము కల దందు రేమో! అతనిలోఁ దన కెంత విశ్వాస మున్నను, నతఁ డెంత కార్యచతురుఁ డైనను రతి యాఁడుది గదా! ఆమె యబలాత్వ మెక్కడికిఁ బోవును? తెగఁబడి ముందునకు సాఁగిపోవుచున్న మగని–మాటవరుస కయినను—తన మాట చెల్లుబడి యయినను గాకుండినను దనకు నిమిత్తము లేదు—సతీధర్మముదృష్టితో నయినను వారింపవలదా?

ఇవి నన్నిచోడునికిఁ గలిగినశంకలు! అందుకయియే యతఁ డీపట్టున 'రతిమన్మథసంవాదము'ను సృష్టించినాఁడు! ఈ ఘట్టములో నీ కల్పనము ఔచితికి జీవము పోసినది! కావ్యమున రసము నిర్వహించినది!

ఈ కల్పనమే లేకున్న—ఈ సంవాదసృష్టియే జరుగకున్న—నీ కావ్యములోని రతి యొక బ్రొమ్మ. స్వతంత్రవ్యక్తి లేనిది.

నన్నిచోడుని కుమారసంభవములో—

అమరేంద్రుఁ డమరావతికి వచ్చి పచ్చవిలుతుని రావింపఁ బుచ్చినాఁడు. కుసుమాయుధుఁడును దదాజ్ఞాప్రేరితుఁడై యాతఁడు కదలి –

'పూవుల తేరు జక్కవలు
పూన వసంతుఁడుఁ దాను నెక్కి కీ
రావళి గోకిలాళి మల
యానిలముం దనుఁ గొల్చి పొల్చి రాఁ

గా వరమీన కేతనము
 గ్రాల నళివ్రజశంఖకాహళా
రానములుం జెలంగ నమ
 రావతికిం.........'

రాజోచితముగాఁ జనుదెంచినాఁడు. అప్పు డాతనివెంట రతి లేదు. కాకున్నను రాజాస్థానమునకు రతిరాక యంత సరసము కాదు. సురరాజును ముదితహృదయుం డై 'సముచితాసనతాంబూలదానసన్మానాదులచే మన్మథునిఁ బ్రహృష్ట మనస్కునిఁ జేసినాఁడు. అంతటితో బుగ్గలు పెరిఁగి మన్మథుఁడు మహోత్సాహముతో–

'వెరవున భుజశౌర్యంబున
సురవల్లభ! పనుపు నీవ చూడఁగఁ బరమే
శ్వరు నైన నోర్తుఁ బెఱసుర
నరఫణిదివిజాధిపతులు నా కెదురుదు రే?'

—యని బడాయి కొట్టినాఁడు. అంతటితో నింద్రుఁడు తన సోదె నంతయు వెడలఁ బోసికొనినాఁడు. మన్మథుఁడు పాపము! ఆ మహోత్సాహములో విజృంభించి—

'పరముతపం బడంచి మఱి
 పార్వతియం దనురక్తుఁ జేయు మా
యిరువురకుం గుమారుఁ డుద
 యించిన మాపగ దీఱు నంచు న
చ్చెరువుగ నన్ని దొంతులును
 జెప్పఁగ నేటికి? వానిపై సు కే

శ్వర ! నను౯ బంపు మీాక్షణము
చంపెద మీాపగ దీఱ౯ దారకున్.
తారకు నోర్వఁగ వేఱ కు
మారకు౯ బడయంగ సంగమము సేయను ము౯
వారలపై౯ బంపనినా౯
డారిపుపై౯ బంపు మాత౯ డధికు౯డె నాకున్ ?'

అని సులభోపాయము చెప్పివేసినాఁడు !

తారకు నీక్షణములో నిగ్రహింప౯ గలనే. ఇందుకై పార్వతీపరమేశ్వరులకు సంగమము కలుగఁజేసి, వారికి బిడ్డఁడు పుట్టి, యతఁడు పెద్ద పెరిఁగి, తారకు సంహరించుటవఱకు నేల కాచుకొని యుండవలయును? ఇప్పుడే యొకచిటికెలో నీ కార్యము తుదముట్టింతునే యని యతని యాతురత. ఇది యెటు లున్న దనఁగా—మన స్నేహితు౯ డొకడు మన కొక కార్యము౯ జెప్పె ననుకొనుఁడు. అతనికి సహాయము చేయవలయు ననునాతురతలో మన మతనికి 'ఇంత ఎందుకోయి? సులభంలో అయ్యేపనికి?' అని అతనికి నుపాయము చెప్పిన ట్లున్నది. అతఁడు వెంటనే 'అది కాదోయి! ఆమాత్రం నాకూ తెలియక పోలేదు. అలా చేస్తే యీా చిక్కు ఉంది' అని తెలియపఱచి మన సలహా నుపేక్షించినట్లుగా నే యిక్కడ నింద్రుఁడు 'నీ కసాధ్యం బెందును లేదు. ఐనను బరమేష్ఠివచనం బలంఘనీయం బగుట నిదియ మనకు౯ గర్తవ్య' మని యొడంబఱచినాఁడు. ఇది యమూాలకమే యయినను లోకసహజముగా నుండి మూాల మునకు మెఱుఁగు తెచ్చుచున్నది.

అంతటితో దర్పకుఁడు దర్పించి—

'శూలి సేకొన్నతప మెల్ల నాలిసేసి
యతని దేహంబునందు సా మాలిఁ జేసి
కామకింకరుఁ జేసి నాకడిమి నెఱపఁ
గంటి, నీ ప్రస్తవము దీర్పఁ గంటి నెలమి'

నని తాంబూలము గైకొని దేవేంద్రునికడ సెలవు పుచ్చుకొని వసంతునితో నింటిమొగము పట్టినాఁడు.

పాపము! రతి యిక్కడ మతి తల్లడిల్లి పతి రాకయ వార్చుచున్నది. తనతో సుఖగోష్ఠివినోదములఁ బ్రొద్దు పుచ్చుచున్నమగని దేవేంద్రుఁ డెందుకో పిలిపించినాఁడు. కారణము తెలియదు. ఏొరలచిత్తము బ్రమాఁకులనీడ. దీనికిఁ దోడు 'అంతకంత కద్భుతములు దుర్నిమిత్తములు' పుట్టినవి. అందుచే నెంతయు బెగ్గలించి దుఃఖిత యయినది. ఏదో పనిబడి యధికారి యుద్యోగిని బిలువ నంపినపు డతనిసతీమణి పొందు సంతాపమువంటిదే యిది. ఇంతలో మన్మథుఁడు చనుదెంచి నాఁడు. అపుడు—

'పతిఁ జూచి రతి నిజాంత
ర్గతఖేదం బెలమి మఱపుగా నిడి కాలో
చితవచనాంతరముల సుర
పతి గడు వెస నిన్ను నేమిపని రాఁ బనిచెన్ ?'

అని తఱిమి యడిగినది. 'తనకు దుర్ణిమిత్తంబులు నిర్ణిమిత్తంబపుట్టుట' యెఱిఁగించి దీనానన యయి 'నీపోయి వచ్చిన కార్యం బెఱింగింపు' మనినది. మనసిజుఁడు 'పెద్దయు విశేషము

లే' దని తాను బరమేశ్వరుని తపోభంగమునకు మెయికొని వచ్చుట నెఱిఁగించినాఁడు. ఇది విని రతి యదరిపడినది.

'మన కులదైవ మతఁ డన్నన లేదేని
త్రిభువనారాధ్యుఁ డతఁ డెంక లేక
పరమయోగాత్ముఁ డతఁ భక్తి లేదేనియు
సర్వేశ్వరుం డనుశంక లేక
యజశిరోదళనుఁ డన్నదరు లేదేనియుఁ
గాలారి యనునోటికండ లేక
విషమాంబకుం డనువెఱపు లేదేనియుఁ
బ్రళయాగ్నిరుద్రుఁ డతఁ భయము లేక
పంచె నట్టి యుగ్రుపై నిన్ను నది మీఁదఁ
బోయి తనకు లగ్గబోయి లగ్గ
వచ్చునే ప్రధానవైరేణ మరణంబు
ధ్రువ మనంగ వినఁడె దివిజవిభుఁడు.

అని యీ పూనికకుఁ గారకుఁ డగుదివిజవిభునిఁ దూలనాడినది. అంతతో నూరకొన లేదు.

'ఆనాకంబునఁ గలయ
మ్మానిను లందఱును నీకు మన మిడి యున్నన్
దాని సహింపక సురవిభుఁ
డీనెపమున జంపఁ దలఁచి యీ పనిఁ బంచెన్.

నినుఁ జూచినకన్నుల సుర
వనితలు దనుఁ జూడకున్న వాసవుఁ డలుకం
జని చా నిన్ బంచిన జాఁ
జనునే? యాతనిచలంబ సాధ్యము గాఁగన్'

అనినది. సురవిభుఁ డీతనిఁ బంచుటకుఁ గారణ మిదియే యని రతి యభిప్రాయము. రతికిఁ దనమగని సౌందర్యముపై నెంత విశ్వాసము! ఇట్టి సందర్భములయం దాఁడువారి కిట్టి కారణములే తోఁచుట సహజము.

ఈ పూనిక తగ దనుతలఁపునకు రతి తన యత్త మామల 'ఓటు' కూడఁ దానుగానే కయికొన్నది.

'త్రిదశులు పిల్చి పంపు టొక
తేజముగాఁ గొని దేవదేవు నె
ల్లిదముగఁ జెప్పి యింత గొని
లేవడి లేచెదు ప్రాణగొడ్డ మా
డెదు మది నోటికండ సెడి
దెప్పరికంబులు సేసె దిట్టిక్రో
వ్విదములు దక్క మీపలుకు
విష్ణుఁడు లక్ష్మియు విన్న మెత్తురే?'

మీ తలిదండ్రులు విన్న దీని నే మందురు? అని తన మాటపైఁ గాకున్నను దలిదండ్రులకు వెఱచి యైనను నతఁడు తన పూనిక మాను నని యామెతలఁపు. ఇట్టి సాహసకార్యమునకుఁ జూచి చూచి యతని తలిదండ్రు లొడఁబడఁ జాల రని యామెకుఁ దెలియును. కడకు 'రుద్రున కుఱక పైఁ జనిచెనయుట శిఖిశిఖల మిడుత చెనయుట గాదే' అనినది.

మన్మథుఁ డిది విని—

'ఏ నలరమ్ము లొడ్డఁ బరమేశ్వరు
చిత్తము గారిచిత్తముం

దాన కరంగి కూడ మఱి దానికి
సందియ మేల వెండియుం
బూనెద మూఁడులోకములఁ
బుట్టినిపూనికి వారిమేనులు
న్నానుగఁ గూర్తు నొక్కటిగ
మార్గణకౌశలభావ మేర్పడన్ '—

అని మీఁదు లేక పలికినాఁడు.

శ్రుతి మించినది. రతి యిఁక లాభము లేదనుకొన్నది. కర్తవ్యబోధ కావించుటయే తనకుఁ గర్తవ్య మనుకొన్నది. పరమేశ్వరుని మాహాత్మ్య మెఱిఁగించి తన మగఁడు తన యశక్తతను గుఱుతించునటుల చేయ వలయు నని యామె ప్రయత్నము. అందుకై పరమేశ్వరునికిఁ, దన ప్రాణేశ్వరునికిఁ గలయంతరమును జూపించుచున్నది.

'అతని శరాసనంబు గన
కాచల, మిక్షుశరాసంబు నీ,
కతనికి నమ్ము పాశుపత,
మంటినఁ గందెడుపూవు లమ్ము నీ,
కతఁడు పురాపహారి, విర
హాతురపాంథజనాపహారి నీ,
వతనికి నీకు 'హస్తిమశ
కాంతర' — మనినది.

నీ మృదుపుష్పకాండనికర మీశుఁ దలఁచు మహాత్ముల హృదయములపై నే పని చేయఁజాలవు కదా! ఇఁకఁ బరమే

శ్వరునిపైఁ బని చేయునా యేమి? యని తేలనాడినది. అంత టితోఁ బోలేదు.

'అండుదాన నబల నైననే నించుక
యలిగి చూచుడును భయమునఁ దలరు
దుగ్రు నుగ్రలోచనోద్భూతవహ్నికి
నెదిరి నిలువ నీకు నెంత కోలఁది?'

యని యతనియశక్తత నతని మనసున కెక్కఁ గొలిపి నది. ఇంతపాటి పిఱికివాఁడ వీ దొడ్డకార్యము నెట్లు పూనితి వని దెప్పాట యిది—

'నీ పరివారమును, నీ యాయుధాదికమును నమ్మి యుగ్రుపైఁ బోకు సుమా! అవి నిన్ను నట్టేట ముంపఁగలవు. వానిని నమ్ముట కుక్కతోఁక పట్టుకొని గోదావరి యీఁదుట. నీ పరివారపుబండారము బయటఁ బెట్టెద నిదిగో చూడు' అని—

'కొని బాలు రైనను దిని పిప్పి యుమిసెడు
చెఱకు విల్లని నమ్మి చేతఁ బట్టి
మొలఁతల తలవెండ్రుకలఁ బొంది కందెడు
నలరుపుష్పము లమ్ము లని తలంచి
తలిరాకు లైనఁ గదల్ప నోపనిమంద
పవనుండు నొక పెనుప్రాపు గాఁగ
నబలలు పోషిన నాకాశమునఁ బాఱు
నలిశుకములు మూలబలము గాఁగ

నెంత వేసవి ముట్టిన నెండఁ గమరు
ననువసంతుఁడు దగుసహాయంబు గాఁగఁ
గాకిపిల్లల కోడుపికములు పోటు
మగలుగా నుగ్రుపైఁ బోవఁదగున? మదన!'

అనినది. మగని యశక్తత నతనికి రూపించుటతో నామెపని ముగియ లేదు. ఎదిరి సామర్థ్యాదికమును, శత్రు భయంకరత్వమును రూపించిననే తన వాదమునకు బలము చేకూరినట్లు. అప్పుడు గాని మదనుఁడు తన పూనికనుండి విరమింపఁడు. అందుకై యీశ్వరమాహాత్మ్యమును—

'హరికంకాలము చేతిముద్ర, దివిజేం
ద్రాస్థుల్ సుభూషావళుల్
గరళం బభ్యవహార, మంతకతను
త్సారంబు మైపూఁత, పం
కరుహాసీనశిరఃకపాల మురుభి
క్షాపాత్రగా, విశ్వసం
హరు వర్తించుమహావ్రతోపహతి సే
యం బూన నీప్రాప్తియే?'

అని ప్రతిపాదించుచున్నది. ఇందుఁ జేర్కొన్న వన్నియుఁ బరమేశ్వరుని ప్రతాపక్రీడలే!

పాపము! రతి గావించిన యీ యుపన్యాస మంతయు బూడిదలోఁ బోసినపన్నీ రయినది. మదనుఁడు తన మాట చెవిఁ బెట్ట లేదు సరికదా తన సామర్థ్యము చాటఁ దొడఁగి నాఁడు. అశేషదివ్యశక్తు లెంత శేషంబు లయ్యును నతి

కోమలం బైనకామశక్తికి లోనై మృదుభావంబునం బొందు నఁట! మఱియు,

'అదిమి పట్టినఁ గరుతైనఁ జదియునట్టి
కడిఁదిబలు లగుమగ లొత్తి కౌఁగిలింపఁ
గుసుమకోమలు లగుసతు లోర్చుకొనుటకుఁ
గనియు నెఱుఁగవె విపరీతకామశక్తి'

యనుచున్నాఁడు. ఇందుకై యజునివరము కూడఁ దనకుఁ గల దని యతఁడు రతిని నమ్మించుచున్నాఁడు.

'ఆరయఁగా స్త్రీపురుషా
కారములై చిత్తవృత్తి గలిగినఁ జాలుఁగా
వా రెల్లఁ గామవశు లగు
వా రని నియమించి నాకు వర మజుఁ డిచ్చెన్.'

ఈ మాటతో మదనుఁడు తన సతి నొడంబఱిచినాఁడు. రతి యొడఁబడినది. మదనుఁడు పరివారముతో హిమవంతమునకు బయలు దేరినాఁడు—ఇది కథ.

ఈ పట్టున నీ రతిమన్మథసంవాద మమూలక మయినను రసవంతమై, హృదయంగమమై, ఔచితీపరిపోషకమై, రతిని జక్కఁగాఁ జిత్రించినది. మదనుఁ డిందుఁ దన ప్రయాణమును బ్రతిషేధించుచున్న సతి నొడంబఱిచి స్వామికార్య ప్రవణుఁ డయినాఁడు. ప్రతిషేధము బలవత్తర మయ్యు మదనుఁడు తనమాటపై నెట్లు నిలిచెనో యిది తెలుపుచున్నది. ఈఘట్టము మదనుని పూనిక నొక యొఱగలై పరీక్షించి యతనికి లోకోత్తరత్వమును జేకూర్చుచున్నది.

---

# కవితా శిల్పము

ప్రతిభావ్యుత్పత్తులలో ప్రతిభ గరీయసి. తొలిది దైవ దత్తము; జన్మాంతరసుకృతలభ్యము. మలిది నిరంతరకృషి సాధ్యము. ప్రతిభ చాలనివాఁడు వ్యుత్పన్నుఁ డయ్యుఁ బ్రకాశింపఁ జాలఁడు. ప్రతిభావంతుఁడు వ్యుత్పన్నత కొఱవడినను బ్రకాశించును. కవి, శిల్పి కివి రెండును రెండుకన్నులు!

శిల్పము – కవిత – ఇవి రెండును రెండు విశిష్టకళలు! ఒకటి దృగ్గోచరము. మఱొకటి మనోగోచరము. తొలిది భౌతికపదార్థనిర్మితి. మలిది వాఙ్నిర్మితి. ఒకటి లౌకికరసానుభూతిని సాధించును. మఱొకటి యలౌకికరసానుభూతిని దన్మయులఁ జేయును. కాఁగా, శిల్పకారునకును, గవీశ్వరునకును బ్రతిభావ్యుత్పత్తులు రెండును సమానములే. పర్యవసానము కవిత యొక శిల్పము, శిల్ప మొక కవిత.

నన్నిచోడమహాకవి కవితను ఉత్తమశిల్పము కాఁ బోల్చినాఁడు. ఈ పద్యముఁ జూడుఁడు:

పరఁగ సువర్ణబంధమ్ముదు
భావవిశేషము లోనఁ జూచినన్
బొర పగుచిత్రరూపమును
బోలె ససత్కవికావ్య మిమ్మహిన్
బరఁగు సువర్ణబంధమ్ముదు
భావవిశేషము లోన వెల్వలన్

సరి యగు రత్నపుత్రికయు
సత్కవికావ్యము నొక్కరూప మై.

—అవతారిక.

సమర్థుఁ డగుశిల్పకారుని యమృతహస్తమునఁ గఠిన శిలలు కూడ వెన్నవలెఁ గరఁగి దివ్యరూపములఁ దాల్చినట్లు ప్రతిభాశాలి యగుకవీశ్వరుని చేతిలో భావములవెంబడిబడి పలుకులు మలఁకలు దిరిగి హృద్యపద్యరూపములఁ దాల్చును.

'అల్పాక్షరముల ననల్పార్థరచన
కల్పించుటయ కాదె కవివివేకంబు'

అని పాలకుఱికి సోమనాథుఁడు మేలిభావములకు నక్షర రూపములఁ గల్పించుటయే కవివివేక మని పేర్కొనినాఁడు. ఇట్టి శిల్పరచనమునకుఁ దొడఁగినవారు హేమాహేమీలు - అనేకులు. అందు నన్నిచోడమహాకవి యీ శిల్పరచనములో నెట్లు కృతార్థుఁ డయ్యెనో చూతము.

సప్తమహర్షులు పార్వతిని జూచి వచ్చి 'యపర్ణారూప వర్ణనాకర్ణనదత్తకర్ణుం' డైనపరమేశ్వరునితో నామె సౌంద ర్యాదికమును బ్రస్తుతించుపద్య మిది :

'హరినీలోపమమధ్య కేశి శశిబిం
బాస్యోష్ఠ రాజీవ కే
సర నేత్రామలగంధ విద్రుమలతా
సద్వర్ణ తన్వంగి సిం

ధురకుంభాలసయానపూర్ణకుచ సం
స్తుత్యారుణాబ్జాంఘ్రికం
ధర శైలాత్మజఁ జెప్ప నొప్పగు సుధా
ధామార్ధచూడామణీ!'

—8 ఆ. 5 ప.

ఇందు పార్వతిప్రత్యంగవర్ణనము ప్రత్యేకప్రత్యేకముగా నుపమానాత్మకముగాఁ జేయఁబడినది. పార్వతి – హరిమధ్య, నీలకేశి, చంద్రాస్య, బింబోష్ఠ, రాజీవనేత్ర, కేసరగంధి, విద్రుమసద్వర్ణ, లతాతన్వంగి – సింధురాలసయాన, కుంభపూర్ణకుచ, అరుణాంఘ్రి, అబ్జకంధర—యిట్లు, ఇది యిట్లు సులభగ్రాహ్యముగాఁ బైకి గోచరించుచున్నను గవి యిం దొక వింతశిల్పము కూర్చినాఁడు. ప్రత్యంగవర్ణనాత్మకమైన యొక్కొక్క సమాసపదమునను, ఉపమానపదములు రెండును గలసి యొకటే సమాసపదముగా, నొకటే యుపమానవాచకముగా గోచరించునట్లు, పాఠకు లట్లే భ్రాంతి చెంది తికమకలు పడునట్లు వింతకూర్పు కూర్చినాఁడు. ఉపమానవాచకముల జంటల నివి చూఁడుడు:హరినీల, శశిబింబ, రాజీవకేసర, విద్రుమలత, సింధురకుంభ, అరుణాబ్జ – ఇవి ప్రత్యేకసమాసపదము లై, యొకటే యుపమానముగా సామాన్యదృష్టికి గోచరించును. కాని జాగ్రత్తగాఁ జూచిన నివి రెండేసి యుపమానపదములు గలయేకోపమానార్థబోధకము లగుసమాసపదము లని తెలియును. ఇవి రెండు ఉపమానము లని తెలియక యేకోపమానపద మని భ్రమఁ జెందినఁ

బద్యార్థము కుదురదు. పద్యము కడపట నీశ్వరసంబుద్ధిగా నున్న 'సుధాధామార్ధచూడామణీ' యనునది సాభిప్రాయమై 'పై సమాసపదము ఏకోపమానబోధకము కాదు సుమా! అట్లు తలఁచిన నర్థము కుదురదు. ఆ సమాసపదమును సగమునకు విఱిచి చూడుము. ఇపుడవి రెండుపమానములై యర్థమునకుఁ బొందుపాటు కలిగించును' అని తెలుపుచున్నది.

రావిపాటి త్రిపురాంతకుని 'త్రిపురాంతకోదాహరణము' లోని యీ పద్యమును జూడుఁడు :

పామును హారముగ్ నెలయుఁ
బాపటసేసయు నేఱు మల్లికా
దామము తోలు దువ్వలువ
దట్టపుభూతియుఁ జందనంబు మై
సామునఁ జాల నందముగ
సన్నిధి సేసినజాడఁ గంటి నే
నామదిలోఁ గుమారగిరి
నాథుని శైలసుతాసనాథునిన్.

ఇచట 'శైలసుతాసనాథుఁ' డనుటచే నీశ్వరుని యర్ధనారీశ్వరత్వము ధ్వనితమై యిందలి పరమేశ్వరవర్ణనము కనులకుఁ గట్టినట్లు గోచరించును.

పార్వతీ ప్రత్యంగవర్ణనసందర్భమునందలి మఱొక పద్య మిది చూడుఁడు :

అలికేశీ లక్తకాదలపాదతలములు
నమృతాంశుముఖ శుక్తికాంఘ్రియుగముఁ

గంబుకంధర గ్రీవహిగర్భాభజంఘులు
బిసహ స్త రంభోరులసితరుచియుఁ
బూర్ణకుంభ స్తన పులిననితంబంబు
హరిమధ్య వేదిమధ్యాభినుతియుఁ
గుంభికుంభనితంబ కోక స్తనంబులుఁ
గరభోరు మృదులతాకరయుగంబుఁ
గామశరధిజాను క్రముకకంఠంబును
గమఠపాద వికచకమలముఖముఁ
బల్లవాంఘ్రితల సుబర్హిణాలకములు
నజున కైనఁ బొగడ నరిది కాదె.

—8 ఆ. 18 ప.

'దేవతానాం పాదాంగుష్ఠప్రభృతి వర్ణ్యతే, మానుషాణాం కేశా దారభ్య' అని—

దేవతావర్ణనము పాదాదిశిఖపర్యంతము చేయవలెననెడుసంప్రదాయానుసార మిందు వరుసగాఁ బార్వతి పాదతలములు, అంఘ్రియుగము, జంఘులు, ఊరువులు, నితంబము, మధ్యము, స్తనములు, కరయుగము, కంఠము, ముఖము, అలకములు నని దిగువనుండి మీఁదికిఁ బార్వతి ప్రత్యంగవర్ణనమారోహణక్రమమునఁ గావింపఁబడినది. ఇం దొక్కొక్క యవయవమును వర్ణించుచో నొక్కొక్కచోటను బ్రయోగింపఁబడిన దేవీవాచకపదము లివి – అలికేశి, అమృతాంశుముఖ, కంబుకంధర, బిసహస్త, పూర్ణకుంభస్తన, హరిమధ్య, కుంభికుంభనితంబ, కరభోరు, కామశరధిజాను, కమఠపాద,

పల్లవాంఘ్రిత్రిపల్లవాంఘ్రితల—యవరోహణక్రమమున నుండుటను మనము గుఱుతింపఁగలము. ఈ పద్యములో నింత వింతశిల్పము నద్భుతముగాఁ జిత్రించి పార్వతి సౌందర్యప్రశంసావ్యాజమున 'అజున కైనఁ బొగడ నరిది గాదె' యని నన్నిచోడఁడు తన పద్యశిల్పమును దానే ప్రశంసించుకొనినాఁడు.

ఈ యారోహణావరోహణ వర్ణనాసూచన మీ పద్యము తరువాతి వచనములో నిట్లు కలదు.

'అని యనేకప్రకారంబుల నగజరూపవిభ్రమసౌందర్య విలాసంబును నారోహిణ్యవరోహిణుల వర్ణించుచున్న సప్తర్షి మహర్షుల వచనంబు లతనుపంచబాణంబు లైన ట్లిందుధరు డెందంబు భేదించిన...'

ఆ సందర్భమునందలిదే యింకొక పద్య మిది చూడుఁడు :

క్రొవ్విరు లెసఁగి పూగొలల మోఁపోపక
నవకంపులేఁదీఁగె నెవులునట్లు
వీఁగారుచనుఁగవ వ్రేఁగునఁ గాఁదీఁగ
వడువసివాళులు వాడుచుండు
విలసిల్లు నిండారు వెన్నెలలోఁ గారు
వెన్నురుదీఁగెలు వెలుఁగునట్లు
తెలిమోముపైఁ బర్వి తోలఁకాడుచాయలో
మెలరారుకనుఁగవ మెఱుఁగు లడరఁ
దావి వొంపిరి వోవునెత్తమ్మివలన
వెలయు కంపారి తెమ్మెరల్ వీచునట్లు

కమ్మవా తెఱవాసన గలసి కలయ
పోడు ముట్టుచు నూర్పులు సుడియుచుండు.
—8 ఆ. 9 ప.

ఈ పద్యములో నొకపాద ముపమానముగను, దరు వాతిపాద ముపమేయముగను బద్యమందంతట నుండుట గోచరింపఁ గలదు. సీసపద్యరచనములో నిది యొకపద్ధతి శిల్పము! బేసిపాదము లుపమానములు, సరిపాదము లుపమేయములు—

'ప్రియాగమనవేళాయాం
మదనావేశసంభ్రమాత్
విభ్రమో గంధహారాది
భూషాస్థానవిపర్యయః'

అని విభ్రమలక్షణము లక్షణగ్రంథములలోఁ జేర్కొనఁబడినది. ఈ 'విభ్రమము'ను కవులు వేలమువెఱ్ఱిగా వర్ణించినారు. పారిజాతాపహరణములోని యీ పద్యమును జూడుఁడు.

మదవతి యొకతె పరాకునఁ
బదాంగదము కంకణముగఁ బాణిఁ దొడిగె న
య్యదువల్లభుఁ గనుఁగొనుచుం
దుది నదియును మేను వొంగి తుత్తుము రయ్యెన్.
—3 ఆ. 18 ప.

అందఱు కవులవలెనే నన్నిచోడఁడును నీ 'విభ్రమము'ను వర్ణించినాఁడు. పరమేశ్వరుడు హిమవంతుని నగరమున కరుదెంచినప్పుడు పురకాంతలతనిఁ జూడఁబోవుచుఁ బొందిన విభ్రమ వర్ణన మది. ఆ వర్ణనములో నొకప్రత్యేకత కలదు. ఈ పద్యముఁ జూడుడు :

వెలిమిడి నలికంబు చెలువంగఁ బోవుచ
తెలుపార మైనిండ నలఁదికొనుచుఁ
బూవులు దుఱుమంగఁ బోవుచ వఱఁ గొంత
దోఁపంగ ముందలఁ దుఱిమికొనుచు
మోవి లత్తుక పూయఁ బోవుచ లాలాట
పట్టికఁ దిలకంబుఁ బెట్టుకొనుచుఁ
గాటుక మొదుచుచ కన్నుల నిడఁబోయి
పొల్తుక గళమునఁ బూసికొనుచు
సితరుచిందుఖండశిఖినేత్రగరళంబు
లొడల జడల నుదుట మెడను దాల్చి
పొల్చుశంభు నోర్తి పోలి చూపఱు దన
కెఱఁగుచుండ వచ్చె నీశుఁ జూడ.

—8 ఆ. 66 ప.

ఈశ్వరునిఁ జూడ వచ్చుచు నొకకాంత భూతిని ముఖమునఁ దాల్చుట మఱచి యొడలెల్లఁ బూసికొనినది. కొప్పునఁ బూవులు ముడువ మఱచి ముందల వలపక్కనఁ గొంత చెఱివికొనినది. మోవికి లత్తుక పూయ మఱచి లలాటములోఁ దిలకముగాఁ బెట్టుకొనినది. కన్నులఁ గాటుక నిడఁబోయి మఱచి గళమునఁ బూసికొనినది. ఇట్టి భూషణాదివిపర్యయ మామెకు మేలే చేసినది! ఆ విపర్యయ మామెకును దెలియకయే యొక ప్రత్యేకతను గోచరింపఁ జేసినది. అందుచే నామె 'సితరుచిందుఖండశిఖినేత్రగరళంబు, లొడల జడల నుదుట మెడను దాల్చి పొల్చుశంభు'నిఁ బోలి యుండెను. ఆమెను జూచి నిజ

మయినయీశ్వరుఁడే యేమో యని చూపఱు లామెకు సాష్టాంగపడుచుండిరి. అట్లు గదా యదృష్ట ముండవలయును! ఆ యదృష్ట మామెకు నన్నిచోడని ప్రసాదము!

సాయంసంధ్యానంతరము నక్షత్రోదయ వర్ణనపద్య మిది చూడుఁడు :

సరసిజహితుఁ డట చనఁ దరతర మ
త్యరుణరుచిఁ మెఱుఁ గడరుడు వడి నం
బరమున నుడుతతి ప్రవిమల మయ్యెఁ
నిరుపమ 'మణిగణనికర'విభాతిఁ.

—8 ఆ. 92 ప.

ఇందలి తొలిమూఁడుపాదములతో నక్షత్రోదయవర్ణనము పూర్తి యయినది. నాలుగవపాదమున నానక్షత్రములను మణిసమూహములతో నుపమించుచుఁ బద్యము ముగింపఁబడినది. ఇం దొక విశేషము : ఈ పద్యము 'మణిగణనికరము' మణిగణనికరమును 'మణిగణనికరము'లోనే పేర్కొనుచు నా పద్యనామము సర్లే యా పద్యమునఁ బొందించుటలో నన్నిచోడనికిఁ బ్రత్యేకప్రయత్న మున్నటుల గోచరింపక మానదు. 'మణిగణనికర' మనుపదమును మాని తత్సమానార్థక మయిన వేఱొకపదముతోఁ బద్యము పూర్తి చేయవచ్చును. కాని యది నన్నిచోడని కిష్టము కాదు. విశిష్టశిల్పనిర్మాణమువైపునకే ప్రతిభావంతుని ప్రజ్ఞ మ్రొగ్గు సూపుచుండును!

మఱొక పద్య మిది చూడుఁడు—

ఆహార్యాద్రి మరల కతుల
హర్ష మెసఁగ దేవసం

దోహమునకు వీరలక్ష్మి
తోడఁ గొందెఁ బు
ణ్యాహఘోష మెసఁగె మునిజ
నాశయమ్ముల 'న్మహో
త్సాహ మయ్యె 'నక్కుమార
సంభవంబు'నం దొగిన్

—10 ఆ. 50 ప.

ఇందు కుమారసంభవానంతరము మునిజనోత్సాహము 'ఉత్సాహ' వృత్తములో నభివర్ణింపఁబడినది. గ్రంథనామము 'కుమారసంభవము' కూడ నిందుఁ బొందుపఱుపఁబడి యుండుట మఱియు నొక విశేషము! రెండవపాదము ముద్రణమున గణభంగము కానవచ్చుచున్నది.

ఇట్టిదే ప్రథమాశ్వాసములో మఱొక పద్య మిది చూడుఁడు:

హృదయాహ్లాదముతోడఁ బాయక సదా
నైకప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగుచున్న విలస
'న్మత్తేభవిక్రీడితం'
బది దాక్షాయణి సూచి కౌతుకరతై
కాలీనభావాభిలా
షదృగత్యుజ్జ్వలదీధితుల్ వఱపె నీ
శానాననాబ్జంబుపైన్.

—1 ఆ. 101 ప.

ఇందు మత్తేభవిక్రీడితమున వర్ణించుచుఁ దద్వర్ణనము 'మత్తేభవిక్రీడితము' లోనే గావించుటలో కవి స్వ... యత్నుఁ డని స్పష్ట మగుచుండుట లేదా



మహాకవులు సూర్యచంద్రోదయాస్తమయాది వర్ణనలను దత్తత్కథావస్తు సందర్భసముచితములుగాను, నందుచే నౌచితీవిలసితములుగాను గావించుట కలదు. నన్నిచోడఁడును గథావస్తువునకు సందర్భించునట్లుగా నొకచోఁ జంద్రోదయ వర్ణనము చేసినాఁడు. ఆ వర్ణనమునకుఁ బూర్వవచనములో నిట్లు కలదు: 'ఇట్లనేకు లనేకప్రకారంబులం గామకేళీలాలసు లగుచుండి రంత నక్కడ – హిమవంతుని నగరములోని పౌరుల, పౌరస్త్రీల కామకేళీకలాపము లంతకు మునుపు వర్ణింపఁబడినవి. ఆ సందర్భమునకు సరిపడునట్లుగ, ఔచితీ విలసితముగఁ జేసిన యీ చంద్రోదయవర్ణనము చూడుఁడు:

తమ మనునీలవర్ణపరి
        ధానము వీడఁగఁ బూర్వశైలశృం
గము లనున్నతస్తనయు
        గంబు దనర్పఁ జకోరబంధువ
ర్గము ముద మొందఁగా నిజ
        ముఖద్యుతి వెల్వుగ నిందుగర్భచి
హ్నము లభిరామ మయ్యె నమ
        రాధిపదిక్సతికిం గ్రమంబునన్.

ఈ రసోచితిపిత్సిత రచనమును జదివినవారు నన్నిచోడని ప్రతిభకు జోహారు లర్పింపక మానరు! తిక్కన సోమయాజియు నిట్టి రసౌచితినే పాటించుచుఁ గథాసంగతి సూచకముగా సూర్యచంద్రోదయాది వర్ణనల నచ్చటచ్చటఁ జేసి యున్నాఁడు. విరాటపర్వములోని యీ క్రింది పద్యము చూడుఁడు :

ద్రుపదనందన పరిభవదుఃఖమునకు
నుల్లమున మరపిల్లుచు నున్న సరసి
వేఁడినిట్టూర్పులో యన వెడలెఁ గ్రొత్త
తావి మూతులు విచ్చు నెత్తమ్మివిరుల.

—2 ఆ. 236 ప.

పై సందర్భమునందలిదే నన్నిచోడని చంద్రవర్ణన పద్య మిది చూడుఁడు :

రంజిల్లుపూర్వదిక్సతికటిమణికాంచి
రంజిల్లునాయకరత్న మొక్కొ
విలసిల్లున ద్దేవి వృత్తస్తనాంతరా
పూరితకాశ్మీరపుంజ మొక్కొ
తనరారునాహరిత్తరళాక్షి పరిపక్వ
బింబారుణాధరబింబ మొక్కొ
మేలిల్లునబ్బాలఫాలతటంబున
విలసిల్లురోచనతిలక మొక్కొ
నువ్వ మొప్పఁ దన సమాగమంబునకు నా
రమణివలనఁ బర్వురాగ మొక్కొ

యనఁగఁ దరతరంబ తనరె నత్యురుణాంగ
భాతిఁ గువలయైక బాంధవుండు.

—8 ఆ. 108 ప.

ఈ పద్యము తొలిపాదములోని పూర్వార్ధమున యతి తప్పినది. ఉత్తరార్థమున నొక 'రంజిల్లు' ఉన్నది కాన యిచట మఱొకపద మేదేని నుండవలయును. మునుపు పేర్కొనఁబడిన పద్యమునకువలెనే యిదియును శృంగారవర్ణన సందర్భమునందలిదే యగుట నీ వర్ణనమును శృంగారాత్మకముగా నుండుట గమనార్హమైనవిషయము! ఇందు మఱొక విశేషము కలదు. పూర్వదిక్సతి తన శరీరమున నలంకారార్థము దాల్చునలంకరణవస్తువులుగానే ప్రతిపాదమునను చంద్రుఁ డుత్ప్రేక్షింపఁబడుట, యా యలంకారవస్తువులును గటిమొదలు, కాంతాముఖముదనుక నారోహణక్రమముగా కటి, స్తనములు, బింబాధరము, ఫాలతలము ననుచోటులఁ దాల్పఁబడినట్లు వర్ణించుట యిందలి విశేషము.

ఇది శృంగారాత్మకమైనచో దీనికిఁ బ్రతిగా తిక్కనసోమయాజి వేదాంతార్థముగాఁ, బవిత్రముగాఁగావించిన సూర్యోదయవర్ణన మిది చూడుఁడు : చంద్రుఁడు రాగోద్దీపకుఁడైనచో సూర్యుఁడు — కర్మసాక్షి — ధర్మోద్బోధకుఁడు! అందుచేతనే మహాకవు లిరువురును చంద్రసూర్యవర్ణనముల నాయారీతులఁ గావించిరి!

నీరజాకరములు నిష్ఠమైఁ జేసిన
భవ్యతపంబులఫల మనంగ

దివసముఖాభినందితచక్రయుగ్మకం
బుల యనురాగంపుఁ బ్రోవనంగ
హరిహరబ్రహ్మమహానుభావంబు లో
కోటి గాఁగఁ గరఁగినగట్టి యనఁగ
నతులవేదత్రయలతికాచయము పెను
పొందఁ బుట్టినమూలకంద మనఁగ
నఖిలజగముల కద్దైన యగుచు జనస
మాజకరపుటహృదయసరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి
భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె.

—విరాట. 2 ఆ. 241 ప.

నన్నిచోడని సూర్యోదయవర్ణనపద్య మిది చూడుఁడు:

రాజరుచి వాయఁ గువలయరమణ దళుకి
కలయఁ దమ్ముల మొగముల నెలమి నిగిలె
శీతకరుఁ డైనరాజు వాసిన ధరిత్రి
వందుఁ గా కెందు దాయలు వగతు రెట్లు ?

—8 ఆ. 188 ప.

ఇట్లే 'తమ్మి'లను తమ్ముల (సోదరుల)ను గా వర్ణించిన ప్రభావతీప్రద్యుమ్నమునందలి పద్య మిది చూడుఁడు :

తామరసలక్ష్ము లాచందమామరాకఁ
గలఁగుచును గుములాలికై తొలఁగె నపుడు
తొలఁగుభావమె కాఁడె తమ్ముల వరించు
నట్టిసతులకు వలెఁడు మున్నిట్టిఁ డైన.

—4 ఆ.

నన్నిచోడని కవితకు ఔచితి యొక దివ్యాలంకారము! ఔచితీశిల్పనిర్వహణములో నన్నిచోడఁ డప్రమత్తుఁడు! దేవేంద్రుఁడు పరమేశ్వరునికి దండప్రణామము లాచరించి యాతని సంస్తుతించినసందర్భములో ని ట్లున్నది :

'అని నాగాభరణు నాగమురజబంధంబులఁ బ్రస్తుతించి యక్కుమారుండు న న్నేలినవాఁ డని యెఱుంగక యజ్ఞాన భావంబున నాచేసినయపరాధము సహింపవలయు...'

పరమేశ్వరుఁడు 'నాగాభరణుఁడు' కనుక నతనిని 'నాగమురజబంధము'లలోఁ బ్రస్తుతింపఁజేయుటలో నన్నిచోడఁ డెట్టియౌచితిని బాటించినాఁడు! పై వచనమునకు ముందు 'నాగమురజబంధములు' అని దిగువ నొక కందపద్య మున్నది. అది నాగబంధము కాదు. దానికిఁ బూర్వపద్యము నాగబంధములో నున్నది. కావున పై 'నాగమురజబంధములు' అను శీర్షిక 'శరణు మహేశ భూరితర' యన్న నాగబంధపద్యమునకుఁ బై నుండవలయును. ఆ నాగబంధపద్యములోఁ గొన్ని స్ఖాలిత్యములు దొరలి యున్నవి. బంధము‌ను జిత్రించి చూడఁగా నా స్ఖాలిత్యములు తెలియవచ్చినవి. ముద్రణమున నున్నపద్య మిది :

శరణు మహేశ భూరితర
చారుసుఖప్రద కామకాలసఁ
హర భవరోగదారణ సు
రాసురవంద్య శరీరదుఃఖదు

స్తర కమలాపహార హిమ
ధామ సమస్తగ సోమదేవ వి
స్తరతర మాదయారసయు
తా యురులబ్ధవిభావనామయా!

—10 ఆ. 84 ప.

పై పద్య మి ట్లుండవలయును :

శరణు మహేశ భూరితర
సారసుఖప్రద కామకాలసం
హార భవరోగదారణ సు
రాసురవంద్య శరీరదుఃఖదు
స్తర కమలాపహార హిమ
ధామ సమస్తగ సోమదేవ వి
స్తరితరమాదయారసయు
తా యురులబ్ధిప భావనామయా!

పై పద్యమున 'సారసుఖప్రద' యని, 'విస్తరితరమాదయా' యని 'యురులబ్ధిప' యని యర్థసంగతి కుదురునట్లు—బంధచిత్రణమునఁ జిక్కులు రానియట్లు—సవరింపఁబడినవి.

పార్వతీప్రత్యంగవర్ణన సందర్భమునందలి యీ క్రింది పద్యముఁ జూడుఁడు :

నడు మన దింతిచన్నులత
నర్పున ముందుఱు గాన రాదు, మా
కడుగిడుచోటఁ గా నెమలి
నంతన కానుకు బింద మయ్యెడుం

చోడిబడఁజేయు 'మావలన
దోసము' లే దని చెప్ప డాసె నాఁ
గడు బెడఁ గొందుగౌరి తెలి
కన్నులు వీనుల డాసి దేసి యై.

—8 ఆ. 16 ప.

ఇందు నేత్రవర్ణనము ప్రసక్తవిషయము. ఆ వర్ణనమును విలక్షణముగ నౌకానౌకసంప్రదాయసూచకముగ నన్నిచోడఁడు తీర్చినాఁడు.

కన్నుల దృష్టిదోషము తగిలి నడుము సన్నగిల్లి పోయిన దని యెవరో మేలోర్వనివారు పలికి రఁట! అందుచే నేత్రములు తమ నేర మేమియు లే దని, యది వట్టి కట్టుకథ యని, యపనింద యని, వీనులతోఁ దమ నిర్దోషిత్వమును జాటి చెప్పికొనుచున్నవి!

'కన్నుల తనర్పుచే మాకు నడు మెక్కడఁగనఁబడును? అసలు నడుము కనపడుటకు నవకాశమే లేనప్పుడిఁక దృష్టిదోషము మాట యెక్కడిది? ఇక నడు మస దని మీ కెట్లు తెలియ వచ్చిన దని యడుగుదు రేమో! ఈ కాంత యడుగుపై నడుగు వేయుచు నడచునప్పుడే నితంబభారముచే నామె నడుము 'విఱిగి పోయినది.' నడుము విఱిగి యామె కూలఁబడుటచే మా కావిషయము తెలియవచ్చినది. కాని 'మావలని 'దోషము'—దృష్టిదోషము—ఆవంతయు లే దని చెప్పుటకు గౌరి తెలికన్నులు వీనులను సమీపించినవి. ఇందు గౌరి

నేత్రముల యాకర్ణాంతవిశాలత చమత్కారముగా, సకారణ ముగా సమర్థింపఁబడినది.

ఈ 'దృష్టిదోష' విషయమే భారతమందును ప్రస్తావింపఁబడినది. కీచకుఁడు మోహాపరవశుఁడై ద్రౌపదికడ కేఁగి యామె స్వరూపాదికము నభివర్ణించుపట్టులోని యీ పద్య పాదమును జిత్తగింపుఁడు :

'సుదతి నీమైఁ జక్కఁ జూచుట కోడెదఁ
గనుబాటు వొరయునో యని తలంచి'
—విరా 2 ఆ.

'నీవు-తప్పఁ జూచిన-లోకములు చెడు నని పలుకుదురు. నీవు-చక్కఁజూచినను-మన్మథుఁడు చెడెను. ఇది యాశ్చర్యము' అని బృహస్పతి మన్మథుని పునరవతారమునకై ప్రార్థింపఁ బరమేశ్వరుఁడు ప్రసన్నుఁడై మన్మథు నుజ్జీవితుఁ జేసెను. అప్పుడు రతిపతి తనసతిమ్రోల నిలిచినవిధము :

మలయుచుఁ బొలుపారుమలయకేతనముతో
నెలరారుగెందలి రెల్లి గ్రాలఁ
దళుకొత్తునెత్తావియలరంపపొదులతో
మేలిల్లునించువి ల్గేల నమరఁ
జెలరేగునలిపికకులనినాదములతో
రాజకీరాలాపరవము లులియ
వేచి సమ్మదలీల వీచుతెమ్మెరలతో
నలి వసంతుఁడు గూడి నడవ నొండి ?

కామసుఖములతోఁ బూర్వకామ కేళి
కామచిహ్నాలు మెయి సురంగంబు గాఁగ
నెఱియఁ గై సేసి జవనిక దెఱచి వచ్చు
చెలువుతో వచ్చి రతిప్రోల నిలిచె మరుఁడు.

—9 ఆ. 246 ప.

పరమేశ్వరుని గౌరీప్రీతునిగాఁ జేయ నింద్రుఁ డాజ్ఞాపించి పంపునప్పటిమన్మథుని నాచనసోముని యుత్తరహరివంశములోఁ జూడుఁడు :

మకరంద మాని మై మఱచినగొనయంబు
వెడ ప్రోయఁ గడి వోనివింటితోడ
జలజకేసరరాజి జల్లెడమూకగా
దాటువతారిరథ్యములతోడఁ
గర్ణికారపుమొగ్గ కనకంపుగుబ్బగాఁ
గోయిలనోరూరు గొడుగుతోడ
రతి కన్నుఁగవ మచ్చరము సేయుటెక్కెంబు
వడక పీతెంచుసేవకులతోడ
వలపుఁదూపులు కరసాన వాఁడి చేసి
మందునెలతోడఁ దనమేనమామ యైన
నిండునెలతోడ వలరాజు నిర్జరేంద్రు
సభకు నేతెంచె భుజబలోత్సాహ మెసఁగ.

—2 ఆ. 194 ప.

మన్మథవర్ణనములో నీరెండుపద్యములును బోటీలు పడుచున్నవి! నన్నిచోడని మన్మథుఁడే కాదు. అతని కవితయు లోకమును ముగ్ధమునుగాఁ జేసినది!

ఇట్టి లోకవశీకరణమున కయియే యతఁడు కృత్యవతరణికలో మన్మథస్తుతి చేసినాఁడు. చూడుఁడు :

హరుఁ డాదిగ సకలచరా
చరమయజీవాళి నెల్ల సతతముఁ గామా
తురులుగ నలగతిఁ జేసిన
మరుఁ డీవుత మఖిలవశ్యమతి మత్కృతికిన్.

—అవ. 9 ప.

---

శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిన కుమారసంభవ మింటుఁ బ్రసక్తము.

# మార్పు కూర్పులు

నన్నిచోడకవి కవిరాజశిఖామణి. రాజ్యవ్యవహారమున నెట్లో కవితావ్యవహారమునను నితఁడు సర్వతంత్రస్వతంత్రుఁడు. బంధనమున కొడఁబడనిభావుకకవివిహంగ మితఁడు. వస్తువు పురాణమూలికమే యయ్యును నితని కుమారసంభవము నిజముగా నొక స్వతంత్రరచన మనఁదగును. శివపురాణము దానికి మూలగ్రంథమే యనఁదగి యున్నను నందలి కథాసంవిధానము, సన్నివేశసందర్భము మూలానుసారి కాదు. కాళిదాసు కుమారసంభవ మితని కుమారసంభవములో నేకదేశము మాత్రమే. ఉద్భటుని కుమారసంభవము నుండి యితఁడు కొన్ని భావముల గ్రహింపక పోలేదు. శివపురాణము, కాళిదాసు కుమారసంభవము, ఉద్భటుని కుమారసంభవము నను గ్రంథముల నెల్ల నవలోడించి, యందలి విషయముల నెల్ల నాకళించుకొని భావుకుఁ డయిన యీ కవిపుంగవుఁడు స్వతంత్రముగాఁ దనకావ్యమున కొక నూతన కథాసూత్రము నేర్పఱచుకొనినాఁడు. తత్కథాసూత్రముబడిఁ గావ్యకల్పనము గావించినాఁడు. ఇందుచే మూలకథకు భిన్నములయినకూర్పు లితనిగ్రంథమున నందందుఁ గానవచ్చుచున్నవి. మూలకథకు భిన్నముగా నితఁడు కావించినమార్పుకూర్పు లెల్లఁ గవి యుద్దేశపూర్వకముగాఁ జేసినవియు, నొకకొన్ని ప్రయోజనముల సాధించునవియు నగుటను గుఱుతిం

చుటలోఁ గవీశ్వరునిప్రతిభాసామర్థ్యము ప్రవ్యక్తము కాఁగలదు. కుమారసంభవ ద్వితీయాశ్వాసమునకు సంబంధించినంతవఱకు దక్షాధ్వరధ్వంసకథాఘట్టమున మూలకథకు భిన్నముగా నన్నిచోడుఁడు కావించినమార్పుకూర్పు లేవో, వాని ప్రయోజనము లెట్టివో పరిశీలింతము.

దక్షునకును, శివునకును భేదము కలుగుటకుఁ గారణము శివపురాణమున దక్షఖండలో నిట్లు చెప్పఁబడి యున్నది.

ప్రయాగయం దొకప్పు డొక మహాధ్వరము జరగుచుండినది. అక్కడకు భవానీసహితుఁ డగుపరమేశ్వరుఁడు రాఁగా బ్రహ్మాదు లందఱు లేచి నమస్కరించి స్తోత్రములు చేసి వారిని సుఖాసీనులఁ గావించి పిదప శివాజ్ఞచేఁ దామును గూర్చుండిరి. పిదప దక్షప్రజాపతి యచ్చోటికి కరుదెంచి బ్రహ్మకు నమస్కరించెను. అతని యాజ్ఞచే ఋషు లందఱును లేచి యాతనిని స్తోత్రనమస్కారాదులచే గౌరవించిరి. కాని శివుఁ డట్లు చేయ లేదు.

'నానమత్తం తదా దక్షం
స్వాసనస్థో మహేశ్వరః
అకుపత్సహసా రుద్రే
తదా దక్షప్రజాపతిః.
శ్మశానవాసీ నిరపత్రపోహ్యాయం
కథం ప్రణామం న కరోతి మేఽధునా
రుద్రోహ్యాయం యజ్ఞబహిష్కృతో మే'

అని దక్షుఁడు వెడలి పోయినాఁడు. స్వస్థానమును బొంది యజ్ఞప్రారంభము చేసి యందులకై దేవర్షుల నెల్లర నాహ్వానించి

నాఁడు. శివుని, నాతనిభార్య యగుటచే సతీదేవిని మాత్రము పిలువ నంప లేదు.

స్వతంత్రుఁడు, భావుకుఁడు నగునన్నిచోడుఁ డిట మూలము ననువర్తింపక శివదక్షుల విభేదమునకు, దక్షాధ్వర ప్రారంభమునకుఁ జక్కనికారణము కల్పించినాఁడు. అది సహజము, సుందరము నయి కవికిఁ గలదేశీయతాభిమాన మును బ్రవ్యక్తపఱుచుచున్నది. కుమారసంభవమున శివ దక్షులకు భేదకారణ మిట్లు చెప్పఁబడి యున్నది—

దక్షప్రజాపతి సకలజగజ్జనంబుల నిర్మించి సంతోషిత హృదయుం డై యొక్కనాఁడు—

క. 'జలజార్యంతకకశ్యప
కులభామిను లై నెగడ్తకుం జని బహుపు
త్త్రిలఁ బడసి పేరుకొనుకూఁ
తులఁ జూడఁగ'............నరిగినాఁడు.

కశ్యపయమచంద్రులు దక్షునిరాక యెఱిఁగి యెదురు వచ్చి నిజమందిరములకుఁ దోడ్కొని పోయి యొకరిని మించి యొక్క రర్ఘ్యపాద్యాదివిశేషార్చనల నర్చించి వీడుకొలిపి నారు. అంత నతఁడు సతీపరమేశ్వరావలోకనముపొంటె ననేక దివ్యఋషిపరివేష్టితుం డై కైలాసమునకుఁ జనుదెంచినాఁడు. అపుడు పరమేశ్వరుఁడు—'అతినీలాభ్రవిలంబి యై పొలుచునీ హారాద్రియుంబోలె సత్సుతు సామోద్భవవక్త్రి నెత్తుకొని సంతోషంబుతోఁ జూచుచుఁ సతి నవ్వించుచు నవ్వ' చుండి నాఁడు. సంస్తోత్రాదిసత్కారంబులు సేయక దురభిమానం

గున సహంకరించి యున్నదక్షునిఁ గని యాక్షేపించి విరూపా క్షుండు విముఖుఁ డయినాఁడు. తన యల్లు రందఱు చేసిన సత్కారంబులును మొదలియల్లుం డైనపరమేశ్వరుండు సేయ మికి మనఃక్షుభితుం డై దక్షుఁడు క్రమ్మఱ నిజనివాసంబున కరిగి తద్వృత్తాంతం బాత్మేశ్వరి కెఱింగించినాఁడు. దక్షుపత్ని మనఃఖేదమున నున్నదక్షప్రజాపతి నిట్లూఱడించినది :—

తల్లిదండ్రులఁ బూజించి తగ నెఱింగి
మన్నపొడ నైననే యత్తమామ లనియుఁ
బ్రియ మెఱుంగు, నం దిచ్చినబిడ్డ మనకుఁ
బాసె నని యుండుఁ డింక నా పలుకు లేల?—

ఈ పలుకులు కుటుంబములలో సామాన్యముగా నను కొనుమాటలను బోలియుండి సందర్భోచితము లై నన్నిచోడని లోకజ్ఞతను జాటుచున్నవి.

శివకృతాపకారమునకుఁ బ్రత్యపకారము సేయ నుద్యు క్తుఁ డై దక్షుఁడు—

'ఈశానుఁ డేఁ దనయింటికిఁ జన్న
నవమాన్యుఁ జేసె నాయల్లుర నేను
నై తన్నుఁ జేయుదు నాగమబాహ్యు'

నని కృతనిశ్చయుఁ డై మహాధ్వరప్రారంభాభిముఖుఁ డయినాఁడు.

2. మూలకథలో – గంధమాదనమున సఖీసహిత యై యుండినసతీదేవి, చంద్రుఁడు రోహిణితోఁ గూడి యజ్ఞ

మునకుఁ బోవుచుండుటను జూచి శివునిఁ బ్రార్థించి తానును యజ్ఞమునకుఁ బోయినది.

సతీదేవి పిలువనిపేరంటమునకుఁ బోఁదలఁచి శివుని యనుమతి వేఁడుటయు, నతఁ డయిష్టముతోనే యయినను నంగీకరించి యనుపుటయుఁ దన శివపారమ్యసిద్ధాంతమునకు భంజకములుగాఁ దోఁచుటచేఁ గాఁబోలు నన్నిచోడుఁ డీట నొకింత మార్పు గావించినాఁడు. కుమారసంభవమున— దక్షుఁడే 'తనవిభవము త్రిణయనుదేవికిఁ జూపి మెఱయ నని ముందఱు కొందఱ వనితలను' బంచినాఁడు. వారు పర మేశ్వరునిఁ గని సర్వాంగీణప్రణామ లై నిజాగమనప్రయో జనం బెఱింగించి పరమేశ్వరానుజ్ఞాత లై సతీదేవిం దోడ్కొని దివ్యవిమానారూఢ లై దక్షయజ్ఞమున కరుదెంచిరి. అపుడు—

క. ఆతతమణిరుచి నభ ము
ద్ద్యోతింపఁగ నతులగతిర యోద్గతరుచి ను
ర్వీతల మద్రువఁగ నుల్కా
పాతం బనుకడఁకఁ దత్సభాసదు లులుకన్.

క. జానతి పశుపతి నుఱక వి
తానమహారంభుఁ డైనదక్షుం డనున
జ్ఞానికి మునుకొని వచ్చువి
మానం బన నమరి సతివిమానము...' వచ్చినది—

ఇందుచేఁ బిలువనిపేరంటమునకుఁ బోయిన దన్నయప వాదము సతీదేవికిని, నామె వేఁడినను నామెప్రార్థనమును త్రోసిపుచ్చఁ జాలక యామె పోక కనుమతించినతక్కువఁ

దనము శివునకును బరిహరింపఁబడి హరగిరిజల కిరువురకు నొక యాధిక్యము చేకూడినది—

౩. మూలకథలో—దక్షకృతావమానము భరింపఁజాలక సతీదేవి యోగాగ్నిచే దేహత్యాగము గావించినది. ఈ విషయము విని శివుఁడు రుద్రుఁడై విలయతాండవము చేయఁగా నాతనిజటలనుండి వీరభద్రాదు లుత్పన్నులై వెడలి లోకపాలాదులతో యుద్ధము చేసి యజ్ఞదీక్షితుఁ డగు దక్షుని శిరచ్ఛేదము గావించిరి. బ్రహ్మాదులు విష్ణువును బురస్కరించుకొని శివుని స్తోత్రములచేఁ బ్రసన్నునిఁ గావించుకొని యాతని యాజ్ఞ వడసి యజ్ఞపశుముఖసంధానముచే నాతని బ్రతికించిరి. దక్షుఁడు తిరిగి శివాధిష్ఠితముగా యజ్ఞము నెఱవేర్చినాఁడు.

౪. యోగాగ్నిచే శరీరత్యాగము గావించినట్లు శివపురాణమునను, 'సతీ సతీ యోగవిసృష్టదేహా' యని కాళిదాసు కుమారసంభవమునను నుండినను, పితృకృతావమానమునఁ గోపము గొని యున్నసతీదేవి యోగాగ్నిచే శరీరత్యాగము గావించె ననుట యసహజముగాఁ దోఁచి కాఁబోలు నన్నిచోడఁ డీసందర్భము నొకింత మార్చినాఁడు—

కుమారసంభవమున నిట్లున్నది—

గీ. అధిపుఁ బలుకఁ బలుక నడరి యాకాశంబు
దాఁకి సతిమనమునఁ దరతరంబ
మాన కగ్నిలోన మలఁగ నే వోసిన
మాడ్కిఁ గోపవహ్ని మండి యెగసె.

క. తనపతిఁ జెట్టలు వలికిన
జనకుం గని కోపవహ్ని సతిదేహము భో
రన మండె భానుఁ గని కై
పున మండెడుసూర్యకాంతపుత్రికవోలెన్.

గీ. అధిపుఁ జెట్ట లాడె నని దక్షుఁ గని సతి
కడరుకోపవహ్ని నొడలు గాలె,
వగవ నట్లు; యెట్టివారికిఁ బ్రియనిరా
కరులఁ గాంచి యొడలు గాలకున్నె?'—

౨. కుమారసంభవమున వీరభద్రాదుల జన్మవృత్తాంతము చెప్పఁబడ లేదు. వీరభద్రుఁ డిందుఁ బలువురు గణనాథులలో నొకఁడుగా మాత్రమే పేర్కొనఁబడినాఁడు. దక్షాధ్వరధ్వంసము సతికుమారుఁడుగాఁ జెప్పఁబడిన గణాధీశ్వరుని మూలముననే జరగినది.

'అస్మదీయజననీపరాభవంబు గావున నవశ్యం బాపని తనకు దయసేయ వలయు నని పన్నుపడం బలికిన' గణాధీశ్వరుని దక్షుం బట్టి తెమ్మని పరమేశ్వరుఁడు నియమించినాఁడు. అతని యాజ్ఞ మెయి శివగణములచే నధ్వరధ్వంసము తిన్నఁగా సాఁగిపోయినది—

పరమేశ్వరుని జ్యేష్ఠతనయుఁడు, శివగణసురగణసమస్తగణాధిపత్యాఖిలక్రియారంభాధిపత్యంబులతో యువరాజపట్టంబు గట్టుకొనినవాఁడు నగుగణాధీశ్వరుఁ డుండఁగా వీరభద్రాదుల జన్మవృత్తాంతకథనమునకుఁ బ్రసక్తి లేదు కావునను, దల్లికి జరగినయవమానమునకుఁ గుమారునిచేఁ

ప్రతీకారము గావించుటయే సమంజసము కావునను, దక్షాధ్వర ధ్వంసమును గణాధీశ్వరుఁడు పరమేశ్వరానుజ్ఞాతుఁడై కావించి నట్లుగాఁ జెప్పుకొనుటయు, వీరభద్రాదుల జన్మవృత్తాంతమును బుద్ధిపూర్వకముగానే పరిహరించుటయు — వీరభద్రజన్మ వృత్తాంతకథనమువలన గణాధీశ్వరుని ప్రాముఖ్యము తగ్గ వలసి వచ్చును గనుక—సందర్భోచిత ములై మూలమునకు మెఱుఁగుల దిద్దుచున్నవి.

3. వీరభద్రాదులు దక్షాధ్వరధ్వంసము గావించి దక్షుని శిరచ్ఛేదము గావించినట్లు మూలమునఁ జెప్పఁబడి యున్నను నిందు గోమేధకసదనమున భయకంపితుఁడై దాఁగియున్న యాతనిని శివగణములు—

'కాలు చేయు బడియఁ గావడించి
మనుమృగంబు గట్టికొని వచ్చుబలు వేఁట
కాఱువోలె......'

తీసికొని వచ్చినట్లు వర్ణింపఁబడి యున్నది. అమృతాత్మకు శ్రీపాదముల స్పర్శమాత్రముచేతనే దక్షుఁడు సచేతనుఁడై భక్త్యావేశంబునఁ బ్రణుతించి యధ్వరఫలంబును, బ్రజాపతి నియోగమును బడసినాఁడు. ఇందు యజ్ఞపశుముఖ సంధాన వృత్తాంతము పరిహరింపఁబడినది. భక్తియోగప్రాధాన్య ప్రతిపాదనమున కయియే నన్నిచోడఁ డిట నిట్టి మార్పు గావించినట్లు తలఁపఁదగి యున్నది.

ఇట్లే గ్రంథమంతటను గవీశ్వరుఁడు మూలకథకు భిన్న ముగాఁ గూర్చినకూర్పులు, మార్పులు సప్రయోజనములు,

సరసములు నయి సహృదయహృదయాహ్లాదకములుగా నున్న వనుట నిర్వివాదము. నన్నిచోడని భావుకత ప్రజ్ఞాలలితము! ప్రజ్ఞ ప్రతిభావాసితము! అతని ప్రతిభను జవి చూచుట కిది గోరుముద్దలు!

---

# వస్తుకవిత

ఆశు, మధుర, చిత్ర, విస్తరము లని చతుర్విధకవిత లను లక్షణకారులు పేర్కొనిరి. ఆంధ్రకవితాపితామహుఁ డీ నాలుగుతెఱఁగులను గవితఁ జెప్పఁగలఁ డఁట! ఆశ్వాసాంత గద్యముల 'శఠకోపప్రసాదాసాదితచతుర్విధకవితామతల్లి కాల్లసాని' యని కలదు. చతుర్విధకవిత లివి యిట్లు ప్రసిద్ధము లై యుండఁగా నన్నిచోడమహాకవి కుమారసంభవము కృత్యవతరణికలో 'వస్తుకవిత' యని యొక తెఱఁగు కవిత పలుమాఱు పేర్కొనఁబడినది. వాని స్వరూప స్వభావము లెట్టివో, తత్కవితకుఁ గలప్రత్యేకగుణము లేవో యందుఁ బేర్కొనఁబడ లేదు. నన్నిచోడని కృత్యవతరణిక లోని యీ క్రిందిపద్యముఁ జూడుఁడు :

సీ. శరధినీరులు పయోధరములు కొని వచ్చి
కురిసి వారిధియందుఁ గూర్చినట్లు
చేనఁ బండినవిత్తు చేనిక ఫలకాంక్షఁ
బేర్మిఁ గ్రమ్మఱ వెదవెట్టునట్లు
రోహణాచలపతి కూహించి వరరత్న
సంచయంబున విభూషించునట్లు
తీర్థాళి కర్థిఁ దత్తీర్థోదకంబుల
నెసకంబుగా నర్ఘ్య మిచ్చినట్లు

నింగి ముట్టి యున్న జంగమ మల్లయ
వరమునందుఁ గనిన'వస్తుకవితఁ'
దగిలి వారియంద నెగడింతు రవికి దీ
పమున నర్చ లిచ్చుపగిదిఁబోలె.
—కృత్యవతరణిక 49 ప.

జంగమమల్లికార్జునగురువర్యుని వరప్రసాదమున నితఁడు పొందిన'వస్తుకవిత' స్వరూపస్వభావాదు లెట్టివో యిందుఁ దెలియ రాదు.

పూర్వకవిస్తుతి సందర్భమున భారవిమహాకవిని స్తుతించుచు నితఁడు భారవి వస్తుకవితారచనమున జనారాధితుఁ డయ్యె నని పేర్కొనినాఁడు. భారవిస్తుతిపద్య మిది చూడుఁడు :

క. భారవియు 'వస్తుకవిత'ను
భారవియును బరఁగి రుదయపర్వతశిఖరా
గ్రారోహణేంద్రకీలన
గారోహణవర్ణనల జనారాధితు లై.
—కృత్యవతరణిక. 20 ప.

రవియు, భారవియు కాంతికి, కవితకు-నందును వస్తుకవితకుఁ—బేరు గాంచిరి. తొలియాతఁ డుదయపర్వతశిఖరాగ్రారోహణవర్ణనలచే జనారాధితుఁ డయ్యెను. మలియాతఁ డింద్రకీలనగారోహణ వర్ణనల నద్భుతముగా వర్ణించి పాఠక జనారాధితుఁ డయ్యెను. ఇందును వస్తుకవితాస్వరూపము గోచరము కావుట లేదు. కాంతికి రవి యెట్లో, కవితకు-వస్తు

కవితకు—భారవి యట్లు, అనుటచే భారవికవితనుబట్టి వస్తుకవితా స్వరూపమును గుఱుతింపఁ గలము.

వస్తుకవిత వెలసినకావ్యములు వస్తుకావ్యములు! ఆదికవి వాల్మీకి స్తుతి సందర్భమునందలి యీ పద్యముఁ జిత్తగింపుఁడు :

క. కవితామృతోదయాంబుధి
* కవిసజ్జనకనకు వస్తుకావ్యాబ్జరవిన్
గవితారంభంబుల స
త్కృపు లభినందింతు రాదికవి వాల్మీకున్.
—కృత్యవతరణిక–17 ప.

వాల్మీకి వస్తుకావ్యాబ్జరవి! సూర్యోదయముతో నబ్జములు వికసితము లయినట్లు వాల్మీకియుదయముతో లోకమున వస్తుకావ్యములు వెలసినవి. ఇందును వస్తుకావ్య మన నెట్టి దని నిర్వచింపఁబడ లేదు.

వస్తుకవితఁ జెప్పినవారు, వస్తుకావ్యముల విరచించిన వారు వస్తుకవులు! వస్తుకవీశ్వరుల కావ్యము లి ట్లుండవలె నని నన్నిచోడుఁడే యాదేశించినాఁడు. చూడుఁడు—

* ముద్రణములలో 'కవిసజ్జనకునకు' అని యున్నది. వాల్మీకి కవిసజ్జనకుఁడు అనుకొన్నచో కవిసజ్జనకునకు అన్న షష్ఠ్యంతవిశేషణము తక్కినవిశేషణములతోఁ బొత్తు గలియక భిన్నవిభక్తికక మగును. కావున 'కవిసజ్జనకనకు' అని ద్వితీయాంతముగా నుండుట నిర్దోష మని భావింతును. కవిసజ్జనులలో బంగారమువంటివాఁ డని యర్థముఁ జెప్పకొన వచ్చును.

సీ. మృదురీతి సూక్తు లిం పొదవింప మేలిల్లు
భావమ్ము తెలిమిఁ బ్రత్యావహముగ
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు వోవంగఁ
గాంతి సుధాసూతికాంతిఁ జెనయ
వర్ణన తెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దసకొత్తి రాలువాఱ
దేశిమార్గంబులు దేశీయములుగా న
లంకారములఁ దా నలంకరింప
నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే సమస్తవస్తుకవీశ్వర
నూత్నరుచిరకావ్యరత్నవీథి.

—కృత్యవతరణిక-36 ప.

వస్తుకవీశ్వరుల కావ్యపద్ధతి 'రత్నాలబజారు' వలె వెలయఁ దగును! కావ్యవీథికి బేర మాడ వచ్చువారు బుధులు. వారును గావ్యవస్తువిక్రేతలకడ వస్తుగౌరవాదికము నాదరముతో విని, కావ్యములయందలి సదర్థాతిశయముచే లోఁగియుఁ జేత రొక్కము లేనివా రగుటచే—పండితులు సాధారణముగా నైశ్వర్యవంతులు కారు కాన—మనస్సులయందే నిధులు నిలుపుదురు. సూక్తివైచిత్ర్యము, భావసంపద, కావ్యగుణములు, నష్టాదశవర్ణనములు, నవరసములు, షట్త్రింశదలంకారములు, దేశిమార్గములు కలుగుకావ్యములు 'వస్తుకవీశ్వరుల'చే రచితములై కావ్యవీథిని—రత్నవీథిని రత్నములవలె—సదర్థాతిశయసంపన్నులగుబుధుల నాకర్షించును.

ఇందు రత్నవీథిపర మయినమఱొకయర్థమును భాసించుచున్నది. రత్నవీథిని రత్నవర్తకులు – అర్థాతిశయ సంపన్నులగుధనికులు రత్నముల గొనుటకై యేతేర–వారికి మృదురీతి సూక్తులచే నింపొదవింతురు. రత్నవర్తకులు చూపు నాదరభావము శేరగాండ్రకుఁ బ్రీతి చేకూర్చును. రత్నములు మెఱుఁగులు సిమ్ముచు ధనికుల కన్నులకు మిఱుమిట్లు గొలుపుచుండును. తద్రత్నకాంతి చంద్రకాంతిఁ బురుడించుచుండును. ఆయారత్నముల వర్ణములు – వన్నెలు – వర్ణనార్హములై భాసించుచుండును. వానియందు రసములు (నీరు) దళుకొత్తుచుండును. దేశిసరకు, విదేశిసరకు రత్నములు దేశీయతఁ దాల్చి నాగరకాలంకారములఁ బొదుగఁదగి యుండును. రత్నవర్తకుల సరససంభాషణములను, రత్నమూల్యవస్తుగౌరవాదికమును నర్థాతిశయసంపన్నులగుధనికు లాదరముతో విని నెమ్మనమున – నిండు మనసుతో – నాయారత్నములకై నిధులు గ్రుమ్మరింతురు. రత్నవీథి నిట్లు కదా తీర్చి దిద్దవలెను!

• ఇందు వస్తుకవీశ్వరుల వస్తుకవితాస్వరూప మొకింత గోచర మగుచున్నది.

వస్తుకావ్యములయందు మృదురీతి సూక్తులిం పొదవింపవలయును. ఇది శైలి లక్షణము. కావ్యములయందు సూక్తుల ప్రాధాన్యమును నన్నిచోడఁడే ముం దొకచోట నుద్ఘాటించినాఁడు. చూడుఁడు.

చ. సరళము గాఁగ భావములు
జాను దెనుంగున నింపు పెంపుతోఁ

బిరిగొన వర్ణనల్ ఫణితి
 పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమ్రు
 మత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లార్యులకుఁ
 గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్.
 — కృత్యవతరణిక–౨౬ ప.

నన్నయభట్టారకుఁడు దీనినే 'యక్షరరమ్యత' యని పేర్కొనెను.

ఉ. 'సారమతిం గవీంద్రులు ప్ర
 సన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలు నా నితరు
 'లక్షరరమ్యత' నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి
 నన్నయభట్టు తెలుంగునన్ మహా
భారతసంహితారచన
 బంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.'

రుచిరార్థసూక్తులతోఁ దన రచనమును వెలయించి, యక్షరరమ్యతను సాధించి, కావ్యము తీర్చి నన్నయ 'రుచిరార్థసూక్తినిధి' యయినాఁడు.

'పరిభవింతుఁ బ్రబంధపరమేశ్వరుని రేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు'

అని శ్రీనాథుఁడును సూక్తివైచిత్ర్యముపై గౌరవము తెలిపినాఁడు.

కవిత భావసంపన్న మై పరితోషప్రద మై భావకిరణముల వెలార్చుచుఁ గన్నుల మెఱయఁ జేయవలయును. ఇది వస్తు కావ్యముల కుండవలసిన రెండవ గుణము.

కావ్యగుణములు కలిగి యష్టాదశవర్ణనాత్మక మై రస భరిత మై యొసలారుట మూఁడవ గుణము.

నన్నిచోడుఁడే కావ్య మష్టాదశవర్ణనాత్మక మై యుండ వలె నని యిట్లు వానిఁ బేర్కొనినాఁడు. చూడుఁడు.

క. వనజలకేళీరవిశశి
తనయోదయమంత్ర*గతిరతక్షితిపరణాం
బునిధిమధుఋతుపురోద్యా
వనగవిరహదౌత్యవర్ణనాష్టాదశ మై.

—కృత్యవతరణిక. 44 ప.

మార్గదేశి కవిత్వమార్గములు దేశీయము లయి భాసించు నటుల కవిత వెలయించి షట్త్రింశదలంకారసంపన్నముగాఁ గావ్యమును సవదరింప వలయును. ఇది మఱొకలక్షణము.

ఇట్లు లక్షణసంపన్న మైన 'వస్తుకవిత'ఁ జెప్పినవారే వస్తుకవీశ్వరులు. కవీశ్వరుల రచనము లిట్లు వస్తుసంపన్నము లయినప్పుడే పండితు లా వస్తుగౌరవమునకు లోఁగి యావంక

* ముద్రణములలో 'రతక్షితపరిణాంబునిధి' యని 'విరహాదూత్య' యని కలదు. క్షితిప, రణ యనియు, విరహ, దౌత్య యనియు నర్థోచితముగా సవరింపఁబడినది.

కొలఁగుదురు. అట్లు వారు వస్తుగౌరవముచేఁ దన కావ్యము నైపుణకు నోలఁగవలయు ననియే నన్నిచోడఁడు పండితులను వినయముతో స్మరించినాఁడు. ఈ పద్యము చూడుఁడు :

క. 'గుఱు తెఱిఁగి వస్తుచయమున
కొలఁగెడునాదీపవర్తియునుబోలె నిజ
మ్మెఱిఁగి 'కృతివస్తుసమితికి'
వఱలఁగ మది నొలఁగువిబుధవర్గముఁ దలఁతున్.'

—కృత్యవతరణిక. 26 ప.

పూర్వోదాహృత పూర్వకవిస్తుతిపద్యము లయందు వాల్మీకియు, భారవియు వస్తుకవు లని, వారిది వస్తుకవిత యని నన్నిచోడఁడు పేర్కొనినాఁడు. నన్నిచోడని పద్యములఁబట్టి వాల్మీకి రామాయణమును, భారవి కిరాతార్జునీయమును వస్తుకావ్యము లని తేలుచున్నది. రామాయణమును, కిరాతార్జునీయమును మహాకావ్యము లని మనము పేర్కొనుచుందుము. కావ్యలక్షణము లష్టాదశవర్ణనాదిక మాకావ్యములయందు వెలయుటచే నవి పురాణములకంటె భిన్నము లై కావ్యత్వమును బొంది కావ్యము లయినవి. పురాణములు ధర్మప్రతిపాదకము లై యనేకోపాఖ్యానసహితము లై, యనేకరాజ ఋషివంశచరితాది వృత్తభాసితము లై వెలయుచుండును. పురాణములు భిన్నవస్తుప్రతిపాదకము లై యాభిన్నవస్తువుల సంగతితో నేకవస్తువువోలె భాసించును. కావ్యము లట్లు కాక యేకవస్తుప్రతిపాదకములు. రఘువంశాదికావ్యములు పురాణములవలెఁ గాక యేకరాజవంశ

చరిత్రమునే తెలుపుచుఁ బురాణములలోఁ గానరానియష్టాదశ వర్ణనలు, రసనిర్వహణము, అలంకారసమలంకరణము, ఔచితీశిల్పము కలిగి యుండును. పురాణములలోఁ గొన్నియెడల నౌచితి లోపించినను లోపింపవచ్చును గాని కావ్యముల నట్లు కాదు. ఔచితి కావ్యములకు జీవగఱ్ఱ. ఇట్లు కావ్యములు పురాణములకంటె భిన్నములై, స్వతంత్రములై విలక్షణలక్షణములతో నొప్పారుచున్నవి. రామాయణ కిరాతార్జునీయము లేకవస్తుప్రతిపాదకములై వెలయుటచేత, నా కావ్యములలోని వస్తుప్రాధాన్యమును సూచించుటకై నన్నెచోడుఁడా కావ్యములను వస్తుకావ్యము లనియు, వానికవి వస్తుకవిత యనియుఁ జేర్కొనెను. ఈ వస్తుకావ్యములలోను రెండు తెఱఁగులున్న ట్లున్నవి. గూఢవస్తుకావ్యములు, వ్యక్తవస్తుకావ్యములు నని. నన్నెచోడుని యీ క్రిందిపద్యముఁ జూడుఁడు:

క. 'క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవమ్ము నలంకా
రము గూఢవస్తుమయకా
వ్యముగా హరలీల చెప్పి హరు మెచ్చించెన్.'
—కృత్యవతరణిక–21 ప.

ఉద్భటుఁ డనుకవీశ్వరుఁడు గూఢవస్తుమయకావ్యముగా 'హరలీల' విరచించెను. కాన హరలీల గూఢవస్తుమయకావ్యము.

ఇట్లే యితఁడు ప్రాచీనకవులలోఁ గొందఱకవితను మాత్రమే కాక, తాను జెప్ప నేర్చి చెప్పినకవితను గూడ 'వస్తు

కవిత' యని పేర్కొనినాఁడు. తెలుఁగుకవులలోఁ దరువాతివారెవ్వరును దీనిఁ బేర్కొన లేదు. కన్నడకవులలో వస్తుకవి యనియు వర్ణకకవి యనియు భేదము పాటింపఁబడినది. కాని యెట్టివాఁడు వస్తుకవియో, యెట్టివాఁడు వర్ణకకవియో నిర్వచింపఁబడ లేదు. పంపకవి తన 'విక్రమార్జునవిజయము'లో నాద్యంతములయందుఁ దనకవితనుగూర్చి చెప్పుకొనుచు వర్ణక, వస్తువిద్యలను బేర్కొనినాఁడు. కాని వాని భావము మనకు వ్యక్తము కాదు.

'కతసిరి దాఁగొడం కథయె
మెయ్గుడ లీయదెయుం సమస్తభా
రతమన పూర్వమాగె సలెపేళ్ద
కవీశ్వరరెల్ల 'వర్ణకం'
కతెయొళొడంబడం పడెయెపేళ్వొడె
పంపనె పేళ్గు మెందు పం
డితరతగుళ్దు బిచ్చళిసెపేళ
లొడర్చిద నీ ప్రబంధమం.'

—1-11 ప.

'పుదిదజనంపొాద ఱ్దచళ మొంది దళంకృతికైత దేసియొం
బుదనెనె 'వస్తువిద్య' యెనె కబ్బమె మున్నమ వంతివల్లద
ల్లదె...

—14-59 ప.

ఇతఁడే ఆదిపురాణమున 'ఆదిపురాణ వస్తుకృతి'యని పేర్కొనినాఁడు.

'త్రిదశ స్తుత్యం జినాధిదేవచరితం
వస్త్వామృతస్యందియ
క్కిదు భవ్యానకె గెందు
పేళిసి బుధర్ స్వర్గాపవర్గక్కమా
స్పదమా 'పార్శ్వపురాణ వస్తు
కృతియం' పేళ్ఱం చెడం గవ్య మా
ర్గదొళిం దేసియొళం పొదళ్చిసె
లికం సంసారసారోదయం.'

నాగవర్మ ఛందోంబుధిలో తన్ను గూర్చి 'వస్తుకవి' యని చెప్పుకొని యున్నాఁడు. చూడుఁడు.

'పవమాన చతుష్కయుతం యతియుం
దినసాధిప కొళ్ళిలె - వస్తుకవి
ప్రవర స్తుత మప్పుదు తోటక మెం
దవధారిసు నీనిద నబ్జముఖీ'

కన్నడమున నర్వాచీనకవులలో నొకరు పద్యకావ్యముగా నున్నదానిని జంపూకావ్యముగా రచించుచుఁ దాను వర్ణకకవితను వస్తుకవితగా వ్రాయుచున్నా నని పేర్కొనెను. దానినిబట్టి వస్తుకవితకుఁ జంపూకావ్య మనునర్థ మిటీవల నా భాషలో నేర్పడినట్లు తెలియుచున్నది. కాని వాల్మీకిని, భారవిని వస్తుకవులుగాఁ బేర్కొన్న ననినిచోడని యభిప్రాయ మది కా దనుట మాత్రము స్పష్టము. వస్తుకవిత యనఁగా వస్తు ప్రధానకవిత యనియే ననినిచోడని యభిప్రాయమై యుండును. కన్నడభాషలోని ప్రాచీనకవు లగునాగవర్మాదుల ననుస

కించిదేయి యితని కీ భావము కలిగి యుండు ననుట నిశ్చయము. విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణియందుఁ గవితలో నలంకార ప్రాధాన్యము, రసప్రాధాన్యము, వస్తు ప్రాధాన్యములను గూర్చి పేర్కొని యున్నాఁడు. ఆ లక్షణ మునుబట్టి చూచినను నితని కవిత వస్తుప్రధాన మయిన దని చెప్పవచ్చును.

భారత భాగవతాది పురాణములవలె భిన్న వస్తుప్రతిపాదకము కాక యేకవస్తుప్రతిపాదక మై, కథావస్తు ప్రాధాన్యముతో వెలయుచుండుటచేతఁ గుమారసంభవము వస్తుకావ్య మనియు,నతనిది వస్తుకవిత యనియు మనము చెప్పు కొన వచ్చును.అతఁడు పేర్కొనినవస్తుకవితను మనము పై తీరు ననే సమన్వయపఱచు కొనవలసి యున్నది. తనకుఁ బూర్వము వెలసిననన్నయ భారతము పురాణ మగుటచేతను, నది భిన్నవస్తుప్రతిపాదక మై, సంస్కృతపురాణతుల్య మై, మహా కావ్యలక్షణవిరహిత మై యుండుటచేతను, తనకావ్య మేక వస్తుప్రతిపాదక మై, మహాకావ్యలక్షణములతో, నష్టాదశ వర్ణనాదికసహిత మై, కథావస్తుప్రధానకముగా వెలయు చుండుటచేతను నన్నిచోడఁడు తన కవితను వస్తుకవిత యని ప్రత్యేకముగా నభిమానముతోఁ బలుమాఱు పేర్కొని యుండవచ్చును. అతని దృష్టిలో నతఁడు పేర్కొనిన వస్తు కవితయు, సంస్కృతమహాకావ్యకవితయుఁ దుల్యమే. ఆంధ్ర భారతకవిత పురాణకవిత యని యతని తలఁపు గానోపును.

తొలుత పేర్కొనిన ఆశు, మధుర, చిత్ర, విస్తరము లనుచతుర్విధకవితలలో నీ వస్తుకవిత విస్తరకవితలో నంత

ర్భాగము కావచ్చును. ఏ స్తరకవితలోఁ బురాణకవిత, వస్తు కవిత లేక కావ్యకవిత, ప్రబంధకవిత మొదలగుకవితా విభాగము లన్నియు నంతర్భూతము లగును.

కుమారసంభవము వస్తుకావ్య మనఁగానే యందలి వస్తు వేది యని జిజ్ఞాస పొడముచు. కుమారసంభవమహాకావ్య మందలి కథావస్తువు కుమారోత్పత్తి, తారకాసురసంహారము. పారిజాతాపహరణములో నంది తిమ్మనకువలె నన్నిచోడనికిని గథావస్తువే కొన్నియానుకూల్యములు గల్పించినది. కొందఱు గొప్పగొప్ప కవులే తమకావ్యములకుఁ గావ్యతను గల్పించు కొనుటకై పని గట్టుకొని, యావశ్యకత యున్నను లేకున్నను, సందర్భము కల్పించుకొని, యష్టాదశవర్ణనముల నెట్లో భగీరథప్రయత్నముతోఁ దమకావ్యములఁ జొప్పింతురు. నంది తిమ్మనకును, నన్నిచోడనికిని గావ్యవస్తువులే యష్టాదశవర్ణనలకును జాలినంతగాఁ బర్యాప్తావకాశముల నొసఁగుచున్నవి. నవరసనిర్వహణమునకును వానియం దవకాశ మున్నది. క్రొత్తగా రసనిర్వహణమునకై కావ్యవస్తువునందు మార్పులు గావించుకొనుట యనుగ్రహాచారము వారికిఁ దప్పినది!

నన్నిచోడఁ డిట్లు వస్తుప్రసాదిత మయిన సదవకాశముల నసిగా వినియోగపఱచుకొని, వస్తుప్రధాన మయిన తన రచనముచేఁ గావ్యమున వస్త్వాధిక్యమును నిరూపించినాఁడు.

---

# జానుతెనుఁగు

సాహిత్యములో నభ్యుదయవాంఛ యీ నాఁటిది మాత్రమే కాదు. ప్రాఁతదారులు పరిహరింప వలసినప్పు డెల్ల నీ యభ్యుదయవాంఛ పొడసూపుచునే యున్నది. ఆంధ్ర సాహిత్యచరిత్రమును బరిశీలించిన నిట్టి యభ్యుదయ మే కాలమున కా కాలము క్రొంగ్రొత్తగా వెలయుచుండుటయు, నందుచే సాహిత్యపద్ధతిలో నొకమార్పు ఏర్పడుటయు గోచరింపఁగలదు.

సాహిత్య మొక జీవనది. గమ్యము నుద్దేశించిన తన పరుగులో నది తన పరీవాహగతిని మార్చి క్రొత్తదారులఁ ద్రొక్కినట్లు సాహిత్యమును నభ్యుదయగతితో ముందునకు ముందునకు సాఁగుచుఁ, గాలము గడువను గడువను బ్రాఁతదారులఁ బరిహరించి క్రొత్త్రోవలఁ ద్రొక్కుచున్నది. పరీవాహగతిలో నదికివలె సాహిత్యమునకుఁ బరిణామము సహజము, సమంజసము. సాహిత్యములో నిట్టి పరిణామము, నిట్టి యభ్యుదయముఁ దేవలయు నని యెప్పటికప్పు డభ్యుదయ వాదు లవతరించుచునే యుందురు. వారి పుణ్యమా యని సాహిత్యము క్రొత్తరంగులు దీర్చి నవపరిమళముతోఁ బరిమళించుచుండును.

క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్దములో సాహిత్యమునం దిట్టి యభ్యుదయమే యవతరించినది. ఈ యభ్యుదయావతరణమునకు భగీరథకల్పులు శివకవులు! నాఁటిసాహిత్యములో

శివకవు లవతరింపఁజేసినయభ్యుదయము బహుముఖము; పరి పుష్టము. అభ్యుదయ మనునది యంతంతలలో నగుపని కాదు. శ్రమైకసాధ్యము. ప్రాఁతదారులఁ బరిహరింపఁజాలని పరమ ఛాందసుల నభ్యుదయవాదు లెదుర్కొనవలసి యున్నది. తా మవతరింపఁజేయునభ్యుదయమునకు హేతువాదముతోఁ బ్రజా బలము పడసి, తమ వాదమును నిలువరించుకొనవలసియున్నది. ఎన్ని శక్కా మొక్కా లయిన నెదుర్కొనుటకు వారు గండర గండులై యుండవలయును. సంఘములోఁ గాని, సాహిత్య ములోఁ గాని మార్పు ఒక్కపెట్టున నేర్పడదు. సంఘమున కొదిగి యొదిగి యుండి యలఁతి యలఁతిగాఁ దమ వాదలేశము లకుఁ బ్రజామోదము సంపాదించుకొని యవ నెడఁగి యెదురు దిరుగవలయును. ఇందుచే నభ్యుదయ మనునది యొక్కపెట్టునఁ గాక యల్లనల్లన కాలు నిలువఁద్రొక్కుకొనుచుండును. శివకవు లిట్టిగట్టిచిక్కులను మిక్కిలిగా నెదుర్కొని యుందు రనియే యెంచవలసి యున్నది. నేఁటిదాఁక వారి కవిత, వారి కవితా సంప్రదాయములు తక్కిన భవికవుల కవితలవలె, వారి కవితా సంప్రదాయములవలె నాదరము పడయకుండుటయే యందులకు నిదర్శనము.

శివకవులు తెచ్చినయభ్యుదయమునుగూర్చి తెలిసి కొనుటకుముందు తత్పూర్వస్థితినిగూర్చి యొకింత తెలిసికొన వలసి యున్నది. శివకవులకుఁ బూర్వము వెలసినకావ్యములకు వస్తువు సంస్కృతమూలకము. అనువాదప్రాయము. అందలి భాష సమసంస్కృతోక్తిప్రధానము, ఛందము సంస్కృత వృత్తప్రధానము.

పండితైక వేద్యముగా నున్న యిట్టిసాహిత్యమును ప్రజా సామాన్యముచేఁ గూడ ననుభూత మగునట్లు చేయవలయు నని శివకవులు వస్తువునందును, గవితయందును, భాష యందును, ఛందమునందును మార్పు తెచ్చినారు. అభ్యు దయము నవతరింపఁ జేసినారు. శివకథావస్తువుతో, దేశి కవితాసంప్రదాయము ననుసరించి, జాను తెనుఁగున, జాతిఛంద మునఁ గవిత చెప్పినారు.

పన్రెండవ శతాబ్దినాఁటి కవితలో మార్గ దేశి విభేదము లున్నట్లు నన్నిచోడ మహాకవి తన కుమారసంభవమున నిట్లు పేర్కొనినాఁడు. చూడుఁడు :

క. 'మార్గ కుమార్గము, దేశియ
మార్గము, వగవంగఁ దమకు మది వదలక దు
ర్మార్గపదవర్తు లనఁదగు
మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్.'

—కృత్యవతరణిక. 28 ప.

సీ. 'మృదురీతి సూక్తులిం పొదవింప మేలిల్లు
భావమ్ము లెలమిఁ బ్రీత్యావహముగ
మెఱుఁగులఁ గన్నులు మిఱుమిట్లు వోవంగఁ
గాంతి సుధాసూతికాంతిఁ జెనయ
వర్ణన లెల్లచో వర్ణన కెక్కంగ
రసములు దళుకొత్తి రాలువాఱ
దేశిమార్గంబులు దేశీయములుగా న
లంకారములఁ దాఁ నలంకరింప

నాదరించి విని సదర్థాతిశయమున
బుధులు నెమ్మనమున నిధులు నిలుప
వలవదే సమస్తవస్తుకవీశ్వర
నూత్నరుచిరకావ్యరత్నవీథి.'

—కృత్యవతరణిక. 36 ప.

పంపమహాకవి విరచించిన విక్రమార్జునవిజయమునను నీ మార్గదేశివిభేదములు పేర్కొనఁబడినవి.

బగెవొస తప్పుదాగి మృదు
బంధ దొళొందువు దొంది దేసియొళ్
పుగుదువు పొక్క మార్గదొళె
తళ్వుదు తళ్తొడి కావ్యబంధ మొ
ప్పగు మెళమావు కెందళిర
పూవిన పొఁప్పెడెయొళ్ం బజల్దు తుం
బి గళిసె తుంబికోగిలెయొ
బగ్గిసె సుగ్గియొళ్ొప్పు వంతెవోల్.'

—విక్రమార్జునవిజయము.

ద్వాదశశతాబ్దియందలి యొక శాసనములోఁ గూడ నీ మార్గదేశి విభేదములు పేర్కొనఁ బడినవి. క్రీ. శ. 1145 నాటి శాసనములోని యీ పద్యముఁ జూడుఁడు :

'తలంప సదర్థ భావమునం
దద్గతసూక్తుల గూడ వర్ణన(లు)
గొలుసుగొనంగ వ్రావఝ్లు
గోరిన భంగిక వచ్చి ముట్టం గో

మలగతి దేసిమార్గములు
మట్టుపడం గ్గటనంబు లొప్ప నా
ద్యుల క్రియం జెప్పనేర్చెఁ నృప
ధూర్జటి భీమయపండ్డ డిమ్మహిని.'
—దక్షిణదేశశాసనసంచయము. సంపు. 6. 103.

కవితామార్గమున వేఱుత్రోవ త్రొక్కినశివకవు లందఱును దక్కిన భవికవులకంటె విలక్షణముగాఁ దమ కావ్యములఁ దీర్చినారు. వారికవితలో శివకవుల ప్రత్యేకత స్పష్టముగా గోచరింపఁ గలదు. శివకవుల కావ్యములలోని యాశ్వాసాంతగద్యములను జూచిన నవి యెల్లను నొకరితో నొకరు కూడఁ బలుకుకొని వ్రాసినట్లు తోఁపక మానదు. వారి యాశ్వాసాంతగద్య లెల్ల విలక్షణముగా నుండును. ఇవి చూడుఁడు :—

'ఇది శ్రీమజ్జంగమ మల్లికార్జునదేవ దివ్యశ్రీపాద పంకజ భ్రమరాయమాణ కవిరాజశిఖామణి నన్నెచోడ దేవప్రణీతం బైనకుమారసంభవం బనుకథయందుఁ బ్రథమా శ్వాసము.'
—కుమారసంభవము.

'ఇది యసంఖ్యాతమహేశ్వరదివ్య
పదపద్మసౌరభభ్రమరాయమాణ
జంగమలింగప్రసాదోపభోగ
సంగతసుఖసుధాశరధినిమగ్న

సుకృతాత్మ పాలకురికి సోమనాథ
సుకవిప్రణీతభాసురతరపండ
నాయకబసవాంకనఖ్యాతగుణగ
ణాయతకీర్తిదిగంతత్రిలోక
గురుపండితారాధ్యచరితంబునందుఁ
గరము ద్వితీయప్రకరణ మొప్పారు.'

—పండితారాధ్యచరిత్రము.

'ఇది శ్రీ గిరీశవిశ్వేశ్వరధ్యాన
విదితశివాచారవిహితసుజ్ఞాన
పండితారాధ్య శ్రీపాదాబ్జభృంగ
ఖండేందుధరభక్తికామ్యాంతరంగ.'

—వీరమాహేశ్వరాచారసంగ్రహము.

'ఇది పరమేశమాహేశ్వరదివ్య
పదపద్మమకరందపానసన్మధుక
భవ్యజంగమలింగభక్తినిష్ఠైక్య
దివ్యసదానంద ధీయుతయుక్త
కన్నడమఠసదాగారగురుశిష్య
చన్నబసవన్న ప్రసాదసత్కావ్య
...........................
...........................'

—నవచోళచరిత్రము.

'శ్రీపాదపంకజభ్రమరాయమాణ' యన్న సమాస పదముతో సమానార్థకము లయినవి పైనఁ జేర్కొన్నగద్యలలో స్పష్టముగా గోచరింపఁగలవు.

కవితలో వేఱుమార్గము త్రొక్కినతమ్ముఁ, దమవారిని శివకవులు తక్కినవారితోఁ గాక ప్రత్యేకముగాఁ జేర్కొను చుండిరి. తా మెల్లరు శివకవుల మని, తమది శివకవుల సంప్రదాయ మని వారే పేర్కొనిరి. ఇది చూడుఁడు :

'వినను లోకహితార్థంబు గాఁగ
నానేర్చుకొలఁది వర్ణన సేయువాఁడ
నవరసరసికత భువిని బేర్కొన్న
శివకవిప్రవరుల చిత్తంబు లలర
నిప్పాట నితరులఁ జెప్పెడి దేమి
తప్పులు దారులుఁ దడఁబడఁ బలికి.

—బసవపురాణము.

వివరింప శేషుని వేయునాలుకలు
శివకవి మల్లయ్య జిహ్వకు సరియె
. . . . . . . . . . . . . . . . . . . . . . .
వేయేల కవిమల్లు విషయేంద్రియములు.

—పండితారాధ్యచరిత్రము.

తరువాతి తరమువారును వీరి ప్రత్యేకతను గుఱ్ఱుతించిన ట్లున్నది. వీరిని బ్రత్యేకముగానే ప్రస్తుతించినారు. వేమనయోగి చెప్పినపద్య మిది చూడుఁడు :—

శివకవులకు నవకవులకు
శివభక్తికిఁ దత్త్వమునకుఁ జింతామణికిన్
శివలోకప్రముఖులకును
శివునకు గురువునకు శరణు సేయర వేమా!

—వేమనశతకము.

ఇఁక నీ శివకవులు తమకావ్యములలోఁ జేర్కొనిన జానుతెనుఁగునుగూర్చి తెలిసికొందము.

నన్నిచోడ మహాకవి తనకావ్యమును జానుదెనుఁగున రచించినట్లు చేర్కొనినాఁడు. జానుదెనుఁగును దొలుతఁ జేర్కొనినకవి యీతఁడే. చూడుఁడు :—

సరళము గాఁగ భావములు
'జానుదెనుంగు'న నింపుపెంపుతోఁ
బిరిగొన వర్ణనల్ - ఫణితి
పేర్కొన నర్థము లొత్తగిల్ల బం
ధురముగఁ బ్రాణముల్ మధుమ్రు
దుత్వరసంబునఁ గందళింప న
క్షరములు సూక్తు లాద్యులకుఁ
గర్ణరసాయనలీలఁ గ్రాలఁగాన్.

—కృత్యవతరణిక. ౩౫. ప.

పాలకుఱికి సోమనాథకవీశ్వరుఁడు తన బసవపురాణమునను, బండితారాధ్యచరిత్రమునను గూడ జానుదెనుఁగును జేర్కొనుటయే కాక జానుతెనుఁగు స్వరూపము నొకింతగా గోచరింపఁ జేసినాఁడు. చూడుఁడు :

'ఉరుతరగద్యపద్యోక్తులకంటె
సరసమై పరఁగినజాను తెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్య మగుటఁ
గూర్చెద ద్విపదలఁ గోర్కి దైవారఁ
దెలుఁగుమాట లనంగ వలదు, వేదముల
కొలఁదియ కాఁ జూడుఁ డిల—'

—బసవపురాణము.

తనకుఁ బూర్వమును, దనకాలమునను వెలయుచుండిన గద్యపద్యోక్తిప్రబంధములకును, దాను జాను తెనుఁగున రచించుకృతులకును గలతారతమ్యమును గవి పేర్కొనుచు జాను తెనుఁగు సర్వసామాన్య మగుటచే నాదరము వడయ వలసిన దే యని నిరూపించుకొనుచున్నాఁడు.

జాను తెనుఁగునకు 'సర్వసామాన్యత' యనుగుణము మాత్రమే కాక 'ప్రసన్నత' యనుగుణవిశేషము కూడఁ గల దని యతఁడే పేర్కొనుచున్నాఁడు. చూడుఁడు :—

'ఆరూఢగద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు'.

—పండితారాధ్యచరిత్రము.

తాను చేర్కొనిన జాను తెనుఁగునకు లక్షణము పేర్కొనినయాతఁడే లక్ష్యము గూడ విరచించి చూపినాఁడు. సోమనాథుని వృషాధిపశతకములోని యీపద్యముఁ జూడుఁడు:

చ. బలుపొడతోలుసీరయును
బాపసరుల్ గిలుపారుకన్ను వె
న్నెలతల సేదుకుత్తుకయు
నిండిన వేలుపుటేఱు వల్గుపూ
సలు గలరేని తెంక వని
జానుతెనుంగున విన్నవించెదన్
వలపు మదిం దలిర్ప బస
వా బసవా బసవా వృషాధిపా !

సోమనాథుని యీ పద్యమునుబట్టి జానుతెనుఁగనఁగా నచ్చతెనుఁగని శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు తమ కుమారసంభవపీఠికలో వ్రాసిరి. చూడుడు —

'తెనుగుదేశలో వాడుకలో నున్న తెనుఁగుమాటలను జాను తెనుఁగని వాడిరి. అదే యచ్చ తెనుఁగు. జాను తెనుఁగున కుదాహరణముగా నియ్యఁబడిన సోమనాథుని పద్య మచ్చ తెనుఁగుననే రచింపఁబడెనుగదా! ప్రాఁతమాటలు విడచి వాడుకలో నున్నమాటలు వాడుట యెప్పుడును కవులు గోరుచునే యుందురు. కొన్ని చోట్ల రసాభివ్యక్తికరణమునకో, పాండిత్య ప్రకర్షమునకో గూఢపదములు గాఢముగాఁ గొంత ఉపయోగింతురు. అది తాత్కాలికసందర్భములఁబట్టి యుండును.'

దీనిఁబట్టి జాను తెనుఁగనఁగా నచ్చతెనుఁ'గని విమర్శకుల యభిప్రాయ మయినట్లు తెలియుచున్నది. కాని యీ జాను తెనుఁగును జేర్కొన్న కవీశ్వరుల రచనములు చూచిన నవి యచ్చ తెనుఁగుకావ్యములు కా వని స్పష్టముగాఁ దెలియఁ

గలదు. కావున జాను తెనుఁగు అచ్చ తెనుఁగు కాదు. దాని కంటె విలక్షణ మైనది.

శ్రీ చిలుకూరి నారాయణరావుగారు పండితారాధ్య చరిత్ర పీఠికలో జాను తెనుఁగును గూర్చి యిట్లు వ్రాసిరి :—

'జాను అనేది చదనుశబ్దమునకు రూపాంతరము. చదును చదురునకు రూపాంతరము. ఇది చతురశబ్దభవము. జాను తెనుఁగు లేక చదు నైన తెనుఁగు అంటే లోకవ్యవహారములో నున్న, సర్వజనసుబోధ మైన తెనుఁగు. దీనినే సోమనాథుఁడు తేట తెనుఁగు, జెన్నవిసూక్తి అని కూడ అన్నాడు. దీనినే కర్ణాటకలాక్షణికులు 'సమసంస్కృతోక్తి' అన్నారు. ఆది కవులు విద్వత్తును ప్రకటించడానికి నిఘంటువ్యాకరణముల మూలముగా బోధపడే సంస్కృతపదభూయిష్ఠము కాక, అదే పనిగా, వికారముగా, బలవంతముగా ఏర్చి కూర్చిన 'అచ్చ తెనుఁగు' మాటలతో మాత్రము కూడినభాష యున్న గాక, లోకవ్యవహారబద్ధము లైనసంస్కృతాంధ్రపదములతో వెలయవలెను.'

'జాను' అన్న పదము 'జాణ' యన్న పదమునకు వికృతి. 'జాణ' యనునది జ్ఞానశబ్దభవము. జానుశబ్దరూపనిష్పత్తి యిట్టిదే యయి యుండు నని నన్నిచోడని మఱియొక ప్రయోగమునుబట్టియుఁ దెలియుచున్నది. చూడుఁడు :—

క. జానఱి పశుపతి నుఱక వి
తానమహారంభుఁ డైనదక్షుం డనున

జ్ఞానికి మునుకొని వచ్చువి
మానం బన నమరి సతివిమానము వచ్చెన్.

—2 ఆ. 15 ప.

ఇచట జానుపదమునకు జ్ఞాన మనియే యర్థము చెప్ప వలయును. జానఱి యనఁగా తెలివి లేక, జ్ఞానము లేక యని యర్థము. ఇచట జానునకు చదును అన్న యర్థము చెప్పఁ గూడదు. కావున జాను తెనుఁ గనఁగా శిష్టపండితులు వ్యవహరించు మేలి తెలుఁగు.

జాను తెనుఁ గని స్పష్టముగాఁ జెప్పకపోయినను కేతన తన యాంధ్రభాషాభూషణములో నీ విభాగమును జెప్పినాఁడు. అతఁ డుదాహరించిన భాషావిభాగములను జాగ్రత్తగాఁ బరిశీలించిన నీ విషయ మూహింప వీలగుచున్నది. చూడుఁడు —

తత్సమంబు నాఁగఁ దద్భవం బన నచ్చ
తెనుఁగు నాఁగ మఱియు దేశ్య మనఁగ
గ్రామ్యభాష నాఁగఁ గల వైదు తెఱఁగులు
వేఱ వేఱె వాని విస్తరింతు.

—ఆంధ్రభాషాభూషణము 18 ప.

ఇందు అచ్చ తెనుఁ గని, దేశ్య మని భాషావిభాగములు వేఱ్వేఱుగాఁ జెప్పఁబడినవి. అచ్చ తెనుఁగు 'ఎల్ల వారికిఁ దెలిసెడి యా పలుకు' లని యాతఁడే పేర్కొనినాఁడు. ఇఁక దేశి తెనుఁగు అతఁడే పేర్కొనినయచ్చ తెనుఁగుకంటె విలక్షణ

మైన దని యతఁడు దేశితెనుఁగుపదముల కిచ్చినయుదాహరణ పద్యములవలనఁ దెలియుచున్నది. చూడుఁడు :

సీ. ఎఱుకువ నెత్తమ్మి యెరగలి యెసకంబు
నోసలింతి తేటి వెక్కసము నెమ్మి
మక్కువ చెచ్చెర మచ్చిక పొచ్చెము
కడిమి యేత్తెఱ లగ్గు కలవలంబు
వెన్ను పిన్నదనంబు పీనులు వెన్నడి
యెక్కలి తీవురుట యుక్కుమేటి
బాగు తొయ్యలి జోఁటి ప్రన్నన సరి జోటి
వేనలి పొలపంబు విన్ను మన్ను

గీ. నెల్లి కొలుట పిచ్చోపు లుల్ల మువిద
వీఁక కాఱియ గ్రద్దలు వేఁట గ్రేణి
కౌను పాలిండు లొగి మొగి గనయ మిట్టి
తెఱగు పలుకులు ధర దేశితెనుఁగు లయ్యె.

తెమ్మెర లేమావి తెలిగన్ను క్రొన్నన
వలరాజు రేఁడు వాలుగంటి
యలరులపిండు తెక్కలికాఁడు క్రొమ్మించు
కెమ్మోవి కెంజాయ కమ్మతావి
కడలి తామరకంటి వెడవిల్తుఁ డెడకాఁడు
నలువ కలువకంటి నాన సెగ్గ
మొలనాఁగ ముద్దియ చెలువ చిగురుబోడి
తెఱవ తలిరుఁబోఁడి మెఱుఁగుఁబోఁడి

గీ. పదరు పిసువుట పరిగమి పసలు నసను
పొద్దు రేయెండ తబ్బిబ్బు పోటుముట్టు
తనివి వలవంత చెంత మంతద మనంగ
దేర నాడిన ధర దేశి తెనుఁగు లయ్యె.

—ఆంధ్రభాషాభూషణము 23, 24 ప..

ఈ పద్యములలోని పదములను బరిశీలించిన నివి 'యెల్ల వారికిఁ దెలిసెడి యా పలుకులు' కా వని, తెలుఁగులలో మంచి పరిచయము గలపండితులు, శిష్టులు తెలియఁదగుమాట లని, యందుచే నివి కేతనమతప్రకారము అచ్చ తెనుఁగు కా దని తెలియుచున్నది. కేతనకవి తన కించుక పూర్వమే వెలసిన దేశికవులు (శివకవులు) తమ కావ్యములలోఁ బ్రయోగించిన జాను తెనుఁగునే దేశికవులు వాడినది గాన దేశి తెనుఁ గని పేర్కొనియుండ వచ్చును. శివకవుల కావ్యములలోని జాను తెనుఁగును బరిశీలించిన నది కేతన పేర్కొనిన దేశి తెనుఁ గనియే స్పష్టముగా గుఱుతింపఁగలము. ఈ దృష్టితోఁ జూచిన పాలకుఱికి సోమనాథకవీశ్వరుఁడు వృషాధిపశతకములో జాను తెనుఁగున కిచ్చిన 'బలుపొడతోలుసీరయును' అన్నలక్ష్య పద్యములోని పదములు అచ్చ తెనుఁగు కా దని, కేతనమత ప్రకార మవి దేశి తెనుఁగు పదము లని, అవి 'యెల్ల వారికిఁ దెలిసెడి యా పలుకులు' కావు కాన, యా దేశి తెనుఁగే శివ కవులు పేర్కొనినజాను తెనుఁ గని తేలుచున్నది.

ఇందుచే జాను తెనుఁ గనఁ గర్ణాటకలాక్షణికులు పేర్కొనినసమసంస్కృతోక్తియు, తెలుఁ గు లా క్ష ణి కు లు

పేర్కొనిన యచ్చ తెలుఁగును గాక 'యెల్ల వారికిఁ దెలిసెడి యా పలుకులు' కాని దేశిపదములు ప్రధానముగాఁ బ్రయోగించిన తెనుఁ గని, దానికిఁ బ్రసన్నతయు. సర్వసామాన్యతయుఁ బ్రత్యేకగుణము లని తెలియఁదగును.

తెలుఁగునఁ దొలుతగా నీ 'జాను తెనుఁగు' శబ్దమును వాడినవాఁడును, నా తెలుఁగురచనమును గవితలోఁ దెచ్చుటకుఁ దొలుతగాఁ బ్రయత్నించినవాఁడును నొక్క నన్నిచోడఁడే యని తెలియుచున్నది. అతనికిఁ బూర్వపుఁ దెలుఁగు కవీశ్వరు లెవ్వరును దీనిని బేర్కొన లేదు. అతఁడు దానిని దనకుఁ బూర్వ ముండినకన్నడకవులనుండి గ్రహించి యుండు ననుటకు సందేహము లేదు. వారిలోనైనను నొక రిద్దఱు కవు లీ పదమును వాడిరే కాని దాని స్వరూప మిట్టిదని తెలిపినవారు కారు. కన్నడమున నాగవర్మ, గుణవర్మ యనుకవు లీ 'జాణ్ నుడి'కిఁ బ్రసిద్ధులు. నయసేనకవియు జన్నకవియుఁ దమ గ్రంథములలో గుణవర్మ 'జాణ్ణుడి'ని బ్రశంసించి యున్నారు.

కన్నడమున ఛందోంబుధి రచించిననాగవర్మ తన కవితను బ్రశంసించుకొనినరీతి చూచినచో నన్నిచోడఁడు తన కృత్యవతరణికలోఁ గావించుకొనిన స్వీయకవితాప్రశస్తి దాని ననుసరించినదే యని తోఁపక మానదు. చూడుఁడు—

'అతిమధురప్రసన్న పరి
పూర్ణరసోచిత రంజితార్థసం
యుత సకలాగమోక్తయుత
లక్షణలక్ష్యసమస్తవస్తుసం

యుతె సరసీజగర్భన ముఖాం
బుజదిం దమగల్దు బందువా
క్నతి నెలసిర్కె కూర్తు
ముఖపంకజదొళ్ కవి నాగవర్మనా.

రచితపదప్రసన్న
పరిపూర్ణరసోచిత మర్థయుక్త మా
గుచిత పురాణమార్గ పద
పద్ధతి బంధురఛంద మెంచిసం
రచియిస వాచ్యవాచక
విశేష్యవిశేషణ లక్ష్యలక్షణ
ప్రచురతె కాళిదాసను
మనేటెసితీ కృతి నాగవర్మనా.

కర మస్తాక్షర ముచితా
క్షర మవలంబప్రసన్నమతి మధుర మలం
కరణయుతమెనిసి పేటిల్
ధరెయెళ్ కవిరాజహంస నొర్వం బల్లం.

ప్రాసానుప్రాసంగళ
వేసాగిరె సుక్కడంగి కన్నడ దింపే
ద్దాసు కవియ నాశు కవియ
నాసుకవిప్రకర మటెదు మెచ్చుగుమత్తే.

నవరసముణ్మె మాతుపొసతాగిరె
దేశియదే సెవెత్తుదెం

బవొలిరె, జాణ్మణం గొళిసె
పొణ్దివ దధఱ కృతిప్రబంధముం
కిఱిదిని దాగె పొచ్చపొసతాగె
మనోహర మాగె పేళ్వ స
త్కవి కవిరాజహంసనెనె
పేళలాడర్చిదె నీ ప్రబంధముం.

నయసేనకవి తన 'ధర్మామృత' మనుగ్రంథమున గుణవర్మ 'జాణ్'తనమును ప్రశంసించినాఁడు. చూడుఁడు—

అసగన దేసె పొన్నన మహోన్నతి
వెత్త బెడంగు పంప నొం
దసదృశ మప్ప పూర్వ్యరసభావ
గజాంకుశ నొళ్ప నెత్తరం
జిసువసదర్థదృష్టి గుణవర్మన
జాణ్ కవిరత్ననొజె శో
భిసి నెలసిర్కె ధారిణి మనం
గొళె మత్కృతియొళ్ నిరంతరం.

జన్నకవి తన యశోధరచరిత్రలో గుణవర్మ 'జాణ్మడి'ని ప్రశంసించి యున్నాఁడు. చూడుఁడు —

ఎనగనుకూల మక్కె
గుణవర్మన జాణ్మడి, పంపనింపు, పొ
న్ననబగె, నాగవర్మన
బహుజ్ఞతె, రన్నన కాంతి, నాగచం

ప్రసరసభావ, మగ్గళన వక్రతె,
సేమియదేసె, పుష్పబా
ణన మృదుబంధ, మీ కవిగళ త్తె
జినేంద్రపురాణకర్తృగళ్.

కన్నడకవులు పేర్కొనిన యీ 'జాణ్', 'జాణ్ణుడి' యనుపదములే 'జాను తెనుఁగు' అను నన్నిచోడని ప్రయోగమునకు మూలప్రకృతులు కాఁదగును. ప్రత్యేకించి దాని లక్షణ మిట్టి దని యెవరును జేర్కొనక పోయినను దమనాఁటి యాచారము ననుసరించి తల్లక్షణలక్షితముగానే రచనను వెలయించి యుండ వచ్చును. ఆ లక్షణము లేవో తెలియని మన మా లక్ష్యము లఁబట్టియే యాయాయిలక్షణముల నూహింప వలసి యున్నది. మనము చేసినది కూడ నట్టి ప్రయత్నమే.

సంస్కృతప్రధాన మై దేశిపదములు విరళముగా నున్న-తమకు పూర్వమునను, దమ కాలమునను వెలయుచుండిన -భవికవుల కావ్యసాహిత్యసర్వస్వమును జూచి, దేశికవితలోఁ దెలుఁగునకుఁ బ్రాధాన్య ముండవలయు నని పూని శివకవులు సాహిత్యభాషలో జాను తెనుఁగును వెలయించినారు; అభ్యుదయము నవతరింపఁ జేసినారు! ఈ యభ్యుదయవాంఛ యప్పుడప్పుడే పొడసూపుచుండినందున నన్నిచోడని కుమారసంభవములో జాను తెనుఁగు ప్రారంభదశలో నుండి పాలకురికి సోమనాథునికవితలోఁ బరిణతి చెందిన దనియు, శివకవులయభ్యుదయతపస్సు భాషాసాహిత్యములలో సోమనాథుని కాలమున ఫలిం

చిన దనియుఁ దెలియఁగలదు. కుమారసంభవములో జాను తెనుఁగుపదములు ప్రయుక్తము లయినను, నది ప్రారంభ దశయే కావున మిక్కిలిగా సాహసింపఁజాలని నన్నిచోడుఁడు నన్నయాదికవులవలె సంస్కృతసమాసభూయిష్ఠముగానే తన రచన సాగించినాఁడు. సోమనాథుఁడు ధీరుఁడై యభ్యుదయ పథమున నొక యడుగు ముందునకు సాఁగి జాను తెనుఁగును గవితలో వెలయించినాఁడు. సాహిత్యాకాశములో నొకతూరి యభ్యుదయపుమెఱుపు మెఱయించినాఁడు!

———

# దేశి సంప్రదాయము

తెలుఁగున మార్గదేశికవితాసంప్రదాయముల ప్రస్తావన మన కొక్క నన్నిచోడకవి కుమారసంభవమునందు మాత్రమే కానవచ్చుచున్నది. కుమారసంభవములోని పద్యములను గొందఱు లాక్షణికులు తమ తమ లక్షణగ్రంథములలో నుదాహరింపక పోలేదు. కాని వారిలో నెవ్వరును నీవిషయమై యంతగాఁ బట్టించుకొనినట్లు కానరాదు. నన్నిచోడని పద్యములను, నందలి భావములను ననుకరించినకవు లనేకులు మనపూర్వులలోఁ గలరు. వారిలోఁ గూడ నెవ్వరును నీ ప్రస్తావన చేసి యుండ లేదు. అగుట నీ సంప్రదాయముల గూర్చి యెఱుఁగుట కొక్క నన్నిచోడని ప్రయోగములే మనకు శరణ్యము లగుచున్నవి. కుమారసంభవములోని కృత్యవతరణికలో నీ కవితాసంప్రదాయముల ప్రస్తావన కల పద్యము లివి చూడుఁడు—

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

—కృత్యవతరణిక 23 ప.

చ. సురవరులం గ్రమంబున వచోమణిసంహతిఁ బూజ సేసి మ
ద్గురుచరణారవిందములకుం దగ సమ్మతిఁ జేసి మ్రొల్చి వి

స్తరమతులం బురాణకవిసంఘము నుత్తమమార్గసత్కవి
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిఁ జేసి మనోముదంబునన్.

—కృత్యవతరణిక 24 ప.

క. మార్గ కుమార్గము దేశియ
మార్గము వగవంగఁ దమకు మది నవలక న
ర్మార్గపదవర్తు లనఁదగు
మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్.

—కృత్యవతరణిక 28 ప.

దేశిమార్గంబులు దేశీయములుగా న
లంకారములఁ దా నలంకరింప

—కృత్యవతరణిక 36 ప.

నన్నిచోడుని కించుక తరువాతివాఁ డని చెప్పఁదగు (క్రీ. శ. 1145) నృపఘూర్జటి భీమయపండఁ డొక్కఁడు మాత్ర మీ మార్గదేశికవితాసంప్రదాయములఁ బ్రస్తావించి యున్నాఁడు. చూడుఁడు—

తలంపు సదర్థభావమునం
దద్గతసూక్తులం గూడ వన్నెనల్
గొలుసుగొనంగ వ్రావళ్లు
గోరినభంగిక వచ్చి ముట్టం గో
మలగతి దేశిమార్గములు
మట్టుపడం గ్గటనంబు లొప్ప నా

వ్యాలక్రియం జెప్ప నేర్చె
నృపఘూర్జటి భీమయపండం డిమ్మహిన్.
—దక్షిణదేశశాసనసంచయము. సంపు. 6. సంఖ్య 103.

ఈ రెండు సంప్రదాయములనుగూర్చి యెఱుఁగుట కింతకంటె వేఱు ప్రామాణికము లయినయాధారములు తెలుఁగుసారస్వతమునఁ గానరావు. కాన దీనిని బట్టియే మనము మార్గకవిత యనఁగా నెట్టిదో, దేశికవిత యనఁగా నెట్టిదో తెలిసికొనవలసి యున్నది. ఈ మార్గదేశికవితా లక్షణములనుగూర్చి పరిశీలించుటకు ముందు సంస్కృతములోఁ గాని యితరత్ర గాని యీ మార్గదేశి పదములు వాడఁబడి యున్న వేమో మనము తెలిసికొనఁదగును. సంగీతరత్నాకరములో సంగీతనాట్యకళలకు సంబంధించి మార్గదేశి భేదము లున్నట్లుగా నందలి యీ క్రింది శ్లోకములఁబట్టి తెలియఁగలదు. చూడుఁడు—

శ్లో. గీతం వాద్యం తథా నృత్తం
త్రయం సంగీత ముచ్యతే
మార్గో దేశీతి తద్ద్వేధా
తత్ర మార్గ స్స ఉచ్యతే
యో మార్గితో విరించ్యాద్యైః
ప్రయుక్తో భరతాదిభిః
దేవస్య పురత శ్శంభోః
నియతాభ్యుదయప్రదః
దేశే దేశే జనానాం య

ప్రయుచ్యా హృదయరంజకమ్
గీతం చ వాదనం నృత్తం
త ద్దేశీ త్యభిధీయతే
యేషాం శ్రుతిస్వరగ్రామ
జాత్యాదినియమో నహి
నానాదేశగతిచ్ఛాయా
దేశరాగా స్తు తే మతాః
కామచారప్రవర్తిత్వం
దేశరాగస్య లక్షణం
నియమే సతి చేత్తత్ర
మార్గత్వ మనులక్షితం.

—సంగీతరత్నాకరము.

భరతాది లక్షణకర్తలచే నిర్దిష్టములై, శాస్త్రీయము లయిన సంగీతనాట్యములు మార్గసంప్రదాయమునకుఁ జెందిన వనియు, నట్లు శాస్త్రీయములు కాక వివిధదేశములయందలి జనుల యభిరుచులనుబట్టి మనోహరముగ నాడఁబడుచుఁ, బాడఁబడుచుఁ బెక్కురీతులుగా నుండుసంగీతనాట్యములు దేశిసంప్రదాయమునకుఁ జెందిన వనియు సంగీతరత్నాకరము నందుఁ జెప్పఁబడినది.

సంస్కృతమున సంగీతనాట్యముల విషయమున నీ మార్గదేశిభేదము లున్నట్లు తెలియవచ్చుచుండఁగాఁ గన్నడమునందుఁ గవితకు సంబంధించియే యీ రెండు పదములును వాడఁబడినవి. 'దేసియొళ్ పుగువుదు పొక్కు మార్గదొళె

తళ్వోదు' అని పంపకవియు, 'నెగుల్దురసంమనం గొళిసె మార్గ మొడంబడె దేసి కబ్బమంబగె గొళె లింత పేల్దుదు' అని రన్న కవియు నీ రెండు కవితాప్రభేదములను బేర్కొని యున్నారు. మల్లికార్జునుని సూక్తిసుధార్ణవములో దేశిమార్గము ప్రస్తావింపఁబడినది. చూడుఁడు.

పదవిన్యాసన దేశిమార్గద విలాసం రూఢి వెత్తంగ హా
రదలంకారద బంధభావ దెసకం మెల్పాడి నొళ్ బందుకో
డిద నానారససారదాన మెసె దత్తెంబొల్దుకెయ్కొండు మె
చ్చిదనా సూక్తిసుధార్ణవాద్యకృతి పాత్రశ్రీగె సోమేశ్వరం.

కన్నడకవులను బెక్కుసందర్భములలో ననుకరించిన నన్నిచోడఁ డీ భావమును సంస్కృతమునుండికంటెఁ గన్నడమునుండియే పరిగ్రహించి యుండు ననుట సంభావ్యము కాఁగలదు. వాల్మీకి, వ్యాసుఁడు, కాళిదాసు, భారవి, ఉద్భటుఁడు, బాణుఁడు అనుసంస్కృతకవులను బేర్కొని స్తుతించి, యా తరువాత 'మును మార్గకవిత లోకంబున వెలయఁగ' అనుపద్యములోఁ జాళుక్యరాజు మొదలుగాఁ బలువురు దేశికవితను బుట్టించి యంధ్రవిషయమున దెలుగును నిలిపి రనుటచే మార్గకవిత యనఁగా సంస్కృతకవిత యనియు, దేశికవిత యనఁగాఁ దెలుఁగుకవిత్వ మనియుఁ దెలియుచున్నది. 'సురవరులం గ్రమంబున' అనుపద్యములో ఉత్తమమార్గసత్కవీశ్వరులను దేశిసత్కవుల సంస్తుతిఁ జేసి మనోముదంబునన్' అనుసందర్భమునుబట్టియుఁ బై యభిప్రాయమే బలపడుచున్నది. కాని మార్గదేశి పదముల

కీ యర్థము 'మార్గ కుమార్గము దేశియ మార్గము' అను పద్యమునందుఁ గుదురుట లేదు. అచటి సందర్భమునుబట్టి మార్గకవిత యనఁగా సంస్కృతసంప్రదాయానుగుణ మయిన–సంస్కృతప్రధాన మయిన—నన్నయాదుల కవితవంటి కవిత యనియు, దేశికవిత యనఁగాఁ దద్భిన్న మై దేశీయసంప్రదాయానుగుణ మై, దేశి తెనుఁగుపదముల వాడుకకుఁ బ్రాధాన్య మిచ్చుకవిత యనియు నర్థము చేసికొనవలసి యున్నది. 'దేశి మార్గంబులు దేశీయములుగా' ననుటలోఁ గూడ నీ యర్థమే కుదురుచున్నది. దీనిఁబట్టి సంస్కృతకవితకును, సంస్కృత లక్షణలక్షిత మగునన్నయాదుల సంస్కృతప్రధానకవితకును మార్గకవిత యనియు, దేశీయసంప్రదాయానుగుణ మైన తెలుఁగుకవితకు దేశికవిత యనియు, దేశిమార్గములు దేశీయములుగా నుండవలయు ననుట తెలుఁగులోని మార్గకవిత యైనను సంపూర్ణముగా సంస్కృతవిధేయ మై సంస్కృతమునకు దాస్యము చేయక దేశీయానుగుణముగా నుండవలయు ననియు నన్నిచోడుని యభిప్రాయ మైనట్లు తెలియుచున్నది.

ఇఁక నన్నిచోడఁడు తన కావ్యమున సాధించిన దేశీయత యెట్టిదో యించుక పరికింతము. నన్నిచోడఁడు కాళిదాస కవివలె హిమవద్వర్ణనముతోను, పార్వతీవృత్తాంతముతోను దన కావ్యమును బ్రారంభింప లేదు. తన కావ్యమునందు వస్త్వైక్యమును సాధించుటకుఁ గాఁబోలును సతీదేవివృత్తాంతమును, దక్షాధ్వరధ్వంసమును మొదటి రెండాశ్వాసములలో నభివర్ణించినాఁడు. ఆదిశివుఁడే త్రిమూర్తిత్వమును బొంది

విశ్వసృష్టికిఁ గారణభూతుఁ డయ్యె ననుశివపురాణకథను సంగ్రహించి దక్షుఁ డాదిశక్తిపరమేశ్వరుల నావాహనము చేసి వారిని మిథునచర్యాసక్తికిఁ బురికొల్పఁగా వారు కరికరిణీ రూపములను దాల్చి క్రీడించినపుడు వారికి గజాననుఁడు జన్మించి నట్లు వర్ణించినాఁడు. ఈ గజాననజన్మవృత్తాంతము శివ పురాణమునం దీరీతిగా లేదు. పార్వతీదేవి నలుఁగుపిండి బొమ్మకథ మాత్రమే మన కనుశ్రుతముగా వినవచ్చుచున్నది. కాని దానికిని బురాణములం దాధారము కానరాదు. సుప్ర భేదాగమమునం దీ గజాననోత్పత్తి నన్నిచోడఁడు వర్ణించిన రీతినే యున్నది. చూడుఁడు—

అథాత స్సంప్రవక్ష్యామి విఘ్నేశ స్థాపనం పరమ్
ఆదా త్వహ ముమాసార్థం క్రీడార్థం హేమవద్వనే
కరేణు శ్చ గజేంద్రేణ సంభోగ మకరో త్తతః
యదృచ్ఛయా తు తం దృష్ట్వా తదాకార మశాపహన్
కరేణో రాకృతిం చోమా తదాక్రీడ మహర్నిశమ్
తస్యాం తు గర్భ మదధా త్తస్మిన్ కాలే తతోద్భవః
ఫలం దక్షిణహస్తేన వామహస్తే స్వశృంగకమ్
పాశాంకుశోర్ధ్వహస్తే తు గజహస్తే తు లస్తకమ్
కరండమకుటం ప్రోక్తం సర్వాభర్ణభూషితమ్
శిర శ్చక్రప్రభాం కృత్వా నర్మపేఠోపరిస్థితమ్
దాడిమీపుష్పసంకాశం సర్వాభరణభూషితమ్
ఆసనం స్థానకం వాపి కారయే ద్విఘ్ననాయకమ్.

సుప్రభేదాగమము – త్రిచత్వారింశత్తమపటలము.

ఇందు హిమవద్గిరి యని యుండ నన్నిచోడఁడు రజత పర్వత మని పేర్కొనినాఁడు. ఇం దీకథను బరమేశ్వరుఁడే విఘ్నేశ్వరునకుఁ దెలిపిన ట్లుండఁగాఁ గుమారసంభవమునం దాకథ మాత్రమే యభివర్ణింపఁబడినది. ఇట్లు సుప్రభేదాగమము ననుసరించి నన్నిచోడఁ డీ గజాననవృత్తాంతమును రచించె నని చెప్పఁదగి యున్నను నా విషయమై యట్లే యని నిర్ధరింప వీలు లేకున్నది. ఆగమముల ప్రాచీనత యెట్టిదో నిర్ణయింప శక్యము కాకుండుటయే దానికిఁ గారణము.

ఈ గజాననోత్పత్తికథ యిట్లే ప్రాచీనతమిళగ్రంథములయందుఁ బ్రసిద్ధమై యుండుటచే నితఁడు దీనినిమాత్రము దక్షిణదేశీయగాథలనుండి సంగ్రహించి యుండు ననుటకు సందేహము లేదు. తమిళవాఙ్మయమున క్రీస్తుశకము ఏడవ శతాబ్దమున రచింపఁబడిన 'తేవార' మనుగ్రంథమున నీవృత్తాంతము సూచింపఁబడినది. ఇది 'జ్ఞానసంబందర్' అనుకవిచే క్రీ. శ. 652 ప్రాంతమున రచింపఁబడెను. తేవారమందలి యీ క్రిందిపద్యము చూడుఁడు :

పిడియదన్ ఉరువుమై కొళమిగు కరియదు
వడికొడు తనదడి వళిపడుం అవరిడర్
కడిగణ పతివరం అరుళినన్ మిగు కొడై
వడివినర్ పయిల్ వలి వలముఱై ఇఱైయే.

సతీదేవి యాఁడేనుఁగు రూపము దాల్పఁగా శివుఁడు మగయేనుఁగు రూపము ధరించి క్రీడించి నప్పుడు పుట్టినట్టి

వాఁడును, వలివలం గ్రామమున వసించినట్టివాఁడును నగు గణపతి దానశీలు రగుజనుల కష్టములఁ దొలఁగించి రక్షించుఁ గాక అని దాని తాత్పర్యము.

ఈ విషయమే తమిళవాఙ్మయమునందలి వినాయక పురాణమునందుఁ గూడ నభివర్ణింపఁబడినది. మలయాళ రామ చరిత్రమునఁ గూడ నీకథ సూచింపఁబడినది. ఇట్లు తమిళ మలయాళములయందుఁ బ్రచారములో నున్న యీ కథ యాంధ్రదేశమునకుఁ గ్రొత్త - గజాననునికి గజాననత్వము గలుగుటకుఁ గారణ మిట్టి దై యుండినఁ బార్వతి నలుఁగు పిండిబొమ్మకథకంటె నెక్కువ సహేతుకముగా నుండు నని యూహించి యే తమిళకవియో యీ కథ నట్లుగాఁ దొలుత కల్పించి యుండును. అది యా దేశమునందును, నా దేశీయుల గ్రంథములయందును విశేషప్రచారము నొంది యుండఁగాఁ దన కావ్యమునందు దేశీయతను సాధింపఁ దలఁచిన నన్నిచోడుఁడు దాని గ్రహించి తన కావ్యము నలంకరించుకొని యుండ వచ్చును. వాల్మీకి రామాయణకథ దేశభాషాకవుల చేతులలోఁ బడి దేశీయము లగుమార్పులకుఁ జేర్పులకు లోనయినట్లే శివపురాణకథ కూడ నన్నిచోడని చేతిలోఁ బడి దేశీయతను సాధించుకొనినది.

దక్షుఁడు తన కుమార్తెల కాఁపురములను జూచి వచ్చుటకై బయలుదేరుటయుఁ, గశ్యపుఁడు, చంద్రుఁడు, యముఁడు నను మువ్వు రల్లురు నాతని కెదురేఁగి పెక్కు తెఱఁగుల సత్కరించుటయు, మొదలియల్లుఁ డగుశివునికడకుఁ బోఁగా నాతఁడు తనకుమారుని ముద్దాడుచుండి యాతని సత్క-

రింప కుండుటయు, నంత దాని కలిగి దక్షుఁడు శివు నవమా నించుటకై యజ్ఞము ప్రారంభించుటయు నన్నిచోడఁడు దేశీయతాపాదనకై కల్పించినవే కాని మూలమున లేదు. అప్పుడు దక్షపత్ని దక్షుని మనఃఖేదముఁ బాపుటకై చెప్పినమాటలు సామాన్యముగాఁ గుటుంబములలో ననుకొనుమాటలనే పోలి యుండి దేశీయతను బుణికి పుచ్చుకొనినవి. ఆ సందర్భము నందలి దక్షపత్నిమాట లివి చూడుఁడు—

గీ. తల్లిదండ్రులఁ బూజించి తగ వెలింగి
మన్నపొడ వైననే యుత్తమాము లనియుఁ
బ్రియ మెఱుంగు నం దిచ్చినబిడ్డ మనకుఁ
బాసె నని యుండుఁ డింక నీ పలుకు లేల ?

ఈమాట లెంత సహజముగా నున్నవి!

దక్షుఁడు చేయుచుండినయజ్ఞమునకు రోహిణ్యాదులు వెడలుచుండుటను జూచి సతీదేవి పిలువనిపేరంటముగాఁ దానే బయలుదేరి పోయి పరాభూతురాలై యోగవిసృష్ట దేహ యయిన ట్లుండఁగా నిందు దక్షుఁడే తక్కిన తన యాఁడు బిడ్డలతోఁ బాటు సతీదేవిని గూడఁ బిలిచికొని వచ్చుటకై తన వనితలను బంపినాఁడు. ఇదియు దేశీయసంప్రదాయానుసారి యై యుండి మనోజ్ఞముగా నున్నది. పైపెచ్చు సతీదేవిశీలము దీనిచేఁ బరిపుష్టము కూడ నగుచున్నది.

తన కుమారుఁడును, యువరాజపట్టాభిషిక్తుఁడు నగు వినాయకుఁ డుండఁగా వీరభద్రునిచేతనో, మఱెవ్వరిచేతనో దక్షాధ్వరధ్వంసము చేయించుట సమంజసము కా దని

భావించి గజాననుఁడే 'అస్మదీయజననీపరాభవంబు కావున విప్పని నాకు దయసేయవలయు' నని పరమేశ్వరు నడిగి యాతనిచే ననుమతి గొని ప్రమథగణసమేతుఁడై పోయి యధ్వరధ్వంసము నిర్వర్తించినాఁడు. ఆసందర్భమున జరగిన హింసాకాండ యంతయు నేదో మఱొకలోకమున జరుగుచున్నట్లు కాక మనకు నిత్యపరిచితము లయినశివాదికము నకైనే తోఁచుచు దేశీయతాముద్ర నొంది యున్నది.

ఇఁకఁ బార్వతీశైశవక్రీడల నభివర్ణించుసందర్భము నందలి గుజ్జెనగూళ్లు, బొమ్మపెండ్లిండ్లు మొదలగున వన్నియు దేశీయములే యని వేఱుగాఁ జెప్ప నవసరము లేదు. పార్వతికి 'ఓం నమశ్శివాయ' యని పంచాక్షరీమంత్రముతో నక్షరాభ్యాసము చేయించుట దేశీయము కాక మఱేమి? చూడుఁడు:

క. గిరిసుత దొలుపలుకుల సు
స్వర మొదవఁగ నోం నమశ్శివాయ సదాస్మ
ద్వరదాయ నమః శంకర
శరణు మహాదేవ నీవ శర ణనఁ జొచ్చెన్.

—కుమా. 3 ఆ. 34 ప.

రతీమన్మథసంవాదఘట్టములోని యాలుమగల సంభాషణము సామాన్యకుటుంబములలో నాలుమగలకు జరుగు సంభాషణములవలె నుండి దేశీయతను సంతరించుకొన్నది. ఇట్లే పార్వతి తపఃప్రయత్నముల మాన్పుటకై మేనకయు, వృద్ధస్త్రీలును, చెలికత్తెలును చెప్పినమాటలును, వారి వాదమును నెక్కడనో యేలోకముననో జరగినట్లు కాక సహ

జాంధ్రదేశీయముగా నుండి మనోజ్ఞముగా నున్నది. కన్యా వరణము, పెండ్లిచూపులు, ముద్రారోహణము మొదలయి నవి దేశీయాచారములే. ఇన్నిటిని మించి నన్నిచోడఁడు వర్ణిం చినయుద్ధ మంతయు దేవాసురులకు జరగినయుద్ధముగాఁ గాక యాతనికాలమున జరగుచుండినయుద్ధవిధానములకుఁ బ్రతి కృతిగా నున్నది. యుద్ధసన్నాహము, దండు వెడలుట, స్కంధావారములో భటులు చేసినప్రతిజ్ఞలు, దండుతోఁ గూడ స్త్రీజనము చనుట, యుద్ధవిరామసమయములందు క్షతగాత్రు లయినవారికిఁ జికిత్సలు, ద్వంద్వయుద్ధములు మొదలయినవి దేవాసురయుద్ధ మతిమానుషము కాక మానవయుద్ధరీతిని దలఁపించుచు సహజతను దేశీయతను సాధించుకొనినది.

ఇట్లు నన్నిచోడఁడు కథావస్తువునందు దేశిసంప్రదా యమును బాటించి దేశీయతను సాధించినాఁడు. ఒక్కవస్తువు నందు మాత్రమే కాదు. భావము, భాష, ఛందము నను విషయములయందుఁ గూడ నాతనిప్రయత్నము దేశీయ తను సాధించుటయే. వానిఁగూర్చి మఱొకచోట ముచ్చ టించుకొందము.

---

# కృత్యవతరణిక

కావ్యమునకు శ్రీకారము చుట్టుటతోడనే తెనుఁగుకవి ప్రాచీనకాలమునఁ గృత్యవతరణిక రచించి కాని కావ్య ప్రారంభము చేసి యుండ లేదు. మన తెలుఁగుకావ్యములలో నీ కృత్యవతరణికాభాగము ప్రత్యేకప్రాధాన్యమును వహించి యున్నది. కవి స్వీయవిషయాదికము నెల్ల వెల్లడించుకొనుట కీకృత్యవతరణిక యొక వేదిక యై తనరారుచున్నది. ఇష్ట దేవతాస్తుతి, పూర్వకవిస్తుతి, కుకవినింద, స్వప్నవృత్తాంతము, కృతికర్తృవంశాభివర్ణనము, కృతిపతివంశాభివర్ణనము, షష్ఠ్యంతములు ననునవి యీకృత్యవతరణికలోని యంగములు. తెలుఁగుకవుల జీవితవిశేషము లితరత్రయంతగాఁ దెలిసికొనుటకు వీలు లేనిమన కీకృత్యవతరణికాభాగములే యావిషయమున నుపకారకములును శరణ్యములు నగుచున్నవి. ఆయాయికవులు కూడ నీయవతారికాభాగమును బ్రధానగ్రంథమంత యుదాత్తముగా, రసభరితముగా రచించి యుండుట గమనార్హము.

ఈ దృష్టితో మాత్రమే కాక యింక ననేకవిధముల నన్నిచోడుని కుమారసంభవములోని కృత్యవతరణిక ప్రత్యేక ప్రాధాన్యము వహించి యున్నది. కవికి సంబంధించినవిషయములు మాత్రమే కాక మార్గదేశిసంప్రదాయములనుగూర్చి కూడ మన కీకృత్యవతరణిక మూలముననే తెలియవచ్చు

చున్నది. కుమారసంభవమున నలుబదితొమ్మిది పద్యము లలో నిమిడి యున్నయీ యవతారిక తెలుఁగుసాహిత్యము లోనే ప్రత్యేకప్రాధాన్యము వహించి తరువాతికవు లనేకు లకు మార్గదర్శక మైనది. ఈ భాగమునందు వరుసగా నిష్ట దేవతాస్తుతి, పూర్వకవిస్తుతి, కుకవినింద, కావ్యప్రశస్తి, కృతిభర్తృవంశాభివర్ణనము, షష్ఠ్యంతములు, కథాసూత్ర విరచనము నను విషయములు కలవు.

కావ్యారంభమునందు నిష్టదేవతాస్తుతిని జేయునాచా రము సంస్కృతకవులలోఁ గూడఁ గలదు. కాని వారు మన తెలుఁగుకవులవలె వరుసగా బహుదేవతాస్తుతిని జేయ లేదు. నన్నిచోడునికిఁ బూర్వము నన్నయ కూడ 'హరిహరాబ్జ గజాననార్కషడాస్యమారసరస్వతీ, గిరిసుతాదిక దేవతా తతికి న్నమస్కృతి సేసి' యని యొక్కపద్యములో నందఱు దేవతలను స్తుతి యొనర్చినాఁడే కాని నన్నిచోడనివలె నొక్కొక్కదేవత నొక్కొక్కపద్యములో స్తుతి యొనర్చి యుండ లేదు. నన్నిచోడఁ డీ సంప్రదాయమును గన్నడకవుల నుండి గ్రహించినట్లు తోఁచుచున్నది. వారు కావ్యారంభము లందు హరిహరబ్రహ్మ సూర్య గణేశ సరస్వతీ పార్వత్యాది దేవతలను స్తుతి యొనర్చిరి. వారి ననుసరించిననన్నిచోడఁడు కూడఁ గావ్యారంభమునందు హర, హరి, బ్రహ్మ, సూర్య, గజానన, షణ్ముఖ, మార, పార్వతీ, సరస్వతు లను దేవత లను నొక్కొక్కరి నొక్కొక్కపద్యములో స్తుతించి యున్నాఁడు. తెలుఁగుకవులలో నిట్లు ప్రత్యేకప్రత్యేకముగా నిష్టదేవతాస్తుతి చేయుట కితఁడే ప్రథముఁడు.

కావ్యావతారికలోఁ బూర్వకవిస్తుతి, కావ్యప్రశస్తి, కుకవినింద మొదలయినవి సంస్కృతకావ్యములలోఁ గాని, నన్నయకాలమునఁ గాని లేవు. నన్నయ భారతావతారికలో నీ యంశములు కానరావు. నన్నిచోడనివలెనే యాతఁడును బూర్వకవిస్తుతియుఁ, గుకవినిందయుఁ జేసియుండ వచ్చును. పూర్వకవిస్తుతిలో నన్నిచోడనివలెనే వాల్మీకి మొదలగు సంస్కృతకవీశ్వరులను స్తుతించియుండ వచ్చును. ఈ సంప్రదాయములను గూడ నన్నిచోడఁడు కన్నడకవులనుండియే గ్రహించి తనకావ్యమునందు స్థాపించెను. తెలుఁగునఁ దరువాతి కవు లీతని ననుసరించిరి. పూర్వకవిస్తుతితోఁ బాటు కుకవినిందయుఁ దెలుఁగుకవులకు నవతారికలో విధిగా రచింపవలసిన భాగమై పోయినది. విడువరానికవిసమయముగాఁ బరిణమించినది. నన్నిచోడఁడు పూర్వకవిస్తుతిలో వాల్మీకి, వ్యాసుఁడు, కాళిదాసు, భారవి, ఉద్భటుఁడు, బాణుఁడు నను సంస్కృతకవీశ్వరులను వరుసగాఁ బ్రత్యేకప్రత్యేకముగా నొక్కొక్కపద్యములో స్తుతించి, దేశికవితను బుట్టించి తెనుఁగును నిలిపినచాళుక్యరాజు మొదలుగాఁ బలువురిని స్మరించి, పిదపఁ గుకవినింద చేయుచున్నాఁడు. ఈ క్రింది పద్యములు చూడుఁడు:

గీ. చెనసి గుణమైన దోషంబు సేయ నేర్చుఁ
గుకవి కృతులందు దోషంబు గుణము సేయ
నేరఁ, డది యట్ల, దొంతులు సేరి నాయి
దోర్వ నేర్చుఁ గాకది యేమి సేర్వ నేర్చు.

గీ. నెఱయ రసవంత మగుకృతి కెఱఁగ నేర
రల్పరసకృతి కెఱఁగుదు రలుపు లెల్లఁ
జెఱకు పిడిచినరసమున కెఱఁగి రాక
పిప్పి కరిగెదునీఁగలవెల్లువోలె.

గీ. తద్జ్ఞానం బెర్గ నగుఁ గవితావిశేష
మజ్ఞానం బేమి యెఱుఁగంగ నగు సమస్త
కనకవర్ణోత్కరం బొరగంట నొరసి
చూచి కా కెర్గ వచ్చునె సుద్దరాత?

ఈ కుకవినిందను జేయుటలో నిట్టె యొక్కొక్కకవీశ్వరుఁడును నభినివేశము వహించి మనోహరము లగుపద్యములను విరచించి యున్నాఁడు.

తిక్కన తన నిర్వచనోత్తర రామాయణములో నొనర్చిన యీ కుకవినిందను బరికింపుఁడు—

చ. పలుకులపొందు లేక రసభంగము
సేయుచుఁ బ్రాఁతవడ్డమా
టలఁ దమనేర్పు సూపి
యొకటన్ హృదయం బలరింప లేక యే
పొలమును గానియట్టిక్రమముం
ధమమెచ్చుగ లోక మెల్ల న
వ్వులఁ బొరయం జరించు
కుకవుల్ ధర దుర్విటులట్ల చూడఁగాన్.

కుకవినిందకుఁ బిదప నించుమించుగాఁ బదునైదుపద్యములలోఁ గావింపఁబడినకావ్యప్రశస్తిలోఁ గవితాశయములు వివరింపఁబడినవి. ఈ భాగ మింత విపులముగా, సమగ్రముగా మనకు మఱెచ్చటను గానరాదు. ఆ సందర్భములోని యీ పద్యములు చూడుఁడు—

ఉ. అక్కజ మై మహార్థనివహంబు
సదుక్తులు మెచ్చఁ జూచినన్
గ్రుక్కిఁద మైనసత్కృతి యగు
ర్వగుఁ గా కిలఁ జీకు లావుకం
ద్రొక్కినయట్ల నోరికొలఁదుల్
పురికొల్పఁగ నందులోన నొ
క్కొక్కఁడు సక్క నైనఁ
గృతియుం గృతి యందురె? వాని మెత్తురే?

క. చతురోక్తుల నుతపదబహు
గతుల నలంకారభావకాంతిరసార్థో
న్నతిఁ గృతి నతిరసికులు వర
సతిగతి నెఱిఁగింప వలదె సౌభాగ్యమునన్.

మ. పదబంధంబుల నగ్గలించి
బుధశబ్దభ్రాజి యై సద్గుణా
స్పద మై దుష్కవిహృత్సరోజ
వనముల్ భంజింపుచున్ భూరిస
మ్మదలీలన్ విలసిల్లి
సత్కృతి జగన్మాన్యప్రభావంబునన్

మదనాగంబునుబోలెఁ గ్రాల
వలదా మా ఱెండు లేకున్నతిక్.

ఇతని ననుసరించి కొందఱు తెలుఁగుకవులు తమ కావ్యావతారికలలోఁ గావ్యప్రశస్తి చేసినను వారిలో నెవ్వరును నింత విపులముగాఁ జేసి యుండ లేదు. తిక్కన తననిర్వచనోత్తరరామాయణమునందుఁ జేసి యున్న కావ్యప్రశస్తి నన్నిచోడని ననుసరించినదే. భారతమునందుఁ బ్రసక్తి లేక పోవుటఁబట్టి కావ్యప్రశస్తి రచింపఁబడ దయ్యె నని మన మూహింపఁ దగును. నిర్వచనోత్తరరామాయణములోని యీ పద్యములు చదివినవారికి నన్నిచోడని కావ్యప్రశస్తిభాగము స్ఫురణకు రాక మానదు. చూడుఁడు —

ఉ. భూరివివేకచిత్తులకుఁ బోలు
నవం దలఁపక్ దళంబులక్
సౌరభ మిచ్చుగంధవహుచందమునం
బ్రకటంబు సేసి యిం
పారెడుపల్కులం బడయ
నప్పలుకుల్ సరి గ్రుచ్చినట్లుగాఁ
జేరుప నేరఁగా వలయుఁ
జేసెద నేఁ గృతి యన్నవారికిన్.

క. తెలుఁగుకవిత్వము చెప్పం
దలఁచినకవి యర్థమునకుఁ దగి యుండెడుమా
టలు గొని వళులుం బ్రాసం
బులు నిలుపక యొగిని బులిమి పుచ్చుట చదురే?

క. అలవడ సంస్కృతశబ్దము
తెలుఁగుబడి విశేషణంబు తేటపడంగాఁ
బలుకునెడ లింగవచనం
బులు భేదింపమికి మెచ్చు బుధజనము కృతిన్.

గీ. ఎట్టికవి కైనఁ దనకృతి యింపు పెంపఁ
జాలుఁ గావునఁ గావ్యంబు సరసు లైన
కవులచెవులకు నెక్కినఁ గాని నమ్మఁ
జొంమఁ బరిణతి గలుగుకవీశ్వరుండు.

క. లలితపదహృద్యపద్యం
బులన కథార్థంబు ఘటితపూర్వాపర మై
యలఁతియలఁతితునియలఁ గా
హాల సంధించినవిధంబు నమరఁగ వలయున్.

—నిర్వ. అవతారిక.

కావ్యప్రశస్తికిఁ దరువాతిది యంకితము. ఇది కూడఁ గన్నడకవులతోనే ప్రారంభ మయినది. కావ్యమును రాజునకో, మఱియొకరికో యంకిత మిచ్చునాచారము సంస్కృతకవులలో లేదు. నన్నయ కూడఁ దనభారతమును 'భారతశ్రవణాసక్తి' కలిగినరాజరాజనరేంద్రుని శ్రోతగాఁ జేసి వినిపించెనే కాని యాతని కంకిత మీయ లేదు. కన్నడకవులు మాత్రము తాము కృతికన్యాజనకు లై, తమకృతులను దమకన్యలు గాఁ దలపోసి, తమ్ముఁ బోషించురాజును గృతిపతిఁ జేసి, యాతని కంకిత మిచ్చుచుండిరి. కన్నడమునఁ బంపకవి యరికేసరిరాజునకును, రన్నకవి సత్యాశ్రయవల్లభునకును దమతమకావ్యములను

గృతి యిచ్చిరి. నన్నిచోడఁడును వారి ననుసరించి స_ప్త సంతానములలో 'నుత్కృష్టసంతానంబు సత్కృతియ కా నిశ్చయించి' తన 'కృతిసంతాన'మును దనకు గురువును, నిష్ట దైవమును, గూర్చునిజేశుఁడును దానే యయినజంగము మల్లికార్జునయోగికిఁ గృతి యిచ్చెను, అతని యంకితాంకపద్య మిది చూడుఁడు :

సీ. శరధినీరులు పయోధరములు గొని వచ్చి
కురిసి వారిధియందుఁ గూర్చునట్లు
చేనఁ బండినవిత్తు చేనిక ఫలకాంక్షఁ
బేర్మిఁ గ్రమ్మఱ వెదవెట్టునట్లు
రోహణాచలపతి కూహించి వరరత్న
సంచయంబున విభూషించునట్లు
తీర్థాళి కర్థిఁ దత్తీర్థోదకంబుల
నెసకంబుగా నర్ఘ్యమిచ్చునట్లు
గీ. నింగి ముట్టి యున్నజంగమమల్లయ
వరమునందుఁ గనినవస్తుకవిత
దగిలి వారియంద నెగడింతు రవికి దీ
పమున నర్చ లిచ్చుపగిదివోలె.

—కృత్యవతరణిక 49 ప.

ఇట్లు కృతి యొసఁగుటలోఁ గూడ మఱియొకవిశేషము కలదు. అది యే దనఁగాఁ గథానాయకునితోఁ గృతిపతి కభేదము పాటించి నాయకగుణాభివర్ణనవ్యాజమునఁ గృతిపతి గుణాభివర్ణనము చేయుట. ఈ సంప్రదాయమును గూడ

నన్నిచోడఁడు కన్నడకవులనుండియే పరిగ్రహించినాఁడు. కన్నడమున పంపకవి తన విక్రమార్జునవిజయమునందుఁ గథానాయకుఁ డగునర్జునునికిని, కృతిపతి యగునరికేసరి రాజునకును నభేదము పాటించి కథను నిర్వహించెను. అట్లే రన్నకవియుఁ దన 'సాహసభీమ' మనుకావ్యమునఁ గథానాయకుఁ డగుభీమసేనునకును, కృతిపతి యగుసత్యాశ్రయ వల్లభునకును నభేదము కల్పించి కథానిర్వహణము కావించెను. ఈ సంప్రదాయమునే యవలంబించి నన్నిచోడఁడును గుమారసంభవకథానాయకుఁ డగుపరమేశ్వరునికిని, కృతిపతి యగు జంగమమల్లికార్జునయోగికిని నభేదము పాటించి కథానిర్వహణము గావించినాఁడు.

ఇతని తరువాతఁ దిక్కన తన నిర్వచనోత్తరరామాయణమును మనుమసిద్ధిరాజున కంకిత మొసఁగెను. ఇతనివలెనే కేతన తరువాత తన 'దశకుమారచరిత్ర'ను దనగురు వగు తిక్కనసోమయాజికిఁ గృతి యిచ్చెను. ఇట్లు కావ్యములను రాజునకో, మఱియొకరికో కృతి యిచ్చునాచారము కూడ నన్నిచోడనితోనే యారంభ మయిన దని చెప్పఁదగును.

అంకితమునకుఁ బిదపఁ గృత్యవతరణికలోఁ గృతికర్తృ వంశవర్ణనాదికమును, కృతిపతివర్ణనమును గలవు. ఇట్లు కృతికర్తృ, కృతిభర్తృ వంశాభివర్ణనములు గావించుట ప్రాచీనసంస్కృతకావ్యములలో సాధారణముగాఁ గానవచ్చుట లేదు. ఈ విషయమునఁ గూడ నన్నిచోడఁడు కన్నడకవులనే యనుసరించె నని చెప్పఁదగును. కృతికర్త యెందుఁ

దన్నుఁ గూర్చియుఁ దనగురు వగుజంగమమల్లికార్జునయోగిని గూర్చియుఁ జాల సంగ్రహముగానే చెప్పుకొనెను. ఈ విషయమున నితని ననుసరించిన తెలుఁగుకవు లితనివలె సంగ్రహరచనలతోఁ దృప్తి నందలేదు. ఏ బ్రహ్మదేవునికడనుండియో ప్రారంభించి తమదాఁక విపులముగా నభివర్ణించుకొని కాని వారు విడువలేదు. కనుక నిట్టి వంశాభివర్ణనసంప్రదాయమునకుఁ గూడ నన్నిచోడుని యవతారికయే మార్గదర్శక మయినదని మనము భావింపవలసి యున్నది. కాని యీ విషయమున నన్నిచోడనికిని, గన్నడకవులకును నొక భేదము కూడఁ గలదు. కన్నడకవులు వీనిని గావ్యాంతమున వ్రాయఁగా నన్నిచోడఁ డౌచితిని బాటించి దానిని గావ్యారంభముననే కావించినాఁడు. తెలుఁగుకవులలో ముక్కుతిమ్మన యొక్కఁడు మాత్ర మీ విషయమునఁ గన్నడకవుల ననుసరించి స్వవిషయమును గావ్యాంతమునందుఁ జెప్పుకొని వినయము ప్రకటించెను. చూడుఁడు—

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
 సూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ
 దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మే
 నల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయా
 నమహాగ్రహారసన్మానయుతుఁడు

సీ. తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురుశిష్యుఁడు పారిజాత
హరణ మనుకావ్య మొనరించె నంధ్రభాష
నాదివాకరతారాసుధాకరముగ.

—పారి. 5 ఆ. 108 ప.

కాని కృతిపతి వంశాభివర్ణనమును మాత్ర మాతఁడు కూడఁ గావ్యారంభమునందే నిర్వహించెను.

కావ్యాపతారికలోఁ బ్రతి తెలుఁగుకవీశ్వరుఁడును విధిగాఁ బాటించుసంప్రదాయ మొకటి కలదు; అది షష్ఠ్యంతసంప్రదాయము. షష్ఠ్యంతములతోఁ గృతిపతి గుణగణములను కవి షష్ఠీవిభక్త్యంతవిశేషణములతో స్తుతించును. ఈ షష్ఠ్యంత రచనకూడఁ దెలుఁగున నన్నిచోడనితోనే యారంభ మయిన దని చెప్పఁదగియున్నది. నన్నయ షష్ఠ్యంతములను రచింప లేదు. నన్నిచోడనికిఁ దరువాతికవు లాతని ననుసరించి షష్ఠ్యంతరచనను—అదియు నాతనివలెనే కందపద్యములలోఁ—గావించిరి. ఇది యెంతవఱకుఁ బోయిన దనఁగా షష్ఠ్యంతరచనమునకుఁ గందపద్యము తప్ప మఱొకపద్యము పనికి రా దని కవీశ్వరులు భావించునంతగాఁ బోయినది. తెలుఁగున షష్ఠ్యంతములు చెప్పినకవీశ్వరు లందఱును వానిని గందపద్యములతోనే రచించుట యిందులకుఁ దార్కాణము.

ఈ షష్ఠ్యంతసంప్రదాయమునుగూర్చి వ్రాయుచు శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు దాని యావిర్భావమును గూర్చి యి ట్లూహించుచున్నారు. 'ఈ రచనయే తరువాత

నాంధ్రసాహిత్యమున నొక సుప్రసిద్ధసంప్రదాయమై వెలసి నది. ఇదియు దేశిపద్ధతులలోఁ జేరినదే యని చెప్పవచ్చును. దేశీయము లగునుదాహరణాది గ్రంథములలో దేశీయము లగుకళికోత్కళికలను, సంస్కృతచ్ఛందోబద్ధము లగుపద్య ములను సప్తవిభక్తులలోను రచించి తుద కొక పద్యమును సార్వవిభక్తికముగ రచించుపద్ధతి యొకటి కలదు. ఆ ఛాయనే సందర్భానుసారముగా ననుసరించి ఆ దేవునకు... ......బరమభక్తియుక్తి నావర్జితుండై కృతి యిచ్చుటలో నీకవి యెనిమిదివిభక్తులకు సూచకముగా నెనిమిది కంద పద్యములను షష్ఠ్యంతములనుగాఁ జేసి రచించినాఁడు.' కాని నన్నిచోడఁడీసంప్రదాయము నుదాహరణకావ్యసంప్రదా యమునుబట్టి యేర్పఱచె ననుట యంత యుక్తియుక్తముగాఁ దోఁపదు. కారణ మీ యుదాహరణపద్ధతి యాకాలమున నంత ప్రసిద్ధిగా లేక పోవుటయే. కాళిదాసు తన రఘువంశ మహాకావ్యము ప్రారంభమునందు రఘువంశ్యుల గుణగణ ముల నుగ్గడించుచు షష్ఠ్యంతవిశేషణములతో నుదాత్త కవితాఫణితితోఁ గొన్ని శ్లోకముల విరచించి యున్నాఁడు. ఆ శ్లోకము లివి చూడుఁడు—

సోఽహ మాజన్మశుద్ధానా మాఫలోదయకర్మణామ్
ఆసముద్రక్షితీశానా మానాకరథవర్త్మనామ్.

యథావిధిహుతాగ్నీనాం యథాకామార్చితార్థినామ్
యథాపరాధదణ్డానాం యథాకాలప్రబోధినామ్.

త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణామ్
యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినామ్.

శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణామ్
వార్ధకే మునివృత్తీనాం యోగేనాన్తే తనుత్యజామ్.
రఘూణా మన్వయం వక్ష్యే తనువాగ్విభవోఽపి సన్
తద్గుణైః కర్ణ మాగత్య చాపలాయ ప్రచోదితః.

—రఘు 1 సర్గ. శ్లో. 5–9.

కాళిదాసుకవితయం దపార మయినభక్తిప్రపత్తులు గలిగిన నన్నిచోడఁడు ఈ శ్లోకములలోని కవితకు ముగ్ధుఁడై యట్లే తనకృతిపతి యగు జంగమ మల్లికార్జునునిఁ గూడ షష్ఠ్యంతవిశేషణములతో స్తుతింప నుద్యోగము గాని యుండు ననుట యసంభావ్యము కాఁజాలదు. దానాదులందు 'తుభ్య మహం సంప్రదదే' యనుటలోని చతుర్థియే తెలుఁగున భాషానుగుణముగా షష్ఠి యై కృతిపతికిఁ గృతికన్యాదాన విషయమునఁ గూడ నట్లే షష్ఠ్యంతరచనకు దారి తీసి యుండు నని కూడ మన మూహింపఁదగును.

తెలుఁగున సప్తసంతానములఁ జేర్కొనుటకును నితఁడే ప్రథముఁడుగాఁ దోఁచుచున్నాఁడు—

ఉ. పూని మహాగ్రహారపుర
పుత్త్రిసమున్నతిదేవతాలయో
ద్యానతటాకసత్కృతినిధానము
లాశశితారకంబు సు

స్థానము లై మహిం బరఁగ
జంగమమల్లయపేర సప్తసం
తానము లొప్ప నిల్పుదు
ముదంబునఁ దత్ప్రభునాజ్ఞ పెంపునన్.

—1 ఆ. 46 ప.

మానసోల్లాసము మొదలగుసంస్కృతగ్రంథములలో నిష్టాపూర్తము లయిన మాత్రమే చెప్పఁబడి యున్నవి. చెఱువు, నిధి. ఉద్యానము, అగ్రహారము, దేవాలయము ననునయిదింటికిని గృతి, పుత్రుఁడు నను రెండు నధికముగాఁ జేర్చుటచే సప్తసంతానము లయి యుండును. ఈ సప్త సంతానప్రశంసకును నన్నిచోఁడఁడే యాచార్యపీఠము.

కుమారసంభవమునందలి యవతారికలోఁ గడపటి భాగము కథాసూత్రవిరచనము. తెలుఁగుకవులలో మఱెవ్వ రును నిట్లు కథాసూత్రవిరచనము చేయ లేదు. నన్నిచోఁడఁ డిందుఁ దనకావ్యమున నొకప్రణాళికను రచించుకొని దాని ప్రకారము తన రచనమును సాగించినాఁడు. ఈ పద్యము చూడుఁడు—

మహాస్రగ్ధర

సతిజన్మంబుల్ గణాధీశ్వరు
జననము దక్షక్రతుధ్వంసముం బా
ర్వతిజన్మంబుల్ భవోగ్రవ్రత
చరితయు దేవద్విషత్ క్షోభముల్ శ్రీ

సుతసంహారమ్ము భూభృత్సుత
తపము నుమాసుందరోద్వాహమ్ముఁ ద
ద్రతిభోగంబుం గుమారోదయము
నతఁ డనిం దారకుం బోర గెల్వుట.

అనం బరఁగుసకలావయవంబులం బరిపూర్ణం బైన కావ్యాంగనాసృష్టికి నన్నిచోడఁ డొకప్రణాళిక విరచించుకొని యాసకలావయవములను వరుసమెయిఁ దీర్చి దిద్దినాఁడు. ఇట్లు కథాసూత్రమును విరచించి దానిప్రకారము కావ్యము రచించుట కూడఁ గన్నడకవులయాచారమే. పంపాదికన్నడకవులు గ్రంథాంతమునందుఁ గథాసూత్రమును వివరించిరి. నన్నిచోడఁడు కథాసూత్రమును రచించుటలో వారినే యనుసరించినను వారివలె దానిని గ్రంథాంతమున రచింపక యౌచితిని బాటించి యవతారికలోనే రచించినాఁడు. దీనిఁ దరువాతి తెలుఁగుకవు లనుసరించినట్లు కాన రాదు.

ఇట్లు నన్నిచోడని యవతారిక యొక్క—స్వప్నవృత్తాంతమును దప్పఁ దక్కి—నయంగముల నన్నిటిఁ గలిగి తరువాతి తెలుఁగుకవులకు వరవడి యయినది. అవతారికలోని వివిధాంగములను దొలిసారిగాఁ దనకావ్యమున స్థాపించి నన్నిచోడఁడు తరువాతి తెలుఁగుకవులకు మార్గదర్శకుఁ డయినాఁడు. ఈ దృష్టితో నన్నిచోడని కృత్యవతరణిక ప్రత్యేకప్రాధాన్యము కలిగి యమూల్యమే కాక యపూర్వ మై కూడ నలరారుచున్నది.

—

# తొలి తెలుఁగు ప్రబంధము

ఆంధ్రసాహిత్యచరిత్రమున శ్రీ కృష్ణదేవరాయల యుగము ప్రబంధయుగ మనుపేర వ్యవహరింపఁబడుచున్నది. ఆ యుగమునందు వెలసిన మనుచరిత్రము, వసుచరిత్రము, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, ప్రభావతీప్రద్యుమ్నము, కళాపూర్ణోదయము ననుగ్రంథము లంతకుఁ బూర్వయుగములందు వెలసినగ్రంథములకంటె విభిన్నము లగులక్షణములఁ గలిగి 'ప్రబంధము' లనుపేరఁ జేర్కొనఁ బడుచున్నవి. పయిప్రబంధముల సామాన్యలక్షణముల నెల్లఁ గ్రోడీకరించి యాధునికవిమర్శకులు ప్రబంధశబ్దమున కిట్లుగా నొక నిర్వచనము గావించిరి. పురాణేతిహాసములలోని కథనో, యుపాఖ్యానమునో చేపట్టి, స్వకపోలకల్పనలచే దానిఁ బెంపు చేసి, యష్టాదశవర్ణన లందందుఁ జొన్పించి, రసాభివ్యక్తికిని, పాత్రచిత్రణమునకును నెక్కుడు ప్రాధాన్య మొసఁగి శబ్దార్థాలంకారసహితముగా రచింపఁబడినస్వతంత్రగ్రంథము ప్రబంధము. అల్లసాని పెద్దన రచించినమనుచరిత్ర మిట్టిప్రబంధములకు మార్గదర్శకముగాఁ బరిగణింపఁబడుచున్నది. ప్రబంధోచితమయినవస్తువుయొక్క యునికి మాత్రమే కాక యా ప్రబంధశరీరమున కావశ్యక మగుసంధిసామగ్రియు, సౌందర్యాపాదకము లగునితరావయవసౌష్ఠవములు నం దుండవలెను. అప్పుడే యది ప్రబంధ మగును. కావ్యమునం దంగాంగిభావసంబం

ధము చక్కఁ నెలకొనినప్పుడు కాని సౌందర్యము సంపూర్ణము కాదు. కావ్యమునందలి వస్తుశరీరమునకును, నితరావయవములకును బ్రకృష్ట మయినబంధ ముండును గనుకనే యా శిల్పమూర్తికిఁ 'బ్రబంధ' మను పేరు వచ్చినది. ప్రబంధమునం దష్టాదశవర్ణనలతోఁ దృప్తిపడక యిరువదిరెండు వర్ణనలను గూర్పవలయు నని యప్పకవి పేర్కొనినాఁడు. చూడుఁడు—

సీ. పురమును ఋతుషట్కమును బ్రయాణంబును
శైలంబు వేఁటయు సాగరంబు
మానీంద్రపుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప నద్భుతరణంబు
విజయంబు మద్యపానజవికారంబును
వనవిహారంబును వారికేళి
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోదితంబు

గీ. పద్మమిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండు వర్ణనలు గూర్చి
చెప్పవలయుఁ 'బ్రబంధంబు' శ్రీనివాస!

ఇట్టి ప్రబంధములు రాయల కాలమున విస్తారముగా వెలసినను నీ ప్రబంధలక్షణములను గలిగినగ్రంథము లంతకు మునుపు వెలయక పోలేదు. శ్రీనాథుని శృంగారనైషధమును, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి శృంగారశాకుంతలమును నీ ప్రబంధలక్షణముల నన్నిటిఁ గలిగి యున్నను నవి రెండును స్వతంత్ర

గ్రంథములు కాక యనువాదగ్రంథము లగుటచేఁ బ్రబంధ ములుగాఁ బరిగణింపఁబడ వయ్యెను. శ్రీనాథమహాకవిరచితము లగునితరగ్రంథములను బరిశీలించినచో హరవిలాసము నందు వస్త్వైక్యము లేకపోవుటచే నదియుఁ బ్రబంధ మనిపించు కొనదు. భీమకాశీఖండములయందలి వస్తువు స్థలపురాణకథ యగుటచే నవియుఁ బ్రబంధములు కాఁజాలవు. ఇదేవిధముగా శ్రీనాథయుగమునందలి యితర కవికృత గ్రంథములను గైకొన్నను — కొన్ని యనువాదగ్రంథము లగుటవలనను, కొన్ని చిత్రాఖ్యానము లగుటవలనను—సమగ్రప్రబంధములు కాలేక పోయినవి. ప్రబంధలక్షణములలో నేకొన్ని లక్షణ ములో మాత్ర మాయాగ్రంథములలోఁ గనఁబడును కాని సర్వాంగసుందర మయినప్రబంధమూర్తి యందుఁ గానఁ బడదు. ప్రబంధసుందరి కీసర్వాంగసౌష్ఠవము, సౌందర్యము నొక్క రాయల పోషణముననే లభించినవి. ఆయన కాలము ననే సర్వలక్షణసమన్విత మయినప్రబంధమూర్తి విలసిల్లి నది. రాయల కాలమునందలి గ్రంథములకుఁ బ్రత్యేకముగా వ్యవహరింపఁబడు నీ 'ప్రబంధ' పదము మాత్రము తిక్కన భారతమునందే పేర్కొనఁబడి యున్నది. అతఁడు తనభారత భాగమును 'ప్రబంధమండలి'యని పేర్కొనినాఁడు. చూడుఁడు.

క. అని రచనాకౌతూకమున
మన మలరఁగ నీప్రబంధమండలి కధినా
థునిగా నే పురుషునిఁ జే
ర్కొనువాఁడనొ యనుతలంపు గూడినమదితోన్.

—1 ఆ. 8 ప.

వ. అని పూని యీదృశంబు లగుపుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక యారాధనవిశేష మగుటం జేసి...

—1 ఆ. 31 ప.

ఇతనికిఁ దరువాత భారతారణ్యపర్వశేషమును బూర్తి గావించినశంభుదాసుఁడు ఎఱ్ఱాప్రెగ్గడ గ్రంథములో నైత మీప్రబంధశబ్దము కాన్పించుచున్నది అదియును గాక యెఱ్ఱాప్రెగ్గడ 'ప్రబంధపరమేశ్వరుఁ' డనుబిరుదముతోఁ బ్రఖ్యాతి వడసినాఁడు. ఇతని నృసింహపురాణము ప్రబంధలక్షణలక్షిత మయి యుండుటయే దానికిఁ గారణ మని చెప్పఁబడుచున్నది. కాని ప్రబంధోచిత మయినపాత్రచిత్రణము తిక్కన సాధింపఁగా ఎఱ్ఱాప్రెగ్గడ వర్ణనానైపుణ్యము దన రచనమునందు మిక్కుటముగా నెక్కొలిపినాఁడు. కాని పయి రెండుస్థలములందును నీ 'ప్రబంధ' పదము కావ్యసామాన్యార్థములోఁ బ్రయోగింప బడినదే కాని ప్రత్యేకార్థములోఁ బ్రయోగింపఁ బడలేదని ఘంటాపథముగాఁ జెప్పఁదగును. తిక్కనకంటెఁ బూర్వమే నన్నిచోడఁడు తన కుమారసంభవమునం దీప్రబంధశబ్దమును బ్రయోగించి యున్నాఁడు. చూడుఁడు—

ఉ. జంగమమల్లికార్జును నిసర్గకవిస్తవనీయసూక్తియు
క్తిం గొనియాడి తత్కరుణఁ గేనము లేకనురక్తయైనభా
షాంగనఁ దక్క నేలినమహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ బ్రబంధము సద్రసబంధురంబుగాన్.

—1 ఆ. 48 ప.

కాని నన్నిచోడఁడును తిక్కనవలెనే యీ 'ప్రబంధ' పదమును కావ్యసామాన్యార్థములో వాడినాఁడే కాని ప్రత్యేకార్థములో వాడినవాఁడు కాఁడు. చూడుఁడు—

వలవదే సమస్తవస్తుకవీశ్వర
రచితరుచిరకావ్యరత్నవీథి

—1 ఆ. 36 ప.

చ. పరఁగ సువర్ణబంధమృదు
భావము గల్గియు లోను జూడఁగాఁ
బొరపగుచిత్రరూపమును
బోలె నసత్కవికావ్య మిమ్మహిం
బరగు సువర్ణబంధమృదు
భావవిశేషము లోన నెల్పటన్
సరి యగురత్నపుత్రికయు
సత్కవికావ్యము నొక్కరూప మై.

—1 ఆ. 37 ప.

క. ముదమున సత్కవికావ్యము
నదరఁగ విలుకాని పట్టినమ్మునుఁ బరహృ
ద్భిద మై తల యూఁపింపని
యది కావ్యమె; మఱియుఁ బట్టినదియున్ శరమే?

—1 ఆ. 41 ప.

వ. అనం బరఁగుసకలావయవంబులం బరిపూర్ణం బై నదివ్యకావ్యాంగనాసృష్టికిం బ్రధానసృష్టికర్త యైన.

—1 ఆ. 45 ప.

చ. రవికులశేఖరుండు కవి
రాజశిఖామణి కావ్యకర్త స
త్కవి భువి నన్నిచోడఁ డఁటె
కావ్యము దివ్యకథన్ గుమారసం
భవ మఁటె సత్కథాధిపతి
భవ్యుఁడు జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁ
డట్టె వినం గొనియాడఁ జాలదే.

—1 ఆ. 57 ప.

పయి ప్రయోగములఁ బట్టి నన్నిచోడఁడు కావ్యము, ప్రబంధము అనుపదములను సమానార్థకములుగానే ప్రయోగించె ననియుఁ, బ్రబంధపదము నాతఁడు ప్రత్యేకార్థమునఁ బ్రయోగింప లేదనియు రూఢి యగుచున్నది. కాని రాయల కాలమునాఁటి ప్రబంధసామాన్యలక్షణము లన్నియు నన్నిచోడుని కుమారసంభవమునందును బొందుపడి యుండుటచేఁ గుమారసంభవమే మన తొలితెలుఁగుప్రబంధ మని చెప్పఁదగి యున్నది. కాని యాతనికాలమునఁ బురాణములే కాని యిట్టి ప్రబంధములనిర్మాణ మెక్కువగా జరుగనందునను, రాయల కాలమున విరివిగా నట్టిప్రబంధముల రచనము జరుగుటను నన్నిచోడునికిఁ బ్రబంధరచనామార్గదర్శిత్వగౌరవము దక్క లేదయ్యెను. 'వస్తైక్యమునఁ గొంత లోప మున్నను నీకుమారసంభవమే యథార్థముగా మన ప్రథమప్రబంధము' అని శ్రీ పింగళి లక్ష్మీకాంతకవిగారు కూడ 'ఆంధ్రసర్వ

స్వము' లో నిదే యభిప్రాయమునే వెల్లడించి యున్నారు. నన్నయవలెఁ గాక నన్నిచోడుఁడు తన గ్రంథము నష్టాదశ వర్ణనాత్మకమును నలంకారసమన్వితమును నగు కావ్యముఁ గానే సంతరింప సంకల్పించిన ట్లాతని యీ క్రింది పద్యములఁ బట్టి తెలియఁగలదు. చూడుఁడు—

క. వనజలకేళీరవిశశి
తనయోదయమంత్రగతిరతక్షితిపరణాం
బునిధిమధుఋతుపురోద్వా
హనగవిరహహోత్యవర్ణనాష్టాదశ మై.

వ. పరిపూర్ణం బై దశప్రాణంబుల సప్రాణం బై నవరసభావ భరితం బై షట్త్రింశదలంకారాలంకృతం బై రమణీయం బై నదివ్యకథారంభంబున కభిముఖుండ నై.

—1 ఆ. 44, 45.

నన్నిచోడుఁడు తన కుమారసంభవము నిట్లు కావ్యముగాఁ దీర్చి దిద్దుటకుఁ గన్నడకవుల కావ్యరచనాపద్ధతియే యుద్బోధక మని వ్రాయుచు శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు తమ యాంధ్రవాఙ్మయచరిత్రసర్వస్వమున నిట్లు వ్రాసిరి. 'నన్నయ వైదికమతదృష్టితో వేదవ్యాసాభిప్రాయానుగుణముగ భారతమును బురాణపద్ధతిని రాజరాజు కోరికపై రమణీయకథాకలితార్థయుక్తితో నక్షరరమ్యతను గూర్చి రచించినాఁడు. కాని యప్పటికే సంస్కృతసాహిత్యమున నలంకారప్రక్రియతో నైషధాదికావ్యము లనేకము లున్నను గావ్యసంప్రదాయపద్ధతి యవలంబింప లేదు. కాని కన్నడ

వాఙ్మయమున పంపాదికవులు భారతమును గ్రహించి కన్నడ భాషలో రచించినను వ్యాసమతాభిప్రాయానుగుణముగఁ బురాణముగ రచింపక, జైనమతానుగుణముగ నైనను బురాణముగ మాత్రము రచింపక, ప్రధానకథను మాత్రము గ్రహించి, కొన్ని సందర్భానుగుణ మైనమార్పులతో భీమునితో లేక యర్జునునితో మాత్రమే యీ కావ్యమునకుఁ బ్రధాననాయకునిగా నొనరించి, కథకు వస్త్వైక్యమును గూర్చి యొక చిన్న ప్రబంధముగా రచించినారు. నన్నయ కన్నడకవు లగుపంపాదులనుండి భారతాంధ్రీకరణసందర్భమునఁ గొన్ని విషయములను బరిగ్రహించెను. అవి చంపూమార్గపద్ధతి, సంస్కృతవృత్తములను గావ్యమునఁ బ్రవేశ పెట్టుట మొదలయినవి. కాని గ్రంథరచన లేక కూర్పునందు మాత్రము ప్రబంధపద్ధతిని పరిగ్రహింపక వ్యాసుని పురాణ పద్ధతినే యవలంబించి యుపాఖ్యానములతో సహా యితిహాస మునే రచించినాఁడు. ఇఁక నన్నిచోడకవికి మిగిలినవానితోఁ బాటు పంపాదుల ప్రబంధపద్ధతి యెక్కువగ నాకర్షించినది. వారి జైనమతమునకు బదులు తన శైవమతపరముగ తగిన కథను శివపురాణమునుండి గ్రహించి, దేశీయము లయిన మార్పులను జేసి, యష్టాదశవర్ణనలతోను, దశప్రాణముల తోను, నవరసభరితం బై, ముప్పదియా అలంకారంబుల తోడను పరిపూర్ణం బై రమణీయ మైనదివ్యకథను ప్రబంధక రూపమున రచించినాఁడు.'

కాని యీ యభిప్రాయ మంత యుక్తియుక్తముగా, సమంజసముగాఁ జూపట్టుట లేదు. తెలుఁగుకవీశ్వరులు కావ్య

నిర్మాణము చేయునాఁటికే సంస్కృతమునఁ బురాణములు, ఇతిహాసములు, కావ్యములు, నాటకములు మొదలగు సాహిత్యప్రక్రియ లన్నియు వెలసి యున్నవి. కావ్యములలోఁ గూడఁ గేవలపద్యకావ్యములు, కేవలగద్యకావ్యములు, గద్యపద్యమిశ్రితము లగుచంపూకావ్యము లనుము త్తెఱఁగుల రచనములును నానాఁటికే సంస్కృతమున నున్నవి. నన్నయ తా నాంధ్రీకరించుటకుఁ బూనినగ్రంథ మితిహాసగ్రంథ మగు టచే నాతఁడు మూలమునందువలెఁ గాక తన యభిప్రాయాను గుణముగఁ జంపూకావ్యపద్ధతి ననుసరించినను స్వీకరించిన వస్తుతత్త్వమునుబట్టి పురాణమార్గమునఁ దప్పఁ గావ్యమార్గ మున నాతఁడు రచించుటకు వీలు లేక పోయినది. నన్నిచోడని విషయ మట్టిది కాదు. నన్నిచోడఁడు శివపురాణమునుండి తన కావ్యమునందలి యితివృత్తమును బరిగ్రహించినను నతఁడు కాళిదాసు కుమారసంభవ మహాకావ్యమును జూచి యుండక పోలేదు. అతని కుమారసంభవమును గూడ నాతఁ డచట నచట ననుసరించినట్లును, గొన్ని శ్లోకములకు శ్లోకములే యాతనికావ్యమునఁ బద్యరూపమున ననువదింపఁబడినట్లును మనకుఁ దెలియవచ్చుచున్నది. ఇట్టిచో నాతఁడు కేవలము శివపురాణమును మాత్రమే మూలముగాఁ గొనియుండి తన కావ్యరచన సాగించి యుండినచో నాతఁ డీ సంప్రదాయమును కన్నడకవులనుండి గ్రహించె నని మన మంగీకరింపవచ్చును. కాని కాళిదాసు కుమారసంభవమును గూడ నాతఁడు చూచి యుండె నని మనకు స్పష్టముగాఁ దెలియవచ్చుచుండుటచే న్నిచోడఁడు కాళిదాసువలెనే తనగ్రంథము నొకమహాకావ్య

ముగాఁ దీర్చి దిద్దవలయు నని తలపోసి యుండవచ్చును. కాని తెలుఁగున నప్పటికే 'చంపూకావ్యపద్ధతి' యనుసరింపఁబడి యుండుటచేఁ దాను మాత్రము కాళిదాసువలెఁ గేవలపద్య కావ్యముగా రచించి తెలుఁగుసంప్రదాయమునకు భిన్నముగా నడవనేల యని తలపోసి నన్నయవలెనే తనకావ్యమునను జంపూకావ్యపద్ధతి ననుసరించినాఁడు. అంతే కాని యీతఁడీ కావ్యనిర్మాణపద్ధతిని గన్నడకవులనుండి మాత్రమే గ్రహించె నని మనము నిర్ధరించి చెప్పజాలము. కన్నడకవులును, నీతఁడును సంస్కృతమును జూచియే యీకావ్యరచనాసంప్ర దాయములను జేపట్టి యుండవచ్చును.

ఇఁకఁ గుమారసంభవమునందు వస్త్వైక్యము లేదను విషయమునుగూర్చి మనము పరిశీలింప వలసి యున్నది. నన్నిచోఁడుని కుమారసంభవమున మొదటి రెండాశ్వాస ములయందును గలగజాననజన్మవృత్తాంతము, దక్షాధ్వర ధ్వంసము ననువిషయములు ప్రధానకథ కంతగా సంబంధింపని వనియు, నందుచేఁ గావ్యమున వస్త్వైక్యము చెడిన దనియు స్థూలముగాఁ జూచినవారికిఁ దోఁపక పోదు. కాని కొంత సూక్ష్మముగాఁ జూచినచో నామొదటి రెండాశ్వాసముల లోనికథ ముఖ్యమే యని మన కనిపించును.

కాళిదాసు తన కుమారసంభవమునందు—

అథావమానేన పితుః ప్రయుక్తా
దక్షస్య కన్యా భవపూర్వపత్నీ

సతీ సతీ యోగవిసృష్టదేహా
యాం జన్మనే శైలవధూం ప్రపేదే.

1 స. 21 శ్లో.

అని తెలిపి యున్నాఁడు. తనజనకుఁ డగుదక్షుఁడు పరమేశ్వరు నవమానించుట కోర్వని దై యోగముచేఁ దన శరీరత్యాగము గావించినసతీదేవి హిమవంతునిభార్య యగుమేనకను బొందెను అని యీ శ్లోకమునకుఁ దాత్పర్యము. ఇట్లు సతీదేవి వృత్తాంతమును కాళిదాసు సూచనామాత్రముగాఁ జేకొని విడువఁగా నన్నిచోడఁడు స్పష్టతకొఱకై యీసతీదేవివృత్తాంతమును, దక్షాధ్వరధ్వంసమును, నాదక్షాధ్వరధ్వంసమునకుఁ గారణభూతుఁ డగుగజాననుని జన్మవృత్తాంతమును రచింప వలసి వచ్చినది. ఇందుచే నీవృత్తాంతకథనములవలనఁ గథ కైక్యము చెడలేదు సరి కదా పై పెచ్చు కథ కైక్యమును గూర్చుచు నివి కావ్యమున కొక నిండుదనమును జేకూర్చు చున్నవి. కాళిదా సేదో కారణమున నావృత్తాంతములను విపులముగా వర్ణింపనంతమాత్రమున నాభాగము లనవసరము లనియు, వస్త్వైక్యమును బాడు చేసిన వనియు మనము భావింప నక్కఱ లేదు. ఆ మాటకు వచ్చినచో నిదే సూత్రమునుబట్టి చూచితిమేనిఁ బ్రబంధరాజ మని వినుతి గన్నమను చరిత్రమునందు వరూథినీప్రవరుల వృత్తాంతము మాత్రము వస్త్వైక్యమునకు భంగము కలిగించునదే కదా! ఏకథ కాకథగా వ్రాయఁబడి యెట్లో యతికష్టముపై సంబంధము కల్పింపఁబడినయీాముక్తమాల్యద ప్రబంధ మగుట యెట్లు?

పార్వతీపరమేశ్వరులకు సంబంధించినవే యగునీవృత్తాంతములు తప్ప నశ్లీలసంబంధము గాని లేనియితరకథ లాముక్తమాల్యదయందువలె నిందు లేవు. కనుక నిందు వస్త్వైక్యము లేదనుట యంగీకారయోగ్యము కాదు. ఈ కావ్యమునందలి దీర్ఘవర్ణనలు వస్త్వైక్యమునకు భంగము గలిగించుచున్న వని యొకవాదము కలదు. కాని యిట్టి వర్ణనాచాపల్యము రాయల కాలమునాటి ప్రబంధకవు లందఱియందును గలదు. మను వసుచరిత్రాది ప్రబంధములయందలి దీర్ఘవర్ణనలే యిందులకుఁ దార్కాణము. కనుక నిందలి దీర్ఘవర్ణనలు ప్రబంధతాధర్మ మగువస్త్వైక్యమున కేమాత్రము ప్రతిబంధకము కాఁజాలవు.

ప్రబంధలక్షణములలో నతిప్రధాన మయినది, నియతముగా నుండవలసినది రసైకదృష్టి. 'వాక్యం రసాత్మకం కావ్యం' అని యాలంకారికనిర్వచనము. కుమారసంభవమున శృంగారరస మంగియు, వీరరసమును, దక్షిణరసములును సంగములును గా నీతనిరచనము సాఁగినది. ఆ యా సన్నివేశములం దాతనిరచనము పాఠకులను రసావేశపరవశులను గావించును. గజారణ్యమున సతీపరమేశ్వరుల లీలాకేళియు, నష్టమాశ్వాసమునందలి విటవిటీసంభాషణములును శృంగారరసభూయిష్ఠములు. దేవాసురయుద్ధమునందు వీరరసము ప్రతిపాదింపఁబడినది. తత్తదుచితస్థలముల నితరరసములును యథోచితముగా నిర్వహింపఁబడినవి.

ఇట్లు నన్నిచోడఁడు తన కుమారసంభవమును కాళిదాసు మార్గము ననుసరించి మహాకావ్యముగా సంతరించి, కావ్యలక్షణలక్షితముగాఁ జేసినను నది యుత్తరకాలప్రబంధముల

లక్షణములఁ జాలవఱకుఁ గలిగి యుండి ప్రబంధరచనా సంప్రదాయమునకు మార్గదర్శక మగుట నదియే మన 'తొలి తెలుఁగుప్రబంధ' మని యెన్నఁదగి యున్నది. నన్నిచోడుఁడు కావ్యప్రబంధపదములను సమానార్థకములుగానే వాడినను నాతని కుమారసంభవము మాత్ర ముత్తరకాలమునందలి ప్రబంధలక్షణలక్షిత మై ప్రబంధముల కెల్ల మార్గదర్శక మయినది.

---

# సంస్కృతానుకరణములు

నన్నిచోడకవి తనకుమారసంభవములోని కృత్యవతరణికయందుఁ బూర్వకవిస్తుతి చేయుచుఁ గవికులగురు వగు కాళిదాసు నిట్లు స్తుతించి యున్నాఁడు.

క. భాసురమతి వాల్మీకి
వ్యాసాదులు సనినజగతి వరకవితాసిం
హాసన మెక్కి కవీంద్రుల
దాసులఁగా నేలెఁ గాళిదాసుఁడు పేర్మిన్.

—1 ఆ. 19 ప.

ఇట్లే కుమారసంభవమును వ్రాసినయుద్భటకవిని గూడ నీ క్రిందిపద్యమున స్తుతించినాఁడు. చూడుఁడు :

క. క్రమమున నుద్భటుఁడు గవి
త్వము మెఱయఁ గుమారసంభవమ్ము నలంకా
రము గూఢవస్తుమయకా
వ్యముగా హరలీల చెప్పి హరు మెచ్చించెన్.

—1 ఆ. 21 ప.

ఈ యుద్భటుని కుమారసంభవమును నన్నిచోడఁడు చూచెనని నిర్ణయించుటకుఁ దగినయాధారము లేవియు విస్పష్టముగా నగపడ లేదని శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగా రభిప్రాయపడుచుండఁగా 'ఉద్భటుని కుమారసంభవము నీతఁడు

చూచె నని యేర్పడుచున్నది' యని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారును, వారి ననుసరించి 'ప్రధాననాయకుఁ డగు పరమేశ్వరుని గుణశీలభూషణమున నీతఁ డుద్భటుని ఛాయలను గూడ ననుసరించెను. పద్యచ్ఛాయలు కూడఁ దదనుసరణమును స్పష్టపఱచును' అని శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారును నభిప్రాయపడుచున్నారు. ఉద్భటుని విషయ మెటు లున్నను నన్నిచోడుఁడు కాళిదాసు కుమారసంభవమును జూచియే తన కావ్యమును రచించె ననుటకుఁ బ్రబలాధారము లనేకములు కలవు. కవి కాళిదాసుకావ్యమును మాత్రమే కాక యితఁడు మఱికొన్ని సంస్కృతగ్రంథములలోని శ్లోకములను, శ్లోకభావములను ననుసరించి యుండె నని తెలియుచున్నది. ఇది 'భావచౌర్య' మనునభిప్రాయముతో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు 'ఇతనికిఁ బూర్వము సంస్కృతకవు లనేకు లున్నను వారి యందు భావచౌర్య మగపడదు. ఈతఁ డట్టి భావచౌర్యము గావించి యున్నాఁడు' అని వ్రాసిరి. ఇతరకవుల భావములను గొన్నిటిని గ్రహించినంతమాత్రమున దానిని 'భావచౌర్య' మన రాదు. ఇతరుల భావములను సందర్భమునకుఁ దగిన విధమున స్వల్ప మగుమార్పు చేసియో, చేయకయో గ్రహించుట 'ఛాయోపజీవన' మనుకవిసమయముగా నాలంకారికు లంగీకరించిరి. అట్లు సంస్కృతగ్రంథములలోని శ్లోకములతో సాదృశ్యము గలనన్నిచోడనిపద్యము లేవో, యాతఁడు వాని నెంతవఱ కనుకరించెనో యించుక పరిశీలింతము.

ప్రసంగరత్నావళి యను ప్రాచీనసంకలనగ్రంథములో నీ క్రింది సంస్కృతశ్లోక మొకటి యుద్ధరింపఁబడినది. చూడుఁడు :

స్తా గర్భవాక్ మూలవిహీన ఏవ పుత్రో విశాఖో రమణీ త్వపర్ణా
స్తోపనీతైః కరసుమై రజస్రం ఫల త్యభీష్టం కి మిదం విచిత్రమ్.
—ప్రసంగరత్నావళిః (D 12008. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము)

పయిశ్లోకములోని భావమునే గ్రహించి నన్నిచోడఁడు షణ్ముఖని స్తుతిసందర్భమున షణ్ముఖుని స్తుతించి యున్నాఁడు. చూడుఁడు—

క. తనజనకుఁ డురుస్థాణువు
జనని యపర్ణాఖ్య తా విశాఖుం డనఁగాఁ
దనరియు నభిమతఫలముల
జనులకు దయ నొసఁగుచుండుషణ్ముఖుఁ గొలుతున్.
—1 ఆ. 8 ప.

కావ్యము పరహృద్భిదమై తల యూఁపింపవలయును. అట్లు కాకున్న నది కావ్యము కా దనుభావమును దెలుపు నీక్రిందిచాటువు ప్రసిద్ధముగా వినవచ్చుచున్నది. చూడుఁడు—

కిం కవేః తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః.
—చాటువు.

ఈ చాటువునందలి భావమునే గ్రహించి నన్నిచోడఁడు తన కృత్యవతరణికలోఁ గావ్యప్రశస్తిసందర్భమున నీ క్రింది పద్యమును గూర్చినాఁడు. చూడుఁడు :

క. ముదమున సత్కవికావ్యము
నదరంగ విలుకానిపట్టినమ్మును బరహృ
ద్భిదమై తల యూంపింపని
యది కావ్యమె; మఱియుం బట్టినదయుక్కు శరమే.
—1 ఆ. 41 ప.

(శ్రీ) హర్షుని నాగానందనాటకములోని ప్రస్తావన యందలి యీ శ్లోకమును జూడుఁడు—

శ్లో. శ్రీ హర్షో నిపుణః కవిః పరిష ద ప్యేషా గుణగ్రాహిణీ
లోకే హారి చ సిద్ధరాజచరితం నాట్యే చ దక్షా వయం
వస్త్వేకైక మపీహ వాంఛితఫలప్రాప్తే పదః కిం పునః
మద్భాగ్యోపచయా దియం సముదితః సర్వో గుణానాం
[గణః.

దీనిని నన్నిచోడఁ డి ట్లనుకరించినాఁడు.

చ. రవికులశేఖరుండు కవి
రాజశిఖామణి కావ్యకర్త స
త్కవి భువి నన్నిచోడఁ
డఁటె కావ్యము దివ్యకథం గుమారసం
భవ మఁటె సత్కథాధిపతి
భవ్యుఁడు జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁ
డట్టె వినం గొనియాడఁ జాలదే * ?
—1 ఆ. 57 ప.

---

* కన్నడములోఁ గూడ నిట్టిరచనమే కలదు, ఇతఁడు దీనిని సంస్కృతమునుండియే యనుకరించెనో లేక కన్నడమునుండియే యను కరించెనో మనము నిర్ధరించి చెప్ప వీలు లేదు.

కువలయానందమున నొకప్రాచీనకవిరచితం బగునీ క్రిందిశ్లోక మొకటి యుద్ధృత మయినది.

శ్లో. రవితప్తో గజః పద్మాం
స్తత్పత్న్యా న్బాధితుం క్షణాత్
సరో విశతి న స్నాతుం
గజస్నానం హి నిష్ఫలమ్.

ప్రాచీనకవి యెవ్వఁడో రచించిన యీ శ్లోకములోని భావమునే నన్నిచోడఁడు క్రిందివచనమునం దిట్లనువదించి యున్నాఁడు. చూడుఁడు :

వ. తదవసరంబున ఘర్మాంశుకరాహతి కులికి తదీయాప్తబంధు లైనయరవిందంబుల కలిగి దండింపం జొచ్చునట్లు వేదండంబులు కమలషండంబుల కరుగుదెంచె మహోత్సాహంబున— —1 ఆ.91 ప.

దండి కావ్యాదర్శములోని యీ క్రింది శ్లోకము కూడ నన్నిచోడని పయిరచనమున కుద్బోధక మయి యుండును.

మధ్యందినార్కసంతప్తః సరసీం గాహతే గజః
మన్యే మార్తాండగృహ్యాణి పద్మా న్యుద్ధర్తు ముద్యతః.

పుష్పదంతుని యీ క్రిందిశ్లోకమును జూడుఁడు :

శ్లో. మహోక్షః ఖట్వాంగం పరశు రజినం భస్మ ఫణినః
కపాలం చేతీయ త్తవ వరద తంత్రోపకరణమ్
సురా స్తాంతా మృద్ధిం దధతి తు భవద్భ్రూప్రణిహితాం
న హి స్వాత్మారామం విషయమృగతృష్ణా భ్రమయతి.

పుష్పదంతుఁడు శివుని సంబోధించి చెప్పినయీశ్లోకము లోని భావమునే గ్రహించి నన్నిచోడఁడు సతీదేవి శివుని మహిమను వర్ణించుసందర్భమున ని ట్లనువదించినాఁడు. చూడుఁడు:

మ. త్రిజగన్నాథుఁ బవిత్రగాత్రుఁ
గ్రతుమూర్తిం బూతు సత్ప్రాజ్యుఁ డే
యజినాభీలకపాలశల్యధరుఁ
డీయజ్ఞాదులం దందు పే
ద్విజదేవాదులకుం గపాల
కవచాస్థివ్రాతముల్ మేనులఁ
నిజ మై యున్నవి రుద్ర
చిహ్న లివె నీనిం బుచ్చి రా నేర్చరే?

—2 ఆ. 23 ప.

గీ. వీరి కెల్లను దేవతావిభవ మొసఁగు
చున్నపరమేశు రావింప నొల్ల ననియె
దింక నీయజ్ఞఫలము నీ కిచ్చునట్టి
పెద్ద లెవ్వ రీవచ్చినపెళ్లయందు.

—2 ఆ. 24 ప.

శివమహిమ్నస్తవములోని యీశ్లోకమును గాంచుఁడు—

శ్లో. రథః క్షోణీ యంతా శతధృతి రగేంద్రో ధను రథో
రథాంగే చంద్రార్కౌ రథచరణపాణి శ్శర ఇతి
దిధక్షోస్తే కోఽయం త్రిపురతృణ మాడంబరవిధిః
విధేయైః క్రీడన్త్యో న ఖలు ఫలతంత్రాః ప్రభుధియః

—శివమహిమ్నస్తవము.

ఈ శ్లోకమునే నన్నిచోడఁడి ట్లనువదించినాఁడు.
చూడుఁడు—

సీ. ధరణీతలం బెల్ల నరదంబు చంద్రార్క-
బింబముల్ చక్రముల్ పృథుజవాశ్వ
ములు వేదములు పగ్గములు చతుస్స్వరములు
ప్రణవంబు గసగోల బ్రహ్మ సూతుఁ
డగపతి విల్లు పన్నగపతి గొనయంబు
హరి గోల గఱి గరు డనల మమ్ము
పవనుండు వేగంబు దివిజగణంబులు
నెరవు లై యీశుఁడు పురము లేయఁ

గీ. దలఁచినంతన భోరనఁ దమకుఁ దార
వచ్చి కెలసంబు సేసినవారె కారె
వీరిఁ బట్టితిఁ బరమేశు విడుతు ననఁగ
వలదు నీ కీశుఁ డేలినవాఁడు గాఁడె ?

—2 ఆ. 25 ప.

శివమహిమ్న స్తవమునందలిదే మఱొకశ్లోక మిది.
చూడుఁడు—

క్రియాదక్షో దక్షః క్రతుపతి రధీశ స్తనుభృతా
మృషీణా మార్త్విజ్యం శరణద సదస్యా స్సురగణాః
క్రతుభ్రేష స్త్వత్తః క్రతుషు ఫలదానవ్యసనినో
ధ్రువం కర్తుః శ్రద్ధావిధుర మభిచారాయ హి మఖాః.

—శివమహిమ్న స్తవము.

ఈ శ్లోకము నొక్కముక్క యైన విడువక నన్నిచోడఁడు మక్కికి మక్కిగా ననువదించి యుండుట యీ క్రింది పద్యమునఁ గాన నగును. చూడుఁడు—

చ. తనరఁ గ్రియాతిదక్షుఁ డగు
దక్షుఁడు తత్క్రతువల్లభుండు స
న్మునితతి ఋత్విజుల్ సుర
సమూహి సదస్యులు తత్ఫలంబు లిం
దనిశము నిచ్చునీ వడఁచి
తట్టి మఖంబిది కర్త భక్తిమైఁ
దనరనియజ్ఞమైనఁ దుదిఁ దా
నభిచారము గాక పోవునే?

—2 ఆ. 92 ప.

నన్నిచోడఁడు పార్వతి యంగాంగవర్ణనము గావించు సందర్భమునందలి యీ క్రిందిపద్యము చూడుఁడు—

క. ఆంధ్రీస్తనాపహాసులు
సంధృతమధుపాబ్జముకుళసదృశము లతినీ
రంధ్రములు గుచము లఖిలపు
రంధ్రీజనతిలక మచలరాజాత్మజకున్.

—3 ఆ. 5 ప.

పై పద్యమునందలి 'ఆంధ్రీస్తనాపహాసు' లనుటలోని భావమును నన్నిచోడఁ డీక్రింది శ్లోకమునుండి గ్రహించి యుండును. చూడుఁడు—

*కర్ణాటీదశనాంకితః స్మితమహారాష్ట్రీకటాక్షాహతః
ప్రౌఢాంధ్రీ స్తనపీడితః ప్రణయినీభ్రూభంగవిత్రాసితః
లాటీబాహువివేష్టిత శ్చ మలయస్త్రీతర్జనీతర్జితః
సోఽయం సంప్రతి రాజశేఖరకవి ర్వారాణసీం వాంఛతి.

—రాజశేఖరుని పూర్ణ చాటువు.

భవభూతిమహాకవి రచించినమాలతీమాధవములోని యీ క్రింది శ్లోకమును జూడుఁడు—

శ్లో. వైకుంఠస్య కరంక మంకనిహితం స్రష్టుః కపాలం కరే
ప్రత్యంగం చ విభూషణం విరచితం నాకౌకసాం కీకసైః
.........................................................
కల్పాంతేషు కపాలినో విజయతే రౌద్రం కపాలవ్రతమ్.

పయిదాని ననుకరించిననన్నిచోడుని యీ క్రిందిపద్యమును జూడుఁడు—

మ. హరికంకాలము చేతిము
ద్ర దివిజేంద్రాస్థుల్ సుభూషావళుల్
గరళం బభ్యవహార మం
తకతనుక్షారంబు మైపూఁత పం
కరుహాసీనశిరఃకపాల
మురుభిక్షాపాత్రగా విశ్వసం

* కన్నడమునఁ గూడ నీ యాంధ్రీ స్తనప్రశంస కలదు. కనుక నన్నిచోడఁడీ భావమును సంస్కృతమునందుండియే గ్రహించె నని మనము నిర్ధరించి చెప్పఁ గుదురదు.

హరు వర్తించుమహోవ్రతో
పహతి సేయం బూన నీప్రాప్తియే?
—4 ఆ. 76 ప.

కుమారసంభవములోని చతుర్థాశ్వాసమునందలి యాశ్వా
సాంతపద్య మిది—

మహాస్రగ్ధర :—
హరహాసాకాశగంగాత్య
మలజలమరాళాబ్జనీహారధాత్రీ
ధరకర్పూరేందుకాకోదర
వరపతిదిగ్దంతిపక్షీరనీరా
కరముక్తాహారకుందోత్కర
రజతశరత్కౌముదీవ్యోతకీర్తి
శ్వరు నాత్మారాము వాణీవరు
వరగురు సర్వజ్ఞు నజ్ఞానదూరున్.
—4 ఆ. 119 ప.

ఈ పద్యములోని కూర్పే జైనమతములోని యొకా
నొక శాసనశ్లోకమున యథాతథముగాఁ గానవచ్చుచున్నది.
చూడుఁడు—

హరహాసాకాశగంగాజల
జలరుహనీహారనీహారధాత్రీ
ధరనీహారాంశుతారావని
ధరశరదంభోధరక్షీరనీరా

కరతారాభారతీద్రగదని
రదనపీయూషడిండీరముక్తా
కరసాంద్రేభహాసోజ్జ్వల
విశదయశోవల్లభం శాంతినాథం.

కుమారసంభవమునందలి నవమాశ్వాసములోని యీ క్రిందిపద్యము 'బాలే తవ ముఖాంభోజే దృష్ట మిందీవర ద్వయం' ఇత్యాది కాళిదాసుశ్లోకముయొక్క ప్రభావము గలిగి యున్నది. చూడుఁడు—

క. జలజంబులలో నీలో
త్పలములు పూచె నని ముగ్ధభావన దృగ్దీ
ప్తులు గలయొండొరులు మొగం
బులు గౌతుకలీలఁ జూచుకొ జోదురు దములోన్.

—9 ఆ. 56 ప.

కాళిదాసమహాకవి విరచిత మగునభిజ్ఞానశాకుంతలము లోని యీ క్రిందిశ్లోకమును జూడుఁడు—

శ్లో. యాత్యేకతోఽస్తశిఖరం పతి రోషధీనా
మావిష్కృతోఽరుణపురస్సర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగప ద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇ వాత్మదశాంతరేషు.

పయి శ్లోకమునే నన్నిచోడుఁ డీ క్రిందిరీతి ననుకరించి నాఁడు. చూడుఁడు—

తే. అస్తగిరిఁ జొందె రా జుదయాద్రి నెక్కె
నినుఁడు తేజస్వు లగువారి కెల్లప్రొద్దు

మానితం బగు నిల నొక్కమాటపొందు
హానివృద్ధులు సూచించు నట్లపోలె.

—8 ఆ. 190 ప.

ఈ క్రింది శ్లోకము చూడుఁడు—

శ్లో. సింహో మదద్విరదమస్తకమాంసభోజీ
సంవత్సరేణ కురుతే రతి మేకవారం
పారావతః ఖలు శిలాకణమాత్రభోజీ
కామీ భవ త్యనుదినం వద కోఽత్ర హేతుః

దీనికి నన్నిచోడుని పోలికపద్య మిది చూడుఁడు—

మ. సరసాహారము రాగహేతు
వను టజ్ఞానంబు పారావతో
త్కరముల్ సిక్కనిరాలు
ద్రిమ్మంగియు సదా కామార్తులై యుండుఁ గే
సరి సాంద్రామిషభుక్తియై
నను సకృత్సంభోగ ముందున్ మనో
హరవిజ్ఞానము కాక రాగ
రసముం దాహారనిర్వృత్తియే.

—12 ఆ. 219 ప.

ఇట్లు తనకుఁ బూర్వ ముండినసంస్కృతకవుల ననుకరించి వారి శ్లోకములలోని భావములతో నన్నిచోడఁడు పద్యములను రచించి తన కుమారసంభవము నలంకరించుటే కాక యొండు రెండు స్థలముల నన్నయరచనమును గూడ నాతఁ డనుకరించి యున్నాఁ డని తెలియుచున్నది. సురాపానము

చేసినస్త్రీల చేష్టలను నన్నయ భారతమునందలి యాది పర్వములో ని ట్లభివర్ణించి యున్నాఁడు. చూడుఁడు—

చ. గురుకుచయుగ్మముల్ గదలఁ
 గ్రొమ్ముడులందలి పుష్పముల్ పయిం
 దొరఁగ నిదాఘబిందువి
 తతుల్ సెదరన్ మదిరామదంబునన్
 బరవశ లయ్యు నిం పెసఁగఁ
 బాడుచుఁ దాళము గూడఁ దట్టుచున్
 దరుణులు నొప్ప నాడిరి ము
 దంబునఁ గాంతులు దమ్ముఁ జూడఁగన్.

—8 ఆ. 175 ప.

దానినే నన్నిచోడఁ డీ క్రిందిపద్యమున ని ట్లనుకరించినాఁడు—

ఉ. జీఱికకల్లు ద్రావి మదసిం
 ధురగామిను లన్ని కేఱియల్
 వాఱుచు గొడుగీతములు వా
 డుచుఁ బొల్పుగఁ గ్రాలి యాడుచున్
 గోఱడ మాడుచున్ బతులకున్
 వశవర్తులు కాక మేరకున్
 మీఱుచు వన్యకాంతలు ర
 మింతురు తద్విపినాంతరంబునన్.

—6 ఆ. 45 ప.

నన్నయభట్టు మత్స్యగంధివృత్తాంతమునందుఁ గామ చర్యలనుగూర్చి చెప్పుచు నా సందర్భమున :

గీ. ఎంత శాంతు లయ్యు నెంత జితేంద్రియు
లయ్యుఁ గడు వివిక్త మయినచోట
సతులగోష్ఠిఁ జిత్తచలన మొందెద రెందుఁ
గామశక్తికి నోర్వఁ గలరె జనులు?

—3 ఆ. 38 ప.

అని రచింపఁగా నన్నిచోడఁడు దాని ననుసరించి గజారణ్యమున సతీపరమేశ్వరుల కామకేళీకలాపముల నభివర్ణించు పట్టున దాని నిట్లుగా ననుకరించినాఁడు. చూడుఁడు—

తే. ఆదిమూర్తులు శివశక్తు లచలమతులు
హరుఁడు సతియును సురతార్థులై విహీన
తరము లగుమృగరూపముల్ దాల్చి రనినఁ
గాముమాయల నెవ్వారు నేమి గారు.

—1 ఆ. 104 ప.

ఇట్లు నన్నిచోడఁడు సంస్కృతకవులను మాత్రమే కాక నన్నయను గూడఁ గొన్నితావుల ననుకరించి వారి నన్నియడుగుజాడలలోఁ బద్యరచనము గావించి యున్నాఁడు. అది చోడనికి న్యూనత కాదు సరి కదా విశేషించి యాతనికి వారిపైఁ గలగౌరవాధిక్యమునే వెల్లడి సేయుచున్నది. తమ రచనముల నితరు లనుకరించుట యనుకార్యులకు గౌరవప్రదమే యగు నని వేఱ చెప్పఁ బని లేదు.

———

# తమిళకన్నడముల ప్రభావము

నన్నిచోడఁడు తన కుమారసంభవములోని కృత్యవతరణికలోఁ గృతికర్తృవంశవర్ణనాదికమునుగూర్చి ప్రశంసించుచు స్వవిషయము నీక్రిందిపద్యములలో నిట్లు తెలుపుకొని యున్నాఁడు.

చ. అరినరపాలమౌళిదళి
　　తాంఘ్రియుగుం డగువాఁడు పాకనా
డిరువదియొక్క-వేయిటి
　　కధీశుఁడు నాఁ జనుచోడబల్లికిన్
జిరతరకీర్తి కగ్రమహి
　　షీతిలకం బన హైహయాన్వయాం
బరశశిరేఖ యైనగుణభాసిని
　　శ్రీసతికిం దనూజుఁడన్.

క. కలుపొన్న విరులఁ బెరుఁగన్
గలుకోడిరవంబు దిశలఁ గలయఁగఁ జెలఁగన్
బొలుచునొరయూరి కధిపతి
నలఘుపరాక్రముఁడఁ డేంకణాదిత్యుండన్.

—1 ఆ. 53, 54 ప.

వీనిలో నాతని యొరయూరుపురవరాధిపత్యము వివాదగ్రస్తము. దానిమాట యెట్లున్నను నితని తండ్రి యగుచోడ

బల్లి యిరువదియొక్క వేయి గ్రామములు కలిగిన పాకనాటి కధీశుఁ డనువిషయమున మాత్ర మెట్టి విప్రతిపత్తియు లేదు. ఆప్రాంత మెల్ల నాకాలమునందు మొదటి కుళోత్తుంగచోడుని యాధిపత్యమున నుండెను. ఇది కాక యీతనికిని పశ్చిమ చాళుక్యరాజగు విక్రమాదిత్యునికిని దఱుచు యుద్ధములు జరుగుచుండెను. ఈ కారణములచే నాకాలమున నన్నిచోడునికిఁ దమిళకన్నడదేశీయులతోవలెనే వారిభాషలతోడను, వారి భాషాసంప్రదాయములతోడను గూడ విశేషపరిచయము గలిగి యుండు ననుట కెట్టి సందేహమును లేదు. ఆ యా భాషా సంప్రదాయములును, విశిష్టపదబంధములును కొన్ని యీతని కవితలోఁ గానిపించుచు నాభావమును దృఢపఱుచుచున్నవి. సంస్కృతకవుల గ్రంథములలోని మేలిభావములను బరిగ్రహించి యథానువాదమో, భావానువాదమో యేదో యొకటి గావించి వానిచేఁ దనకావ్యము నలంకరింపఁ జేసికొనిన నన్నిచోడఁడు తమిళకన్నడభాషలనుండియుఁ గొన్ని మేలివిషయములను బరిగ్రహింపక పోలేదు. తమిళభాషనుండి యీ మహాకవి గ్రహించినసంప్రదాయాదికములనుగూర్చి యించుక ప్రశంసింతము.

'దేశిసంప్రదాయ' మనునధ్యాయమున నిందలి గజాననుని జన్మవృత్తాంతము తమిళభాషలోని 'తేవార' మను గ్రంథమునుండి గ్రహించినదే యని దాని యానుపూర్వి యెల్ల వివరింపఁబడినది. తమిళములో నితరస్థలములలోఁ గూడ నీకథ యిట్లు కానవచ్చుచున్నది. క్రీ. శ. 14వ శతాబ్ది ప్రాంతముల నుండిననిశ్శంక కొమ్మన తన శివలీలావిలాసమున గణాధీశ్వరుని

జననమును నన్నిచోడకవి వ్రాసినట్లే వ్రాసి యున్నాఁడు. కనుక తమిళములోని యీ కథను దొలుతగాఁ దెలుఁగువారికిఁ దెలిపినవాఁడు నన్నిచోడఁడే యని చెప్పఁ దగును.

'కవిగమకిప్రశంసితుఁడు' (2–208), కవిగమకివాగ్మిగాయకనటచింతామణి (3–112), కవిగమకిబుధనిధానుఁడు (11–1) అని కుమారసంభవములో నీ మూఁడు స్థలములందును కవిగమకివాగ్మిప్రశంస గావింపఁబడినది. భారతమున నుద్యోగపర్వమం దొక్క-చో మాత్రము 'ఉండం గవిగమకిప్రముఖవిద్వజ్జనంబులు' (3–232) అని పేర్కొ-నఁబడి యున్నది. కవిగమకివాదివాగ్మి లను నీ చతుష్టయప్రశంస యాంధ్రవాఙ్మయమున మఱియొకచోఁ గానరాదు. ఆశు, మధుర, చిత్ర, విస్తరము లని చతుర్విధకవితాభేదము కూడఁ గొన్ని తెలుఁగులక్షణగ్రంథములలోనే కలదు కాని సంస్కృతాలంకారికగ్రంథములలోఁ గాన రాదు. తమిళభాషలోని యాలంకారికగ్రంథములలో నీ రెండు తెఱఁగు లగువిభాగములును గానవచ్చుచున్నవి. 'నవనీతపాట్టియర్' అను తమిళ భాషలోని యలంకారగ్రంథమున 'కవి, గమకర్, వాది, వాక్కి ఎన్ట్ర వగైయుం; ఆశు, మదురం, చిత్తిరం, విత్తారం ఎన్ట్ర నాల్ వగైయుం' అని యిరు తెఱఁగుల విభాగములును పేర్కొ-నఁబడినవి. 'కవిగమకివాదివాగ్మియర్' అని కన్నడ గ్రంథములందును సుప్రసిద్ధముగా నున్నది. నన్నిచోడఁ డీ తెఱఁగుకవులనుగూర్చి తమిళమునుండియో, లేక కన్నడము నుండియో పరిగ్రహించి యుండు ననుటకు సందేహము లేదు.

అష్టమాశ్వాసమున మునిస్త్రీమ మోహప్రాప్తూపవర్ణనా దత్తకర్ణుండైనక న్నెఱింగి పరమేశ్వరునకుఁ బార్వతి ప్రత్యంగ వర్ణనము చేసి తెలుపుచు—

వలకోటఁ బెరిఁగినవలరాజుహస్తిహ
స్తంబును గేశపాశంబు నెనయు.

—8 ఆ. 12 ప.

అని యామెకచము నభివర్ణించిరి. హస్తిహస్త మునకును, స్త్రీల కేశపాశమునకును నౌపమ్య మసాధారణము. సంస్కృతాంధ్రములలో మఱొకచోట నీ పోలిక కానరాదు. తమిళమున పిడియేనుఁగు తొండమువంటి కేశపాశ మనునర్థమున 'పిడికై కూన్దల్' అనుట కావ్యములలోఁ బ్రసిద్ధమయి యున్నది. చూడుఁడు :

పణ్ణురై మగళిర్ మాలై పైన్తుగిల్ కవన్దు కొళ్ళర్
కణ్ణురై మగళిర్ సోర్న్దు కా రిరుళ్ తివళుం మిన్పోల్
పెణ్ణురైప్ పిడిక్కైక్ కూన్దల్ పొన్నరి మాలై తాళ
వెణ్ణురై ఉడుత్తు నిన్రార్ వేన్దన్ నోక్కు ఉణ్ణ నిన్రార్.

జీవకచింతామణి 2633.

కై కవియాచ్ చెన్రు కణ్పుదైయాక్ కుఱుగిప్
పిడిక్కై యన్న పిన్నగం తీండి.

—అగనానూరు - పాలై, 9 పాట.

ప్రమానబండ్లకును, నావృతములపై నిలిచినస్త్రీలకును గలపోలిక నన్నిచోడకవిచేఁ బలుమాఱు లభివర్ణింపఁబడినది.

ఇట్టిపోలిక తమిళ గ్రంథములలోఁ గానవచ్చుచుండుటచేత నీకేఁడే యీపద్యము నాభాషాగ్రంథములనుండియే గ్రహించి యుండు నని తోఁచుచున్నది. తమిళభాషలోని జీవకచింతామణి యను గ్రంథమున 'మూనిడం పఱ్ఱ్త్తన కిఱుత్తం' అని ప్రయోగింపఁబడినది.

ఇట్లు కథావస్తుసంప్రదాయములను మాత్రమే కాక యీతఁడు తమిళభాషాపదములను గొన్నిటి నట్టే తనకావ్యమ్మునఁ బ్రయోగించి యున్నాఁడు. చూడుఁడు—

గీ. చెనసి గుణ మైన దోషంబు సేయ నేర్చుఁ
గుకవి కృతులందు దోషంబు గుణము సేయ
నేరఁ డది యట్ల నొంతులు సేరి నాయి
దోర్చు నేర్చుఁ గా కది యేమి సేర్చ నేర్చు.

—1 ఆ. 29 ప.

మ. ఒక యన్యాయము లేదె
యెవ్వరికి నే నోటంబుతో మ్రొక్క నో
డక లె మ్మిప్పటి కింత
సైఁపు మిటు గష్టం బేమనం బింక నా
లికిఁ గట్టాయము సేయుచుండు
డిది మేలే నీ కనుం బుష్పసా
యక తాపంబు సహింప
కోర్తు సురతై కాసక్తి దీనాస్య యై.

—8 ఆ. 177 ప.

క. కొలవేళులు నెలఁదూఁడులుఁ
దలిరులు నీహారవారిఁ దడిపి నయమునన్
గులిరుగొన మేన నొత్తిరి
లలనలు పార్వతికి శీతలక్రియ నెలయన్.

—5 ఆ. 149 ప.

ఉ. నెలలు పొదవించి తీవలను
మేనులఁ గెం పొదవించి మోవులం
దలిరుల కోలి మొగ్గలకు
దంతరుచిన్ మెఱుఁగూన్చి నవ్వులన్
మలరుల కిచ్చి హాస్యరస
మన్నులు సెన్నమరంగఁ బెక్కునే
ఖలఁ దమతోడ నాడు
గెడకత్తియ కాఁగ యిసేసి రామనిన్.

—9 ఆ. 108 ప.

సీ. శృంగారరాజ్యలక్ష్మికి ముడిఁ గలపిన
గతి హంసతిలకంబుఁ గబరిఁ బూన్చి.

—9 ఆ. 13 ప.

చ. అనుపమరూపయౌవనము
హాగుణవైభవలీల నెవ్వారిం
గనుఁగొని మెచ్చుకున్న వర
కన్యక గల్గినదానిఁ జెప్పు నీ
పనిచినవాని వేలగొని
పైబడఁ జేసెద నీవు దన్నుఁ గ

ల్చిన నొరుc దాను గల్చి చను
చేడియ గల్గినc జూపు తెచ్చెదన్.
—4 ఆ. 43 ప.

ఇట్లు తమిళభాషారూపములు తెలుcగుపదములట్లే స్వతంత్రముగాc బ్రయోగింపc బడినవి. ఇcక నీతని కవిత యందలి ప్రాచీనకన్నడకవుల రచనాలక్షణము లేవో యించుక పరిశీలింతము. కృత్యవతరణిక యనునధ్యాయము నందు నన్నిచోడc డనుసరించిన కొన్ని కన్నడకవితాసంప్ర దాయములు వివరింపcబడినవి. మఱికొన్ని యిటc బ్రస్తావింపc బడుచున్నవి.

నన్నిచోడకవి తన కావ్యమును శ్రీకారముతోc బ్రారంభించి శ్రీకారముతోనే ముగించినాcడు. అతని కృత్యాది పద్యము 'శ్రీ వాణీంద్రామరేంద్రార్చితమకుటమణిశ్రేణి ధామాంఘ్రిపద్మాజీవోద్యత్కేసరుం' డిత్యాదిగా శ్రీకారముతోనే ప్రారంభ మగుచున్నది. అట్లే తుదిపద్యమును 'మంగళమహాశ్రీ' వృత్తముగా రచించి యాపద్యమును గూడ 'మంగళమహాశ్రీ' యనుపదముతో ముగించి యీతcడు గ్రంథాంతమునందును శ్రీకారమును నెక్కొలిపినాcడు. నన్నిచోడని గ్రంథాంతపద్య మిది చూడుcడు—

భూవినుతుc డార్యజనపూజి
తుcడు సద్గుణవిభూషితుcడు సర్వా
శావివరపూరితవిశాల
శరనిర్మలయశఃప్రసరశోభితుcడు సద్భా

దేవకుల శేఖరుఁడు దేవముని
ముఖ్యుఁడు సుధీజనవరేణ్యుఁడు ప్రియుం డై
యీ వసుధ శిష్టతతి కిష్ట
ఫలయుక్తముగ నిచ్చు దయ మంగళమహాశ్రీ.
—12 ఆ. 230 ప.

నన్నిచోడుఁడీ సంప్రదాయమును గన్నడకవులనుండి గ్రహించినట్లు తోఁచుచున్నది. పంపకవి తనగ్రంథమును 'భద్రం శుభం మంగళం' అనుపదములతో ముగించినాఁడు. చూడుఁడు,—

కరమొప్పిత్తుదె సమస్తభా
రతకథాసంబంధమం పాసిసల్
బరెయలేళ్కొ లొడర్చ్చుదె
వెంగమిద రత్నిష్టవప్పం నమి
త్తరమక్కుం ధృతి తుష్టి
పుష్టివిభవం సౌభాగ్య మిష్టాంగనా
సురతం కాంతియగుంతి
శాంతి విభవం భద్రం శుభం మంగళం.

కావ్యమునందలి యాశ్వాసాద్యంతపద్యములలోని విశేషణము లేకవిభక్తికము లగునట్లుగా రచించుట యొక విశిష్ట సాహిత్యసంప్రదాయము. ఇది ప్రాచీనకన్నడకావ్యములందుఁ గలదు. నన్నిచోడకవి కూడ వారి ననుసరించి యట్లే యేక విభక్తికము లగునట్లుగా నాశ్వాసాద్యంతపద్యములను రచించెను. దీనిమూలమునఁ గథానాయకునివలెనే కృతి

పతియుఁ గావ్యకథయందుఁ బాలుగొనుచున్నా రనుస్ఫూర్తి పాఠకులకు జనించును. ఇతనికిఁ దరువాత తిక్కన నిర్వచనోత్తరరామాయణమునందును, కేతన దశకుమారచరిత్రమునందును నీ సంప్రదాయము పాటింపఁబడినది. నన్నయభారతమునం దీ నియమము పాటింపఁబడ లేదు. అతని యాశ్వాసాద్యంతపద్యములు రాజరాజనరేంద్రుని సంబుద్ధ్యంతములుగా నున్నవి. కుమారసంభవమునం దీ సంప్రదాయ మెట్లు పాటింపఁబడెనో చూతము—

ప్రథమాశ్వాసాంతపద్యములలోని జంగమమల్లికార్జునస్తుతిపరము లగువిశేషణములు ద్వితీయావిభక్త్యంతములు. దక్షుఁడు రజతనగపతిఁ గని తదీయమాహాత్మ్యంబున కాశ్చర్యహృదయుం డగుచుఁ దద్గిరిపాలకానుజ్ఞాతుం డై పరమేశ్వరాస్థానంబున కరిగి—యనుటతోఁ బ్రథమాశ్వాసకథ నిలుపఁబడినది. అరిగి జంగమమల్లికార్జునుṁ (130ప), కమలభవకులతిలకుṁ (131ప), పరమోత్సాహుṁ (133ప), నిర్వాణయోగిṁ (2 ఆ. 1 ప), సతి నవ్వించుచు నవ్వుచున్న పరముṁ, సర్వేశుṁ, దక్షప్రజాపతి గాంచెṁ—అని ద్వితీయాశ్వాసపుఁగథతో సమన్వయము కల్పింపఁబడినది. ఇట్లే తక్కినయాశ్వాసములందును నాద్యంతపద్యము లేకవిభక్తికము లగునట్లుగా రచించి కథాభాగమునందలి క్రమమాశ్వాసవిభాగమువలన భంగము చెందకుండఁ జేయఁబడినది. ఇట్లాశ్వాసాద్యంతములందు మాత్రమే కాక కథామధ్యభాగమునందుఁ గూడఁ గొన్నిసందర్భములలోఁ గృతిపతికిఁ గృతినాయకునితో నభేదము పాటించి కథాభాగముతోఁ

కీర్చి నడపునట్టి కన్నడకవితాసంప్రదాయము కూడ నిందుఁ బాటింపఁబడినది.

గ్రంథాంతమున ఫలశ్రుతి రచించుటకు ముందు శివుని యష్టమూర్తులును దమతమశక్తులను శివభక్తులకు నిచ్చుచు గాక యని యీ క్రిందిపద్యమునఁ గవ్యాశంసనము నిర్వహింపఁబడినది. చూడుఁడు—

మానిని :—

ధీరత భూమి గభీరత వా
రిధి తేజము వహ్ని బలం బనిలం
బారయఁ బెంపు నభంబు
ప్రతాప మహర్పతి శాంతి నిధుండు మహో
దారత నయ్యజమానులుఁ
జేర్మి సదాశివు నెన్మిదిమూర్తులుఁ జె
ల్వారఁగ నిచ్చుచు నుండెడ
మర్థి నహర్నిశముం శివభక్తులకుం.

—12 ఆ. 223 ప.

ఇందుఁ గూడఁ గన్నడకవుల యనుకరణమే కానవచ్చుచున్నది. చూడుఁడు—

చలదొళ్ దుర్యోధనం నె
న్నియొ శినతనయం గండి నొళ్ భీమసేనం
బలదొళ్ మద్రేశ నత్యం
నతియొ శమరసింధూద్భవం చాపవిద్యా

బలదొళ్ కుంభోద్భవం
సాహసద మహిమయొ ళ్ఫల్గుణం ధర్మదొళ్ని
ర్మలచిత్తం ధర్మపుత్రం
మిగిలి వగఁళి నీభారతం లోకపూజ్యం
—పంప భారతము.

ఫలశ్రుతి చెప్పి కావ్యమును బరిసమాప్తి చేయు సంప్రదాయమును నన్నిచోడనితరువాత నితరకవులును బాటించుచుండిరి. కాని గ్రంథాంతమునందుఁ జేయఁబడునీ యాశంసనమును మాత్రము తరువాతివా రెవరును బాటించి నట్లు కానము.

భోగభూమియం దుండువారి కచ్చటి కల్పవృక్షముల వంటివృక్షములు గృహవస్త్రభోజనమండనదీపాదు లగు నభిమతవస్తువుల నిచ్చుచుండు ననుట జైనసంప్రదాయ సిద్ధమై జైనకావ్యములలో వర్ణింపఁబడుచుండును. ఈ సంప్ర దాయము పంపాదికన్నడకవుల జైనకావ్యములలో వర్ణింపఁ బడి యున్నది. అవి పదివిధములు—

మద్యతూర్యవిభూషాస్రగ్జ్యోతిర్దీపగృహాంగకాః
భోజనామత్రవస్త్రాంగా దశధా కల్పశాఖినః.

వానిలో భూషణాంగవృక్ష మిట్లు వర్ణింపఁబడినది.

తులాకోటికకేయూరరుచకాంగదవేష్టకాః
హారాః మకుటభేదాం శ్చ స్తువతే భూషణాంగకాః.

ఈ భూషణాంగవృక్షములే నన్నిచోడఁడు పేర్కొనిన మండనాంగానోకహములు. కన్నడభాషలోని జైనకావ్యము

లను జదివినవన్ని చోడఁడా సంప్రదాయమును తెలుఁగుకవితలో వెలయించినాఁడు. కుమారసంభవమున నీ మండనాంగానోకహ ములు పేర్కొనఁబడినపద్యము లివి చూడుఁడు—

సీ. సవిలాసగతిఁ గ్రాలుజంగమలతలతో
నడపాడునురగకన్యకల చెలువు
వెలుఁగొందుమణిపుత్త్రికలఁగెడ విహరించు
వరనిధానాధిదేవతల చెన్ను
సానుసంగతమేఘసౌదామనులఁ గూడి
పొలపాడుఖచరాంగనల బెడంగు
మందారచందననందనసంగతి
వెలసినవనదేవతలనయంబు

గీ. మనసు లురులుకొల్ప మండనాంగానోక
హములఁ బొంది చూచు నమరసిద్ధ
చారణాదివరకుమారాంగభూషణ
ద్యుతుల హిమనగేంద్ర మతిశయిల్లు.

—3 ఆ. 14 ప.

మ. వరకార్తస్వరవస్తునిర్మితము లై
వస్త్రాంగరాగస్రగా
భరణానోకహనందనాన్వితము లై
పానాశనాఢ్యంబు లై
స్మరకేళీనిరతాంగనాస్పదము లై
సంగీతరంగంబు లై

పురబాహ్యంబులఁ గృత్రిమాచలము
లొప్పం జూడ రమ్యంబులై.

—7 ఆ. 97 ప.

సీ. రసరసాయనసుధారసనిర్ఝరంబులై
క్రమ్మంగ నెలరాఁకల్పతరులఁ
బసనవేదులఁ బొంది హరికాంతశిఖిఁ గ్రాఁగి
కనకంబు లగునయస్కాంతశిలల
సురుచిరౌషధితృణజ్యోతిప్రభాళిల
మాయించి వెలిఁగెడుమణిగణముల
బహుల చింతామణిప్రాసాదవృతభూష
ణాంబరస్నానపానాంగరాగ
గీ. మాలికాంగలతానంతమందిరముల
ప్రాసఁబండులు సతులకా మరిగి యాడు
సిద్ధవిద్యాధరామరస్త్రీసమూహ
భాసితం బగుకైలాసపర్వతంబు.

—7 ఆ. 144 ప.

నన్నిచోడనికిఁ దరువాత నాంధ్రవాఙ్మయమున మఱి చ్చటను నీసంప్రదాయము పేర్కొనఁబడ లేదు. పాలకుఱికి సోమనాథుఁడు మొదలగుశైవకవులు రసవాదాదులం దాదరము కలవారే యయినను వారు కూడ నీజైనసంప్రదాయమును నన్నిచోడని ననుకరించియైన గ్రహించినవారు కారు. ఈప్రస్తావము నన్నిచోడుని కన్నడసంప్రదాయానుకరణమునకుఁ బ్రబలప్రమాణముగా నున్నది.

ఇట్లు సంప్రదాయానుకరణములే కాక యీతండు కన్నడకవుల గ్రంథములనుండి కొన్ని రచనానుకరణములను గూడఁ గావించి యున్నాఁడు. ముఖ్యముగా నీతని కుమారసంభవమున పంపరన్నకవుల రచనానుకరణములు విశేషముగాఁ గానవచ్చుచున్నవి. ఈతని కృత్యాదిపద్యములోని 'శ్రీవాణీంద్రామరేంద్రార్చితమకుటమణిశ్రేణిధామాంఘ్రిపద్మ శ్రీవిద్యోత్కరుం' డనునిత్యాదిగాఁ గల యెత్తుగడ రన్నకవి యజితపురాణములోని కృత్యాదిపద్యమునందలి యెత్తుగడ ననుసరించి యున్నది.

శ్రీమన్నమ్రామరేంద్రారుణమకుటమణి—అని యజిత పురాణములోని యెత్తుగడ.

రన్నకవి గదాయుద్ధములోని యీ క్రిందిపద్యమును జూడుఁడు—

కృతి నెగళ్ద గదాయుద్ధం
కృతి నీశ్వరచక్రవర్తి సాహసభీమం
కృతియం విరచిసి దనలం
కృతియం కవి రన్న నెం దొడే వర్ణిపుదో.

—1. 32.

దీని ననుసరించినదే నన్నిచోడని యీ క్రిందిపద్యము.

రవికులశేఖరుండు కవి
రాజశిఖామణి కావ్యకర్త స
త్కవి భువి నన్నిచోడఁ
డఁట కావ్యము దివ్యకథం గుమారసం

భవ మఁటె సత్కథాధిపతి
భవ్యుఁడు జంగమమల్లికార్జునుం
డవిచలితార్థయోగధరుఁ
డట్టె వినం గొనియాడఁ జాలదే ?
—1 ఆ. 57 ప.

రన్నకవి గదాయుద్ధములోని మఱికొన్ని యనుకర
ణము లివి చూడుఁడు—

౧. ......సరస్వతి వరవిత్తవోల్
కెలబరోదదె కేళదె కల్గళం తె గ
ర్వితరడసిర్పరర్ధ కృతిగేం
మతివంతరో పుణ్యవంతరో. 1–50

భాషాంగనఁ దక్క నేలిన
మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా
భంగిగ విస్తరించెదఁ
బ్రబంధము సద్రసబంధురంబుగాన్ .
1 ఆ. 48 ప.

౨. దొరెయటెద వస్తుపురుష
ర్వరికిసి బెలెమాడె...... 1–40
దొర మెఱిఁగి కోరవలదే......
3. జవనుండు కాటిదవోల్ ఆయితెత్తం కురుక్షేత్రదొళ్
రన్న. గదా.
జముఁడు కుడిచి క్రక్కినభంగిన్ , 11 ఆ. 194 ప.

పంపభారతమునుండి నన్నిచోడుఁడు గావించినయను
కరణము లివి చూడుఁడు—

౧. దీనానాథగ్గే వృద్ధ
ద్విజముని నికరక్కెండెడ ప్పోషిపినం 'కః
కేనార్థీ కో దరిద్రః' ఎనుతు
మనితుమం ధర్మజం సూఱె గొట్టం. 6–40.
కః కే నార్థీ కో దరిద్రః యని గోసనంబులు పుచ్చి
—11 ఆ. 59 ప.

౨. కేరళవిటీకటీసూ
త్రారుణమణి మలయయువతిదర్పణ నాంధ్రీ
నీరంధ్రబంధుర స్తన
హార నుదారం సరస్వతీమణిహారం. 1–54.

క. ఆంధ్రీ స్తనాపహాసులు
సంధృతమధుపాబ్జముకుళసదృశము లతినీ
రంధ్రములు గుచము లఖిలపు
రంధ్రీజనతిలక మచలరాజాత్మజకున్. 3–54.

3. సంగరదలోజళద పాళియం
నెరపిదం గండం పెఱం గండనే. —10–66.
జొన్నలు గొన్న ఋణంబు నీఁగెదన్.—11 ఆ. 42 ప.

మఱికొన్ని యనుకరణము లివి చూడుఁడు—
శ్రుతరమణీయనె కవితా
చతురనె చారిత్రమణివిభూషణ రత్నం
శ్రుతరమణీయనె కవితా
చతురనె చారిత్రరత్నజలధియ రత్నం.

ఈననియ తలఁచుఁ జాగియు
నీననియ తలంచు లోభి యెప్పుడు ననికిఁ
జానననియ తలఁచు పిరుఁడు
చాననియ తలంచుపంద సరి యె ట్లగునో?
కారకపూరకప స్తువి
చారకనిస్సార కర్కశోళియె సభ గో
ట్టోరంతె నాల్వ రిద్దవి
చారం బేళ్వంతె పేళ్ద కృతియుం గృతియే?

*　　　*　　　*

......నోటికోలఁదుల్
　　పురికొల్పఁగ నందులోన నొ
క్కొక్కఁడు సక్కనైనఁ
　　గృతియుం గృతి యందురె వాని మెత్తురే?
—1 ఆ. 35 ప.

*　　　*　　　*

సుఖసంకథావినోదంబులం బ్రవర్తించుచుండె.

(10–118)

ఇదియుఁ గన్నడకవితాసంప్రదాయమునుండి గ్రహింపఁ బడినదే. పెక్కు కన్నడశాసనములలో నిది కానవచ్చును. తెలుఁగు శాసనములలోఁ గూడ నిది కలదు.

*　　　*　　　*

చీకు లావుకం ద్రొక్కినయట్లు—ఇదే యంధలావుక న్యాయము. ఈ భావము కూడఁ గన్నడకవుల ననుసరించినదే. చూడుఁడు—

కురుడం లావుగెయం మెట్టి దంతె.

—శివశంకరోగ్గని.

యుద్ధప్రారంభమున కనుజ్ఞ యిచ్చుచు సైన్యములకు చే వీచుటయు, యుద్ధవిరామమును ప్రకటించుచు 'కైవిశ' టయుఁ గన్నడకవుల గ్రంథములనుండి గ్రహించినదే. కన్నడములో నీపదము 'కైవీసు' అనురూపముతోఁ గానవచ్చును. (చూ. పంప. రామా. కైకీసు)

ఈక్రింది పోలికలను గూడ గమనింపుఁడు—

జీయెనె బల్లవర్ నెఱయె
సత్కృతివేళదెపేళ్ ఘుణాక్షరం
ప్రాయదె శబ్దమొం దెరడు
మత్తెవిచారిసి నోడె కాకతా
ళీయదె వాక్యమొం దెరడు
కూడె నిఘర్షణ దంధలావుక
న్యాయడె భావ మొం దెరడు
వేసెనె పేళ్దర దిద్దు చొప్పమే.

—చంద్రప్రభపురాణము. 1 ఆ. 48 ప.

అక్కజమై మహార్థనివహంబు
సదుక్తులు మెచ్చఁ జూచినన్
గ్రుక్కిదమైనసత్కృతి యగు
ర్వాగుఁ గాకిలఁ జీకు లావుకం
ద్రొక్కినయట్లు నోటికొలఁదుల్
పురికొల్పఁగ నంమలోన నొ

కొక్కఁడు సక్కనైనఁ
కృతియుం కృతి యందురె వాని మెత్తురే?
—1 ఆ. 38 ప.

*　　*　　*

కిళి ఋజ్వాగతదింద
మధురఋజు వింధం కోకిలం సాచి యిం
కలహంసీకలభం రథాంగ
మిథునం ద్వ్యర్ధాక్షియిం బర్హామం
డలి వార్ష్యాగతదిం దదేం
పడెదవో పంచాండకవ్యక్తి క
ణ్ణొళె కందర్పన బాణ
పంచకదవోల్ చిత్తక్కలిక్షోభమం.
—మల్లినాథపురాణము.

వ. అంతం దనుసంతాపంబు వాప నోపక పరమేశ్వరురూపు చిత్రించి చూచిన నైన నూఱట యగునో యని చిత్రసాధనంబులు గొని పలక ఘట్టించి మెఱుంగిడి త్రివటించి తిట్టంబు గోలఁదికిం దెచ్చి ఋజ్వాగతంబున రేఖ నూల్కొలిపి పత్రకబిందుకనిమ్నోన్నతాపాంగమానోన్మానంబు లలవఱచి సలక్షణంబుగాఁ జిత్రించి వన్నెవ గొలిపి కండెఱ దెఱచిన.
—5 ఆ. 118 ప.

*　　*　　*

గండన నోర్ప ఘూర్వశిగె
గంగెగె గోపిగె గొట్టరెం దొడా

పెండిర రూపుమం పొగఁబ
మంభవమం పెసర్గొళ్వుదే మసం
గొంక శేనంగనం రతియెనల్
చమరెత్తనె దాకె గెందు క
ర్గొండవిలాసదిం నగువ
దల్లియ వారవిలాసినీజనం.

—మల్లినాథపురాణము.

సీ. తా నింతి యై యుండఁగా నోరు నర్థించి
హరి వేఁడె లక్ష్మిమాహాత్మ్య మెంత?
తా నారి యై యుండఁగా నజుం డాత్మజఁ
గవసె భారతినేర్పుకలిమి యెంత?
తాఁ బత్ని యై యుండఁగాఁ బరాంగన వజ్రి
కామించె శచిసుభగత్వ మెంత?
తాఁ గాంత యై యుండఁగాఁ గాముఁ డీల్గె ముక్
రతిశుభలక్షణోన్నతి య దెంత?
గీ. తమ్ము వంచించి మును లుగ్రతపము చేసి
రప్సరస్స్త్రీల పోయగ మనఁగ నెంత
యంచు నెమ్మోయిఁ ద్రిజగంబులందు నొసలఁ
గామినుల మెచ్చ రప్సరాంగనలు పేర్మి.

—7 ఆ. 122 ప.

ఇవి కాక కన్నడసాహిత్యసంపర్కమువలన నీతని కవితలోఁ బ్రయోగింపఁబడినపదములును, బదబంధములును బెక్కులు గలవు. అవి యెల్ల నీతని కన్నడసాహిత్యపరిచయము నిరూపించును.

# సంవాదిరచనలు

తే ఏవ పదవిన్యాసాస్త ఏవార్థవిభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్.

అవే పదముకూర్పులు. అవే యర్థములు. అట్లయ్యుఁ గవీశ్వరుని కూర్పునేర్పువలనఁ గావ్యము నూతనత్వమును బొందుచుండును. ఈ శ్లోకార్థము యథార్థ మనుట కెట్టి విప్రతిపత్తియు నుండఁ బోదు. నన్నిచోడుఁడు తనకుఁ బూర్వ ముండిన సంస్కృతకవులనుండియుఁ గన్నడకవులనుండియు భావములను, పదబంధములను గ్రహించినను దనకూర్పునేర్పున వానికొక సహజరామణీయకమును సమకూర్చినాఁడు. ప్రాచీనాంధ్రకవులలో నెవ్వరు గాని నన్నిచోడని బ్రశంసించి యుండ లేదు. మడికి సింగన, పెదపాటి జగన్నాథకవి, ప్రబంధమణిభూషణకారుఁడు నను వారు మాత్రము తమపద్యసంచయములలోఁ గుమారసంభవమునందలి పద్యముల గ్రహించిరి. అథర్వణుఁ డీతని కుమారసంభవ కలావిలాసములఁ దన ఛందోగ్రంథమునం దుదాహరించెను. పెద్దన లక్షణసారసంగ్రహము, ముద్దరాజు రామన కవిసంజీవని, గణపవరపు వేంకటకవి లక్షణశిరోమణి యనులక్షణగ్రంథములలో నీతనిపద్యములు కొన్ని యుద్ధరింపఁ బడినవి. ఈతనిఁ బేరుతో నెవ్వరు స్మరింపక పోయినను నీతని గ్రంథములు మాత్రము లక్షణగ్రంథకర్తలవఱ కైనను వెనుకలో నున్నట్లు మనకుఁ దెలియవచ్చుచున్నది. ఇట్లు

లక్షణగ్రంథకారు లుదాహరించుట మాత్రమే కాక ప్రాచీనాంధ్రకవులలోఁ గొందఱు నన్నిచోడని కుమారసంభవమును జూచి యుండి రనియు, దానిలోని పద్యముల ననుకరించి పద్యములను రచించి యుండి రనియు వారిరచనలనుబట్టి తెలియుచున్నది. అట్లీతని రచనము ననుకరించినవారిలో పాలకుఱికి సోమనాథుఁడు, తిక్కన సోమయాజి, కేతన, ఎఱ్ఱాప్రెగ్గడ, నాచన సోమనాథుఁడు, కొఱవి గోపరాజు, శ్రీ కృష్ణదేవరాయలు, తెనాలి రామకృష్ణకవి, సంకుసాల నృసింహకవి, పింగళి సూరన, నూతనకవి సూరన, ఎఱ్ఱన, ప్రెగ్గడపల్లి పోతయ్య, వెంకటకవి, రఘునాథనాయకుఁడు ననువారు స్పష్టముగా భావానువాదము చేసినట్లు వారివారి రచనలను బట్టి తెలియుచున్నది అట్టి రచనాసంవాదము గలపట్టులు 'సంవాది రచన' లనుపేర నీక్రిందఁ గాలక్రమానుసారముగాఁ గూర్పఁబడినవి. చూడుఁడు:

సీ. నేలయు నింగియుఁ దాలముల్ వాయింప
నెండమావులఁ బట్టి బండతలయు
ప్రోఁకాలు ముడివెట్ట రోఁకటఁ జిగుళులు
గోయఁ జట్రాతిపైఁ గ్రుంగ నిసుపు
లేక చిత్రము వ్రాయ నాకాశమున దాఁప
రము లిడ మంచు గుంచములఁ గొలువ
నేనుంగుపురు షోమ రానారఁ గొన గాలి
గం టిడ నినుమునఁ గట్టు దాల్ప
గీ. నీరినడుము ద్రెంప నేలఁ దెన్నుండి చే
వెల్పఁ గలియుఁ ద్రచ్చి వెన్న గొనఁగఁ

గడవ నేర్పు గలిగి కందువు మాసెఁ డై
కత్తిగొంటు లయినయత్తగంతు. —8 ఆ. 135 ప.

పాలకుఱికి సోమనాథుఁడు తన పండితారాధ్యచరిత్రమునందలి పురాతనప్రకరణమున దీని ని ట్లనుకరించినాఁడు.

ద్విపద—

నెట్టన నేలకు నింగికి సూత్ర
పట్టె మోఁకాళ్లను బట్టతలలును
ముడిఁ బెట్టఁ దననీడ గడవంగఁ బాఱ
వడి నెండమావుల కడకాళ్లు గట్టఁ
బాయక రెండుగాఁ బాటెడునీరు
ద్రేయఁ బుల్ జున్న గోరో యని యమ్మ
రానార యొలువఁ జత్రాతిపైఁ గ్రుంక
నేనుంగుపురు డోమ నిసుకత్రా డ్వేన
లలిగొన దిశలు తాళముల్గు వాయింపఁ
జెలఁగుచు ఱోఁకటఁ జిగుళులు గోయఁ
గలి వెన్నఁ బుచ్చఁ గొండలు దొంతిఁ బేర్ప
నిల మంచుఁ గుంచానఁ గొలువ రే వగలు
సేయ నాకసమునఁ జిత్రరూపములు
వ్రాయ వాయువుఁ బట్టి వడగండ్ల గుండ్లు
కట్టి వెన్నెల గుంపుగాఁ జేయఁ బుచ్చి
పుట్టినప్పూడ నేర్చు బుద్ధులప్రోక
కోలాసకత్తియ గొరబల ప్రోడ
యాలంజెతల్లి దా నల్లునిఁ జూచి

—పురాతనప్రకరణము. పుట 121.

తిక్కనసోమయాజి కూడ భారతము విరాటపర్వము
నందు దీని నిట్లనుకరించినాఁడు.

సీ. నేలయు నింగియుఁ దాళముల్ గాఁ జేసి
యేపున రేఁగి వాయించి యాడఁ
గులపర్వతంబులు గూర్చి యొండొంటితోఁ
దాఁకంగ వీఁకమై దన్ని యాడ
నేడుసాగరములు నిక్కడక్కడఁ బెట్టి
పలుచనిరొంపి మై నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి
పిసికి పిండలి చేసి పిడుచ గొనఁగ
గీ. మిగిలి బ్రహ్మాండభాండంబు పగుల వ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకాలానలమున
గంపరించినరూపంబుకరణి భీముఁ
డతిభయంకరాకారత నతిశయిల్లె.

—విరా. 2 ఆ. 134 ప.

తంజావూరి రఘునాథనాయకుఁడు కూడఁ దన రామా
యణమునందు దీని నిట్లనుకరించినాఁడు. చూడుఁడు :

ఉ. నేలకు మింటికిం దొడరి
నేర్పున సూత్రము వన్న మంచుఁ గుం
చాలను గొల్వఁ ద్రాళ్లిసుక
చాలునఁ బేనఁగఁ జుక్క లెన్నఁ జ
త్రాలను నార లొల్చి నెగడన్
పడగండ్లను గుళ్లు గట్టఁగాఁ

బోలిన మీాకు నిచ్చుటికి సం
యమిఁ దెచ్చుట యేమి సోద్యమే?
రఘు. రామా. 2 ఆ.

*　　　　*　　　　*

నన్నిచోడని యీా వేసవివర్ణనపద్యమును తిక్కన విజయసేనమునందలి పద్యముతోఁ బోల్చి చూడుఁడు :

క. తలఁచిన డెందము గందును
బలికిన నో రెల్లఁ బొక్కుఁ బ్రభ సూచిన కె
ప్పలు గమరు ననఁగఁ బటుతర
విలయానలభాతి నెండ వేసవి గాంచెన్.
—6 ఆ. 135 ప.

తిక్కన పద్య మిది :

ఎత్తుగీతి :
తలఁపఁ దడవ మనము దరికొనుఁ జూచిన
కెప్ప లెల్లఁ గమరి యొప్పు తఱుగు
నరులఁ జేరికొన్న నాలుక పొక్కని
దాఘకాల తపనతాప మడరె. —విజయసేనము.

*　　　　*　　　　*

సీ. బాహుబలోన్నతి పాటించి రాక్షసా
ధీశు పట్టినచెఱ లెల్ల విడిచి
మణ్ముఖు భుజశిలా స్తంభాగ్రమున జయ
శ్రీఁ బొందె సాలభంజికవిధమున.
—12 ఆ. 191 ప.

ఈభావము ననుకరించి తిక్కన తన నిర్వచనోత్తర రామాయణమునందలి కృత్యాదిశ్లోకము నిట్లు రచించినాఁడు.

శ్లో. శ్రీ రాస్తాం మనుమక్షితీశ్వరభుజా స్తంభే జగన్మండల
ప్రారంభస్థిరభారభాజి దధతీ శ్రీ సాలభంజిశ్రియం.

—1 ఆ. 1 ప.

* * *

కపటబ్రహ్మచారిరూపమునఁ బార్వతిని బరీక్షింప వచ్చినపరమేశ్వరుఁడు పార్వతితో ని ట్లనును—

సీ. మగ లాఁడువారికి మరిగి ప్రముచ్చిలి బంది
వట్టి కన్నంబులు వెట్టి తెరువు
ద్రెక్కొని చని పరదేశంబు లుఱుగక
ద్రిమ్మరి వ్రేళ్లును రొమ్ముఁ బోయి
యాచకులై వేఁడి నీచుల సేవించి
కల మెక్కి చని యాలఁ గయ్య మాడి
యేనుఁగునకుఁ బాడి యిల్లెన్ని యేనియుఁ
గష్టముల్ వడి రాక గలదు గాక
గీ. మగలఁ గోరి తొల్లి మగువలు తపములు
సేసి నవసి రనిన చెట్ట లెందుఁ
గలవె దీని కచ్చు నిలిపితి నీవ నీ
వలన సతులఁ బురులు వొలిసెఁ గాక.

—7 ఆ. 36 ప.

కేతన తన దశకుమారచరిత్రమునందు దీని ని ట్లనుకరించినాఁడు. చూడుఁడు—

సీ. కన్నంబు వెట్టి తెక్కలి గొని యంకంబుఁ
బలువురతో నాడి బందివెట్టి
జూదంబునకుఁ జొచ్చి చూఱకాంద్రం గూడి
పరదేశముల కేఁగి తెరువు లడిచి
యాలి గో యిడి తల్లి నాఁగి బిడ్డల నమ్మి
కన్నతండ్రులతోడఁ గయ్య మాడి
రాజులఁ గొల్చి క్రూరంపుఁజెయ్వులు సేసి
లజ్జాభిమానంబు లుజ్జగించి
తే. ధనము లార్జించి మిండాటమునకుఁ జొచ్చి
యిచ్చఁ గ్రీడింతు రింతవ ట్టెఱిఁగి యెఱిఁగి
యజినరత్నంబు మీా కిచ్చినాతఁ డెవ్వఁ
డతని నెఱిఁగింపు మని నన్ను నడుగఁ దగునె?

—6 ఆ. 94 ప.

* * *

కుమారసంభవములోని యీ క్రిందిపద్యము చూడుఁడు—

ఉ. భూచరు లంబరంబుననె పోవుట మే లన నంబరేచరుల్
భూచరవృత్తి మే లనఁగ భూచరఖేచరు లాజలప్రకే
ళీచరణంబు మే లన జలేచరు లంబరమధ్యయానథా
త్రీచరణంబు మే లనఁగఁ దీవ్రనిదాఘము పర్వె నుర్వరన్.

—6 ఆ.

ప్రబంధమణిభూషణ మనుసంకలనగ్రంథములో నీ పద్య ముదాహరింపఁ బడినది. ఇది షష్ఠాశ్వాసమునందలి

వేసవివర్ణనములోనిది కావచ్చును. లింగాప్రాంకిప్రతిలో ఈ పద్యము లేదు.

కేతన తన కాదంబరియందు దీని ని ట్లనుకరించినాఁడు-

సీ. కడు వేఁడి పెల్లెండ పుడమి పెల్బొనఁ బొద్దు
లాకాశగతియ మే లని తలంప
వాత్యాభిహతి లగ్గ వాడె నియచ్చుట
లవని పైఁ జనుట మే లని తలంప
వడవడగా నీరు లుడికిన జలచరుల్
వనచరవృత్తి మే లని తలంప
వనములఁ గార్చిచ్చు దనరిన వనచరు
లంబుసంచరణ మే లని తలంప
గీ. వాఁడియెండ గాసె వడి గొనె సుడిగాడ్పు
చెలఁగె వడయగాలి నెగసి వీచె
దావదహన మడరె జీవుల కధికసం
తాపకారి యగునిదాఘువేళ.

— కేతన కాదంబరి.

* * *

కుమారసంభవములోని యీ క్రిందిపద్యము ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహాపురాణమునం దనుకరింపఁబడినది—

ఉ. శ్వేతద్వీపము చంద్రబింబము
మహాక్షీరాబ్ధి దత్ జ్యోత్స్న ద
ద్భాతిం గృష్ణుఁడు దన్మృగాం
కము లసత్పద్మాలయాక్షిద్యుతుల్

ప్రీతిం జారుచకోరదంపతులు
నాఁ బృక్షీవ్యధరుం బోలి వి
ఖ్యాతిం బొల్పగు శారదాధి
నుతరాకారాత్రు లత్యున్నతిన్.

—6 ఆ. 117 ప.

ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణములోని పయిదాని యనుకరణ మిది చూడుఁడు—

వెన్నెలవెల్లి పాల్కడలి
ప్రేఁకదనంబునఁ బేర్చి దిక్కులన్
మిన్నును ముంచి యందు రజ
నీకరబింబము కుండలీభవ
త్పన్నగతల్పకల్పనముభంగి
దనర్చెఁ దదంతరంబునన్
వెన్నునిభంగిఁ జూడ్కులకు
వేడ్క యొనర్చెఁ గలంక మత్తఱిన్.

—3 ఆ.

* * *

నాచన సోమనాథుఁ డనుకరించిన కుమారసంభవము లోని యీ క్రిందిపద్యముఁ గాంచుఁడు—

సీ. పఱచుచుఁదలలును బఱుపులు దబ్బఱ
మిడిసినగ్రుడ్డులు బడకిచెవులుఁ
గందుఁబండ్లుఁ బఱికిగడ్డంబులును నఱ
పొఱుపు లనంటుమూపులును గుఱుచ

కోఁ జేతులు నిఱికిగోళ్లును నొక్కుఁబ్ర
క్కలు బొక్కిఱొమ్ములు కఱకుఁ గ్రొండి
కడుపులు మురివి వ్రాఁకాళులుఁ బార లెత్తి
నెఱపినయడుగులుఁ గుఱుపుగట్టి
గీ. పరళు లెత్తి యున్న పరుసంపుటొడళులు
నడవిలోనఁ గలయ నొడఁచు రేఁగి
గదరువలచుకంపు గాళిమచ్ఛాయయుఁ
గలుగునెఱుకుముసిఁడి గనిరి సతులు.

—6 ఆ. 37 ప.

ఉత్తరహరివంశములోని నాచన సోమనాథుని పద్య మిది చూడుఁడు—

సీ. వికృతాననంబులు విరళదంతంబులు
నిడు పైనపొడలు నిక్కుమెడలు
ముడివడ్డబొమలును మూమ్మూలముక్కులుఁ
బల్ల వెంట్రుకలును బడికితలలు
బొక్కఱొమ్ములు లోఁతుఁబొట్టలు మిడిగ్రుడ్లు
గూనివీఁపులు నిడుఁగ్రొంకివ్రేళ్లు
బూరకాళులు నీచఁబోయినచేతులుఁ
గోలమూఁపులు గుది గొన్నతొడలు
గీ. నతిభయంకరగతి సూప నట్టహాస
కహకహారావములతోడఁ గాన నయ్యె
దావపావకఘనశిఖాదగ్ధతాల
సాలసంకాశ మగుపిశాచద్వయంబు.—2 ఆ. 122 ప.

* * *

కుమారసంభవమునందలి యీ క్రిందిపద్యమును జక్కన తన విక్రమార్కచరిత్రమునం దనుకరించినాఁడు.

సీ. దుగ్ధాంబునిధి నిట్టఁ దోఁచెనో యని శేషుఁ
బాన్పుగా హరి నీటఁ బవ్వళింప
నొదవి సుధారస ముప్పొంగెనో యని
దేవతల్ తనివోవఁ ద్రావఁ దలఁపఁ
దొలఁకారు మిన్నేఱు వెలి విరిసెనో యని
లీల సురాంగన లోలలాడఁ
బాదరసం బుర్విఁ బరఁగెనో యని సిద్ధ
నికరంబు కలశముల్ నించికొనఁగఁ

గీ. బాండురాంగుండు విశ్వరూపంబు దాల్చి
యెలసెనో యని సద్భక్తు లెలమిఁ గొలుప
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమలమై యలరి కాసె.

—8 ఆ. 118 ప.

జక్కన పద్య మిది.—

సీ. గంగాప్రవాహంబు గాఁబోలు నని వశి
ష్ఠాదు లనుష్ఠాన మాచరింప
నమృతంబు వెల్లువ యని నిలింపాదులు
మునుకొని దోసిళ్ల ముంచి క్రోల
దుగ్ధాంబునిధి యని తోయజాక్షుఁడు శేష
పర్యంక మిడుకొని పవ్వళింపఁ

బరమేశు విశ్వరూపం బని బ్రహ్మాదు
లమర దండప్రణామములు సేయఁ

గీ. దలఁప భూనభోంతరములకోలఁది తెలిసి
బెరసి యెన్మిదిదిక్కులఁ బొరలి పొరలి
దట్టముగ నంతకంతకుఁ దనరి తనరి
యిట్టలంబుగ వెన్నెల నిట్ట వొడిచె.

నన్నిచోడని పయిపద్యమును వెంకటకవి కూడఁ దన
కృష్ణవిలాస మను గ్రంథమునం దిట్లనుకరించినాఁడు—

సీ. ఆకాశనది యని యనిమిషాంగన లెల్ల
వేడుకతో జలక్రీడ సలుపఁ
బాలమున్నీ రని పంకజనాభుండు
ఫణిశయ్య గావించి పవ్వళింపఁ
బాదరసం బని మోదించి సిద్ధులు
మించి ఘటంబుల నించుకొనఁగ
నమృతంపుసో నని యఖిలామరశ్రేణి
చెలఁగి పానంబులు సేయుచుండ

గీ. వెల్లి విరియుచు నుబ్బుచు విశదకాంతిఁ
బొదలుచును దివ్య మగుచును భూరిమహిమ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చవెన్నెల విమల మై పెచ్చు పెరిఁగె.

—కృష్ణవిలాసము.

నన్నెచోడుని పయిపద్యమునందలి యయిదుభావ
ములలో జక్కన యొకనాలుగుభావములను, వెంకటకవి

వేఱొక నాలుగుభావములను గ్రహించుట చోద్యము. మఱియు నాపాదములు కూడ మార్పు లేక యున్నవి.

*　　　*　　　*

నన్నిచోడుని యీ క్రిందిపద్యమును రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణములోని పద్యముతోఁ బోల్చి చూడుఁడు—

మ. హరినేత్రాంబుజ మంఘ్రిపీఠ
　　మజుమస్త్రాబ్జంబు సత్కేళిపం
కరుహం బాసితరోచి
　　జూటలతికాకల్పంబు విశ్వంభరా
ధరవం శేశులు కర్ణకుండలము
　　లుద్యద్దేవతానీకముల్
పరివారంబుగ నున్నశంభుఁ
　　దనకుం బ్రాణేశుఁ గాఁ బ్రీతితోన్.
—7 ఆ. 17 ప.

చ. కమలజు తోరపుంబునుక
　　కంచము పాదసరోరుహార్చనా
కమలము వారిజోదరుని
　　కన్ను కరంబున కాదిభోగిభో
గము రవణంబు చంద్రుఁడు
　　శిఖాకుసుమం బఁటె యెవ్వరీ డుమా
రమణునకుం గుమారగిరి
　　రాజనివాసున కన్యదైవముల్.
—త్రిపురాంతకోదాహరణము

*　　　*　　　*

కుమారసంభవమునందలి యీ క్రిందిపద్యమును కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశికలోని పద్యముతోను. వేమన పద్యముతోను బోల్చి చూడుఁడు—

గీ. చెనసి గుణ మైన దోషంబు సేయ నేర్చుఁ
గుకవి కృతులందు దోషంబు గుణము సేయ
నేరఁ; డది యట్ల; దొంతులు సేరి నాయి
దోర్చ నేర్చుఁ గా కది యేమి సేర్చు నేర్చు.

—1 ఆ. 29 ప.

కొఱవి గోపరాజు పద్య మిది :

ఉ. భావరసానుకూలమృదుపాక
పదార్థసమృద్ధి లోకసం
భావన నొప్పు కావ్యముల మ
ర్మము గానఁగ లేక దుర్మతుల్
కా వనఁ గాని యెట్టికడఁ గ
ట్టడిఁ జెప్పఁగ నేర, రెల్లెడం
ద్రోవన కాక కుక్కలకు
దొంతులు వేర్వఁగ నేర్పు గల్గునే?

—1 ఆ. 16 ప.

వేమన పద్యము :

గీ. ఆదిమకవులవలె నల్పుండు తా నెట్లి
చెప్ప లేఁడు కాని తప్పుపట్టుఁ
ద్రోయ నేర్చుకుక్క దొంతులు వెట్టునా?
విశ్వదాభిరామ వినుర వేమ!

కుమారసంభవమునందలి యీక్రిందిపద్యము నాముక్త మాల్యదలోని శ్రీకృష్ణదేవరాయల పద్యముతోఁ బోల్చి చూడుఁడు—

శా. ఆక్రోశార్క రనురాజు మ్రోల
నిజరావానంతగేయాభ్రనా
దైకాతోద్యముఁ గూర్చి
మ్రోయ సురగోపాంభోధరాగత్విషా
నీకోద్యద్ధరిదశ్మకస్థల
లసన్నృత్యోర్వురరంగస్థలిం
గేకీపాత్రము లాడె
భావముగ నుత్క్రప్రాగ్రపింఛంబులై.

ఆముక్తమాల్యదయందలి పద్య మిది—

మ. అల పర్జన్యుఁడు కేకిపాత్రముల
గుం పాడించుచో మేఘము౦
డలపుర్ మద్దెల గ్రుంగ
లేవను మరున్మార్ద౦గికుం డర్థి నె
త్త లలిన్ నేలకు వ్రాలుచు
న్నెగయుచుం దారాడున త్తెల్ల జ
ల్లులుఁ గెంగుచ్చులు నయ్యె
ధారలును దల్లోలేంద్రగోపంబులున్.

* * *

పింగళిసూరన తన ప్రభావతీప్రద్యుమ్నములో ననుక రించిన యీ క్రిందిపద్యముఁ జూడుఁడు—

చ. కలకల నవ్వునట్లు
దమకంబునఁ గన్గవ విచ్చి భ్రూలతల్
వాలయఁగఁ జూచునట్లు
వనితోవఁగఁ దెల్పియుఁ గొంకింపఁ జే
తులు పచరించున ట్లదటుతో
రతికేలికి నప్పలించున
ట్లెలమి నటించుచుండె
సతి కీశ్వరుఁడా పెమరం బ్రసన్నమై.

—4 ఆ. 118 ప.

ప్రభావతీప్రద్యుమ్నములోనిది యీ క్రిందిపద్యము:

చ. కలకల నవ్వినట్లు
తెలికన్నుల నిక్కమ చూచునట్ల తోఁ
బలుకఁ గడంగినట్ల
పలుభావగభీరత లబ్బినట్ల పెం
పొలయఁ దనర్చి జీవకళ
యుట్టిపడన్ శివ వ్రాసి యిచ్చె నా
చెలువున కాభిముఖ్యము
భజింపఁ దలంకెను దాను బోటియున్.

—1 ఆ.

* * *

నన్నిచోడుని యీ క్రిందిపద్యమును తెనాలి రామలింగకవి తన కందర్పకేతువిలాసములో ననుకరించినాఁడు. ఈ పద్యములోని యుపమానోపమేయవిపర్యయమును, విశేష్య

విశేషణలింగభేదమును దోషములుగా నెంచి వానిఁ దొలఁగింపఁ దలఁచి కాఁబోలు తెనాలి రామలింగకవి దానిని మార్చి కూర్చుకొనినాఁడు.

మ. అలిధమ్మిల్ల మృణాళహస్తఁ
గమనీయావర్తనాభిక్ మహో
త్పలగంధిం గలహంసయాన
విలసద్బంధూకరక్తోష్ఠ ను
త్పలనేత్రిం గమలాస్య
నంగజరసాంభఃపూరఁ దత్పార్వతీ
జలజావాసముఁ జొచ్చి
యాడక మనోజాతానలం బాఱునే.

—6 ఆ. 171 ప.

రామలింగకవి పద్య మిది చూడుఁడు :

మ. లలితాస్యాంబురుహాంబు
నీలకచరోలంబంబు నేత్రాసితో
త్పల ముచ్చైఃస్తనకోక
మోష్ఠవిలసద్బంధూక ముద్యత్కటీ
పులినం బుద్గతచిత్తజాతరస
వాఃపూరంబు ప్రాణేశ్వరీ
జలజావాసము సొచ్చి
యాడక మనోజాతానలం బాఱునే ?

—కందర్పకేతువిలాసము.

నన్నెచోడుని యీ క్రింది పద్యమును పాండురంగ మాహాత్మ్యములోని తెనాలి రామలింగకవి పద్యముతోఁ బోల్చి చూడుఁడు—

సీ. నగరాజతనయ పన్నగరాజధరు వ్రేల
నిలువుడు మదనుఁ డేటలపై నిలిచె
నెలనాఁగ గనుబొమల్ వొలయింప నెత్తుఁడుఁ
జిత్తజుఁ డించుకి ల్లెత్తుకొనియె
హరిణాక్షి లసదపాంగాలోకనము నూలు
కొలుపుడు నమ్మరిగొలిపె మరుఁడు
పతి నెఱ నూరఁ బార్వతి నూచు నుఱుచూడ్కు
లాడుడు నలరమ్ము లాడె నీశుఁ
గీ. గంతుఁ డేయఁ దొడఁగె నంత నీశ్వరునకు
నచలవృత్తిఁ జలుపు నాత్మవిమల
యోగభావ మెడపి రాగోత్కటంబున
గౌరియందు నిలిపెఁ గన్ను మనము.
—౬ ఆ. 36 ప.

రామలింగకవి పద్య మిది :

మ. బొమ లెక్కించిన విల్లు
వంచు నునుఁజూపుల్ చంచలాచంచల
క్రమరేఖ న్నిగిడింప
శాతవిశిఖౌఘంబుల్ మెయి న్నించు నె
య్యమునన్ బల్కఁగ నల్క
మీఁటి చటులజ్యాఘోషముం జేయు న

యొ్యమ్రపా పొంది రతీ
శ్వరుండు హారి బి ట్టోడింప నుట్లాడుచున్.
—1 ఆ.

* * *

ఎఱ్ఱనకవి తన మల్హాణచరిత్రలోఁ గుమారసంభవము నందలి యీ క్రిందిపద్యము ననుకరించినాఁడు. చూడుఁడు—

సీ. రాజకదంబవిరాజితం బగుఁ గాని
కంటకపార్థివోత్కరము గాదు
పద్మాలయాతిశోభన మనం జనుఁ గాని
కుముదోదయాదిసంకులము గాదు
శుద్ధసువర్ణప్రసిద్ధాత్మ మగుఁ గాని
వరచిత్రవర్ణసంకరము గాదు
పరమోషధిప్రభాభాసురం బగుఁ గాని
దుస్తృణద్యోతివిద్యుతము గాదు

గీ. వనకులంబునుఁ దత్సరోవరకులంబుఁ
జెలువ మగుహార్మ్యకులము సుక్షేత్రకులముఁ
బొలయ నిన్నింటిలోఁ దాను బోలి యున్న
ప్రస్తుతం బగు నోషధీప్రసస్థపురము.
—7 ఆ. 127 ప.

ఎఱ్ఱనకవి మల్హాణచరిత్రమునందలి పద్య మిది :

సీ. కువలయకమలాభినవమనోజ్ఞం బయ్యుఁ
బంకజీవనపరిప్లవము గాక

ఘనసారపున్నాగకమనీయ మయ్యును
గీతవదుష్కాళితసంయుతము గాక
సాధుదానప్రౌఢిమాధపం బయ్యును
విశ్రుతఖరసమన్వితము గాక
రాజితోత్తమజాతిరత్నాంకితం బయ్యు
శృంగారవిటవిమాషితము గాక

గీ. వరసరోవరచయమును వనచయంబు
నృపచయంబును దివ్యమంటపచయంబు
నెలమిఁ దనుఁ బోలు ననఁ బొగడ్తలు వహించె
భువనసారంబు గల్యాణపురవరంబు. —1 ఆ.

*       *       *

కుమారసంభవమునందలి యీ క్రిందిపద్యమును కవి శ్రీకవిబ్రహ్మ యనుకరించినాఁడు.

మ. పదబంధంబుల నగ్గలించి
బుధశబ్దభ్రాజి యై సద్గుణా
స్పద మై దుష్కవిహృత్స
రోజవనముల్ భంజింపుచున్ భూరిస
మ్మదలీలన్ విలసిల్లి
సత్కృతి జగన్మాన్యప్రభావంబునన్
మదనాగంబునుబోలెఁ
గ్రాల వలదా మా తెందు లే కున్నతిన్.
—1 ఆ. 40 ప.

కవిలోకబ్రహ్మ యనుకరణపద్య మిది :

మ. పదలాలిత్యము వర్ణ
శుద్ధియును శబ్దస్థైర్యముఁ మంగళా
స్పదభావంబును రాజయోగ్యతయు
దోషస్ఫూర్తిరాహిత్యముఁ
సదలంకారవిశేషముం గలిగి
విశ్వప్రాణసౌభాగ్యసం
పదమైఁ దేజియపోలి
క్రాల వలదా పద్యంబు హృద్యస్థితిన్.

*　　*　　*

ప్రెగ్గడపల్లి పోతయ్య తన గోదావరీశతకమున నన్నిచోడుని కుమారసంభవమునందలి యీ క్రిందిపద్యము ననుకరించినాఁడు :

మ. కర మొప్పుఁ బియదంగనా
తరలముక్తాహారమో శంభు న
త్యురుజూటాశ్రితసర్పకంచు
కమొ హేమోర్వీధరగ్లౌసుధా
కరకాంతంబొ హిమాచలో
పరిశరత్కందంబొ భూస్త్రీసితాం
బరమో వారిధి దృష్టఁ ద్రా
గెడుసుధాపానంబొ నాఁగా మునుల్.

—7 ఆ. 87 ప.

పోతయ్యగారి యనుకరణ పద్య మిది :

మ. స్థిరపుణ్యోదయమేదినీందు
వదనాసీమంతవీక్షిలస
ద్గురుముక్తాఫలసూత్రమో
సురుచిరక్రోడపురంధ్రీసమా
దరధమ్మిల్లలతాంతమాలి
కయొ భూతస్త్రీకుచశ్రీమనో
హారసంవ్యానమొ నాఁగ నీ
దగుప్రవాహం బొప్పు గోదావరీ!
—గోదావరీశతకము.

*                    *                    *

సూరనకవి యుదయనోదయమునఁ గుమారసంభవము నందలి కొన్ని పద్యముల యనుకరణములు కానవచ్చుచున్నవి. ఈ క్రింది యనుకరణములను జూడుఁడు :

చ. మొగడలు వజ్రముల్ విరు
లు ముత్తెము లిం పగునున్పుగెంపులేఁ
జిగురులు పద్మరాగములు
చిల్కలు వైరిజరాజి తుమ్మెదల్
నగరిపునీలజాలములు
నాఁ దనరారె వసంతవల్లభుం
డగువలరాజు పంచమణి
హార్మ్యములో యనఁ జూతభూజముల్.
—4 ఆ. 99 ప.

చ. అలితతి నీలముల్ ముదురు
టాకులు పచ్చలు లేఁజిగుళ్లు కెం
పులు దళరాజి వజ్రమయ
ముల్ కలికావళు లాఁడిముత్తియం
బులుగఁ బొసంగు చంగజుని బొక్కస
మెల్లను నాత్మలోన నిం
పులు పొదలించె రాజునకుఁ
జూచి బెడం గగుపొన్న లున్నతిన్.
—1 ఆ. 134 ప.

మఱొక యనుకరణ మిది చూడుఁడు :

చ. దళితసరోరుహాస్యలు సు
ధామయహర్మ్యము లెక్కి ప్రీతితోఁ
జెలు వగువల్లముత్యముల
సేసలు చల్లిరి పాండురాంగుపై
నలి నటిత్సితాంబుదగణంబు
ఘనోపలవృష్టి రాజతా
చలముపయి న్మొగిం గురియు
చాడ్పున సభ్రమచు లుల్లసిల్లఁగాన్.
—8 ఆ. 52 ప.

చ. సరభసలీలఁ గేళిసిత
సౌధము లొక్కట నిర్గమించి చ
ల్లిరి నరనాథుమీఁదఁ బురి
లేమలు లాజలు దోయిలించి చె

చ్చెర శరదంబువాహములు
చించి బయల్వెడుచంచలాలతల్
పరిమితవృష్టిబిందువులఁ
బర్వతరాజముఁ గప్పెనాకృతిన్.

—ఉదయ. 5 ఆ.

*　　　*　　　*

కుమారసంభవమునందలి క్రిందిపద్యముతోఁ గృష్ణ విలాసమునందలి పద్యమును బోల్చి చూడుఁడు :

సీ. కమియని లేని శృంగారాదిచేష్టలఁ
బచరించుచుండు నా భద్రు నొల్ల
మృదురేఖ ననురక్తిఁ బొదలించి రస మెల్ల
గాలించికొనునో పాంచాలు నొల్ల
ధన మెక్క నీగియ తగులు గా రతి బెట్టి
దము సేయు నట్టి దత్తకుని నొల్ల
మన సీక మందుల మాయల మరగించి
కారించునాకూచిమారు నొల్లఁ
గీ. గలిచి తాల్మి గల్గఁ గలిపించి బేటంబు
సలుపు నెదుర దన్నుఁ గలిచెనేనిఁ
దానుఁ గలిచెనేని దగ నిచ్చు నయువిదుం
డని మనోజ్ఞ నొక్కవనిత గలిచె. —8 ఆ. 145 ప.

కృష్ణవిలాసములోని పద్య మిది :

సీ. నిజరూపరేఖల నెలఁతల వలపించు
చాతురి గలభద్రజాతివిటులు

వలసినధనము లవ్వారిగా నొసఁగుచుఁ
దరుణులఁ గరఁగించుదత్తవిటులు
మణిమంత్రములచేత నణుమధ్యలఁ గరంచు
మగఁటిమి గలకూచిమారవిటులు
వలరాజుకళ లుండునెళవులు భేదించి
సతులఁ దేలించువాంచాలవిటులు
గీ. వరుస నందఱు దమజాతివారివారి
జాతవదనలఁ గూడి సంజాతమదన
కదనకేళీవిహారసంపదలఁ బొదలి
మెదలుదురు వీట నధికసమ్మదము లొదవ.
—కృష్ణవిలాసము.

* * *

కుమారసంభవమునందలి యీ క్రిందిపద్యమును దంజావూరి రఘునాథనాయకుఁడు తన వాల్మీకిచరిత్రము నం దనుకరించినాఁడు.

చ. పటికపుఁబోల ముల్ వెదురుఁ
బ్రాలొగిఁ బోయుచు గారుకొమ్ముగోఁ
కటఁ గొని దంచుచుం శబర
కామిని పెక్కులు రాగముల్ మదో
త్కటముగఁ బాడెఁ జుట్టిన
మృగంబులు సోమ మనుష్యరూపధూ
ర్జటి మునిముఖ్యలోకగురు
జంగమలింగము మల్లికార్జునన్.
—6 ఆ. 47 ప.

# మతము

భరతఖండమునందు వెలసినమతములలో శైవమతము మిక్కిలి ప్రాచీన మయినదిగాఁ గానవచ్చుచున్నది. ఇది యనాదిగా భరతవర్షములో నెలకొని యున్నది. భారతీయ వాఙ్మయములో మిక్కిలి ప్రాచీన మయినఋగ్వేదమునందు రుద్రుఁడు ప్రధానదైవములలో నొకఁడుగాఁ బ్రశంసింపఁ బడి నాఁడు. అందు శివునిపేరు పేర్కొనఁబడ లేదు. వేదములలోఁ దరువాత రుద్ర, అగ్ని, భర్గ, శివపదములు పరమేశ్వరపరము లుగా నుపయుక్తము లయినను గాలక్రమమున సులభోచ్చార ణము కలదియు, మంగళవాచకమును నగుటచే 'శివ' శబ్దము నందే పరమేశ్వరతత్త్వము నిష్ఠిత మయినట్లు కానవచ్చు చున్నది. ఉపనిషత్తులలో రుద్రపరము లయినయుపనిషత్తులు కొన్ని కలవు. పురాణములకాలమునాఁటికిఁ ద్రిమూర్త్యారాధ నము దేశములో నెలకొని యున్నది. పురాణములలోఁ గొన్ని శివపరము లయినవి కూడఁ గలవు.

'శైవ' శబ్దము 'శివస్య ఇదమ్' అను వ్యుత్పత్తిమూల మున నేర్పడినది. మంగళప్రదుఁ డగునీశ్వరునితత్త్వమును దెలిసికొనుట కేర్పడినమతము శైవమతము. అంగుష్ఠమాత్ర ప్రమాణముగల జ్యోతిర్లింగము మానవునియొక్క హృదయము సహస్రారము మున్నగుస్థానములయందు వెలుఁగొందుచుండు నని భారతీయ సంప్రదాయము. కరచరణాదిరూపరహిత మగునా

జ్యోతిర్లింగమునకుఁ బ్రతీకముగా నొక లింగము ను నిలిపి శివారాధన మొనర్చుట యాచారమై యున్నది. 'లీనమర్థం గమయతి' యనువ్యుత్పత్తిచే లింగ శబ్ద మేర్పడినది. ఈ ప్రపంచ మంతయు దేనిచే నుద్భవించి, దేనియందు లీన మగుచున్నదో యా పరబ్రహ్మతత్త్వమే లింగము. ఇట్లు లింగాకారమునఁ బరమేశ్వరారాధన మొనర్చుట యొక్క భరతఖండమునందు మాత్రమే కాక ఖండఖండాంతరములయందుఁ గూడ నత్యంతప్రాచీనకాలము నుండియు జరగుచుండినట్లు తెలియుచున్నది. సింధునదీప్రాంత మందలి మొహంజదారో హరప్పా మున్నగుస్థలములలో జరపినభూగర్భపరిశోధనలమూలమున లభించిన వస్తుజాల ములో శివలింగములు కూడఁ జేరి యున్నవి. అవి క్రీస్తు పూర్వము కొన్నివేల సంవత్సరములనాఁటి వై యుండు నని పురాతత్త్వశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఇట్లు భారతదేశము నందు మాత్రమే కాక యత్యంతప్రాచీనము లగుశివలింగ ములు ఆసియా, ఆఫ్రికా, అమెరికా మొదలగుప్రదేశ ములలోఁ గూడఁ బెక్కుచోట్లఁ గానవచ్చుటచే శైవమత మాదేశములయందుఁ గూడఁ బూర్వము వ్యాప్తి చెంది యుండి నట్లు మన మూహింపఁదగి యున్నది. శివపారమ్యమును స్థాపిం చుటకై వెలసినశివాగమములు కొన్నింటిలో సామాన్య శైవము, మిశ్రశైవము, శుద్ధశైవము, వీరశైవము నని శైవము నాలుగువిభాగములుగాఁ జేర్కొనఁబడినది. మఱి కొన్నింటిలో నింతకన్న వివరముగా శైవమతమునందలి దశ విధాంతరభేదములు పేర్కొనఁబడినవి. అవి సామాన్యశైవము,

పూర్వశైవము, మిశ్రశైవము, శుద్ధశైవము, శ్రౌతశైవము, మార్గిశైవము, వీరశైవము, విశేషవీరశైవము, నిరాధార వీరశైవము ననునవి.

తమిళదేశములో బయలుదేరిన శైవసిద్ధాంతము ద్రావిడ మనియు, సాంస్కృతిక మనియు రెండు విధములుగా నున్నది. ఈ ద్రావిడసాంస్కృతిక శైవసిద్ధాంతములకు భేదము లేదని కొందఱు చెప్పుదురు. కాని సాంస్కృతిక శైవసిద్ధాంతము ననుసరించువా రందఱును బ్రాహ్మణులు. తమిళగ్రంథములలోఁ దెలుపఁబడిన శైవసిద్ధాంతము ననుస రించువా రందఱును నబ్రాహ్మణులు. తమిళగ్రంథములందుఁ దెలుపఁబడినశైవసిద్ధాంతమును బ్రతిపాదించినవారిలో జ్ఞాన సంబంధర్, అప్పర్, సుందరమూర్తి యనువారు ముఖ్యులు.

శైవమత మనాదిగాఁ గాలము ననుసరించి పెక్కుభేద ములు చెందుచుండెను. తొలుత నీ శైవమతము పాశుపతము, శైవసిద్ధాంతము, యోగశైవము, రసశైవము, ఆగమశైవము, కాపాలికము, కాలాముఖము, లాకులము, నకులీశము, వీర శైవము మొదలుగా బహుభేదములను జెందెను. వీనిలోఁ బాశుపతశాఖ చాలఁ బురాతన మయినది. పాశుపతము, కాపాలికము ననునవి రౌద్రము లని శైవాగమములలోనే పేర్కొనఁబడినది. కాలాముఖులు కాపాలికులలో నొకభేదము. శ్రీ రామానుజాచార్యులవారు 'పత్యు రసామంజస్యాత్' అను సూత్రముక్రింద 'తన్మతానుసారిణః (పశుపతిమతస్య) చతుర్విధాః. కాపాలాః కాలాముఖాః పాశుపతాః శైవాశ్చ

ఇతి. సర్వే చైతే వేదవిరుద్ధాం తత్త్వప్రక్రియాం...... కల్పయంతి...తథా కాలాముఖా అపి కపాలపాత్రభోజన శవభస్మస్నాన తత్ప్రాశన లగుడధారణ సురాముఖస్థాపన తదాధార దేవపూజాదిక మైహికాముష్మిక సకలఫలసాధన మభిదధతి' అని పేర్కొని యున్నారు. కాపాలకాలాముఖమతములు రెండును మొదట శ్రీశైలప్రాంతములోఁ బ్రబలె ననుటకు భవభూతిమహాకవి రచించిన మాలతీమాధవములోని కపాలకుండలవృత్తాంతము నిదర్శనము.

నాసిక బల్లిగ్రామ మాలంపుర శాసనములలోఁ గాలాముఖులకు మహావ్రతు లనునామము పేర్కొనఁబడి యున్నది. యాజ్ఞికులలోఁ బౌండరీకమునకు మహావ్రత మని నామాంతరము. కాని యిది శైవులలోఁ గాలాముఖబ్రహ్మచర్య కాపాలికవ్రతమునకు సంకేతనామముగాఁ జెల్లుచున్నది. కుమారసంభవకృతిపతి యగుజంగమమల్లికార్జున యోగి కాలాముఖమతాచార్యుఁ డని యా కావ్యమునందలి యంతస్సాక్ష్యమునుబట్టి తెలఁపఁదగి యున్నది. కావ్యమునందచ్చటచ్చటఁ గూడ నీ కాలాముఖసంప్రదాయ మభివర్ణింపఁబడినది. ఈ క్రిందిపద్యముఁ జూడుఁడు—

మ. హరికంకాలము చేతిముద్ర
డివిజేంద్రాస్థుల్ సుభూషావళుల్
గరళం బభ్యవహార
మంతకతనుక్షారంబు మైపూఁత పం
కరుహాసీనశిరఃకపాల
ముదభిక్షాపాత్రగా విశ్వసం

హరు వర్తించుమహో
 వ్రతోపహతి సేయం బూన నీప్రాప్తియే?

ఇది రతీదేవి పరమేశ్వరుని విషయమై మన్మథునితోఁ బ్రసంగించినసందర్భమునందలిది. కృతిపతి యగుజంగమ మల్లికార్జునునిఁ బరమేశ్వరునితో నభేదము పాటించి వర్ణించు సంప్రదాయము గలనన్నిచోడని యీ పద్యము కూడ మారమదప్రహారుఁడును, శివావతారమును నగుజంగమమల్లికార్జునునికిని జెల్లుట యాశ్చర్యము కాదు. ఇందలి మహావ్రతము కాలాముఖుల మహావ్రతమును బేర్కొనుచున్న దనుట యతిశయోక్తి కాఁజాలదు. (శ్రీ) రామానుజుల పయివాక్యములోఁ గాలాముఖుల సురాకుంభస్థాపనము ప్రస్తావింపఁ బడినది. కుమారసంభవములో నీ సురాకుంభస్థాపనాదులు పేర్కొనఁబడినవి. చూడుఁడు—

వ. ...అంత నంద కొందఱు మధుపానగోష్ఠికిం జొచ్చి మండలార్చన దీర్చి మాలజమధుపిష్టకుసుమవికారంబు లగు సుగంధాసవంబులు గనకమణిమయానేకకరచషకాదుల నిన్నించి హర్షించి.

మ. శివు గౌరీసహితంబు
 సన్మనములం జింతించి భై
రవు యోగీంద్రులఁ గొల్చి
 యోగినుల వీరవ్రాతముం దన్పి యా
నవనాథాదుల కాదిసిద్ధులకు
 నానందించి విం దిచ్చి యా

సవపాత్రల్ సతు లర్థి
నెత్తికొని యాస్వాదించి మోదించుచున్.

—9 ఆ. 128 ప.

ఇందు మండలార్చన పేర్కొనఁబడినది. మండలార్చన యనఁగా శ్రీ చక్రమును బూజించుట. కృతిపతికి నమస్కరించుచు నన్నిచోడఁడు—

క. శ్రీ పీఠంబున నిడుకొని
శ్రీపాదుక లర్చ లిచ్చి సేవించెద నేఁ
బాపహతిఁ జేసి పుణ్యం
బాపాదింపంగ మల్లికార్జున దేవున్.

—1 ఆ. 14 ప.

ఇందలి శ్రీ పీఠము శ్రీచక్రము తీర్చి మండలార్చన చేసినపీఠము. పరమేశ్వరుని తపస్సును వర్ణించుసందర్భమున నీ క్రిందిపద్యము కలదు.

సీ. పద్మాసనస్థుఁడై భావించి శోషణ
దాహనపావనతర్పణముల
దేహోదయాత్మప్రతిష్ఠలు విధియించి
యాగమరీతి బ్రహ్మాంగవర్ణ
విన్యాసములు దీర్చి విమలాత్మదీపంబు
ప్రణవసంపుటముగాఁ బ్రజ్వలించి
వడి బాహ్యవర్తనల్ విడిచి ప్రత్యాహార
గతి మన స్సంతర్ముఖమ్ము సేసి

గీ. తన్నుఁ దానె కాంచి తనయందుఁ దేజోల
యంబు సేసి నిశ్చలాత్మయోగ
మయసుఖామృతాబ్ధిమగ్నుఁ డై వరదుండు
నిరతిశయసమాధినిష్ఠ నుండె. —3 ఆ. 93 ప.

ఇందుఁ బరమేశ్వరుని యోగమార్గధ్యానము వర్ణింపఁ బడినది. పార్వతియు గౌరిన గంబునందుఁ బరమేశ్వరుం గోరి ఘోరతపంబు సేయం దొడంగి విహితస్నానార్చనాహోమాది నిత్యకర్మంబుల శాకాహార ఫలాహార జలాహార మారుతాహార నిరాహారాది మహాతపోవ్రతంబుల నంత వాసాభ్రకవాసైకపాదాంగుష్ఠోర్ధ్వబాహూర్ధ్వముఖాధోముఖాగ్నిముఖపంచాగ్నిమధ్యాద్యనేకోగ్రతపంబులం బ్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణజపసమాధు లనుషడంగయోగంబుల మనోవాక్కాయకర్మంబుల నతినిష్ఠానుష్ఠానంబులం బరమేశ్వరారాధనతాత్పర్య యై నిరంతరానంతతపోవృత్తిం బ్రవర్తించుచుండె నని వర్ణింపఁబడినది. అవిద్య యనుమాయను జయించి యద్వైతభావమునఁ దాను శివుఁ డై యుపాసకుఁడు శివునితో సాయుజ్యము చెందు ననుట కాలాముఖసంప్రదాయము. ఈ యర్థమును దెలుపుపద్యములు కొన్ని కుమారసంభవమునఁ గలవు. చూడుఁడు :

క. తాన సమస్తములోఁ దన
లోనన సకలంబు గలుగ లోనును వెలియుం
దాన యయి తనకు వే ఱనఁ
గా నేమియు లేక తాన కలిగి వెలుంగున్.

క. తలఁప నని తలఁచి యించుక
దలఁచుడుఁ దలపంగ లేక తానును లే క
ప్పలుకులును లేక యెప్పుడు
కలిమియ పొడ నైనవాఁడు గలిగి వెలుంగున్.

క. దనుజేంద్రుమాయ లన్నియుఁ
ద్రినయనసుతుశక్తిఁ గవి యదృశ్యం బయ్యెన్
వినుతాత్మజ్ఞానంబునఁ
దనరుమహామాయ చెడువిధంబునఁ బోలెన్.

చ. దొరకొనునింద్రజాలమునఁ
దోఁచినరూపము లింద్రజాల మం
చరయఁగ లేక చూపఱకు
నన్నియు నిక్కమవోలె నైనయ
ట్లిరవుగఁ బారమార్థికుల
కెప్పుడు ద్రవ్యము లెల్ల మిథ్య లై
నిరతము చూడ లోకులకు
నిక్కము లై చను భ్రాంతిపెంపునన్.

క. సుజ్ఞానయోగతత్త్వవి
ధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో
నజ్ఞానపదముఁ బొందక
ప్రాజ్ఞుల్ శివుఁ గొల్తు రచలభావన దవులన్.

పై పద్యములలో శివాద్వైతసిద్ధాంతము సూచింపఁ
బడినది.

దక్షిణహిందూదేశమునఁ గాలాముఖు లనుపేరఁ గొందఱు శైవసంప్రదాయస్థులపేళ్లు శాసనములలోఁ గానవచ్చుచున్నవి. సత్తెనపల్లె గ్రామములో దొరకిన యొకానొక తామ్రశాసనములోఁ గాలాముఖాచార్యులు కొందఱు పేర్కొనఁబడిరి. బలిగ్రామశాసనములో నొకానొక కాలాముఖాచార్యుని వర్ణనము కలదు. చూడుఁడు :

'వరకాలాముఖచక్రవర్తి ముని దివ్యజ్ఞాని......... వామశక్తిదేవర తపఃప్రభావముమం నోడి యా మహానుభావర యమనియమ స్వాధ్యాయ ధ్యానధారణ మౌనానుష్ఠాన జప సమాధిశీలసంపన్నరుం యష్టాంగయోగ నిష్ఠాప్రతిష్ఠిత నైష్ఠికచ్ఛాత్రసంఛన్నరుం............కవిగమకివాదివాగ్మి ప్రముఖవివిధవిద్వజ్జనానందకారణ జంగమ కల్ప భూజ రుం వేదాంతసిద్ధాగమ షట్తర్కసకలవ్యాకరణ నిర్మలశాస్త్రార్థ నిర్ణయనిర్ణిక్తరుం...

శ్లో. యః పర్వతావళివిలాసితపుణ్యకీర్తి
కాంతాసఖోఽపి బుధబృందసుతాన్వితోఽపి
నీతిప్రియోఽపి యతి రిత్యభిధీయమానః
శ్రీ గౌతమోముని రభూ ద్భువనే విచిత్రమ్.

ఈపై కాలాముఖాచార్యుని లక్షణములు కుమారసంభవకృతిపతి యగు జంగమ మల్లికార్జునునియందును గలవు. జంగమ మల్లికార్జునుఁడు కమలభవకులతిలకుఁడు, అస్పృష్టరాగుఁడు, వినిర్జితాంగభవుఁడు, అణిమాదిగుణగణాలంకారుఁడు, అమితాభవాగమవిశారదుఁడు, సన్మునీశ్వరాగ్రణి,

సంకల్పసంభవబాణేంధనదావపావకుఁడు, పరవాదీంద్రఘన ఘనానిలుఁడు, హృజ్జన్మాస్త్రానభిజ్ఞుఁడు, మారారి, అక్ష జయుఁడు, అస్ఖలితుఁడు, ఇహాముత్రభోగాద్యనిష్టుఁడు, కుంభజతత్త్వజ్ఞుఁడు, జన్మజరాదూరుఁడు, అసంగుఁడు, కృత్యాకృత్యవిరక్తుఁడు. ఇతఁడు బ్రహ్మచర్యానవస్థితుఁడు కనుక నే హృజ్జన్మాస్త్రానభిజ్ఞుఁ డనియు, నస్పృష్టరాగుఁ డనియు నన్నిచోడనిచేఁ జెప్పఁబడి యుండును. కొంతకాల మింద్రియసుఖముల ననుభవించి యితఁ డాపిదప యత్యాశ్ర మము స్వీకరించి సంగసుఖములను త్యజించి యుండెను. కాలా ముఖమతాచార్యులెల్లరును బ్రహ్మచారు లగుట బ్రహ్మచర్యా నవస్థితుఁడుగా నభివర్ణింపఁబడినయీతఁడును గాలాముఖసంప్ర దాయమువాఁ డని తలఁపఁదగును. దీనిఁబట్టి కుమారసంభవ కృతిపతి యగు జంగమ మల్లికార్జునయోగి కాలాముఖమతస్థుఁ డనియు, నతని శిష్యుఁ డయిననన్నిచోడఁడును నా సంప్ర దాయమును బాటించువాఁడే యనియు మనము భావింపవలసి యున్నది.

మేనకాహిమవంతులు సంతానార్థము శక్త్యారాధనము చేసిన ట్లభివర్ణింపఁబడినది. చూడుఁడు— .

వ. ఇట్లుదయించినమైనాకనగంబు కులిశికులిశపాతభీతిం బయోనిధిమగ్నం బైన నపగతపుత్త్రావలోకనసుఖతత్పరు లై చింతించి—

క. వా రిరువురు సద్విధి శ
క్త్యారాధన సేసి రతిశయస్థిరభక్తిన్

గోరిక వదలక తమకడు
పార సతీదేవి కూఁతు రై జన్మింపన్.
—3 ఆ. 21–22 ప.

ఇట్లే పార్వతి శివునిగూర్చి తపస్సు చేయుచుండఁగాఁ బరమేశ్వరుఁడు మాయావటురూపమున వచ్చి శివాధిక్యవాదమును ప్రత్యాఖ్యానము చేయఁగాఁ బార్వతి చెలికత్తె యాతనికి శివశక్తుల యైక్యమునుగూర్చి యిట్లుగా నుపన్యసించును. చూడుఁడు :

శా. నీయజ్ఞానత నీశు విశ్వ
జనకున్ నిందించె దీవిమ్మహా
మాయన్ జండిక నాదిమూర్తిఁ
ద్రిజగన్నాథన్ మదాంధుండ వై
రాయం జూచెదు పాపకర్మ! నినుఁ
జూడం గూడునే కేవల
స్త్రీయే పార్వతి నన్యథామతిగఁ
దాఁ జింతింప నీ ప్రాప్తియే?
—5 ఆ. 52 ప.

సీ. జ్ఞానస్వరూపుఁ డై సర్వాత్ముఁ డున్నఁ దా
జ్ఞేయస్వరూప మై నెఱసి యుండు
బురుషస్వరూప మై పరమేశుఁ డున్నఁ దాఁ
బ్రకృతిస్వరూప మై పరఁగుచుండు
సూక్ష్మస్వరూప మై శుద్ధాత్ముఁ డున్నఁ దా
స్థూలస్వరూప మై తోఁచి యుండు

నర్థస్వరూప మై యమలాత్ముఁ డున్నఁ డా
శబ్దస్వరూప మై జరగుచుండు

గీ. హరుఁడు రుద్రరూప మై యున్నఁ డా నుమా
మూర్తి దాల్చి లోకములకు హితము
సేయుచుండుఁ గాన శివశక్తిభేదంబు
తెలుఁగు నీకు జడున కెఱుఁగ లాదె ?

—౭ ఆ. ౨౩ ప.

దీనిఁబట్టి కాలాముఖులకు శక్త్యారాధనము విహిత మనియుఁ గృతిపతి యగుజంగమమల్లికార్జునుఁ డహింసా స్వరూపుఁ డని వర్ణింపబడుటచే శాక్తేయులయారాధనమువలె వీరిది హింసారూపము కా దనియుఁ దెలియుచున్నది.

# సాంఘికజీవనము

కావ్యమునందు సమకాలీనభావములును, సంప్రదాయములును దర్పణమునందువలెఁ బ్రతిఫలించు ననుట యనుభవ పునరుక్తము. కవి యెంత జాగరూకత వహించినను,వస్తు వెంత పురాతన మయినను నాతనికవితలో సమకాలీనభావములును, నాచారములును నెట్లో చోటు చేసికొనును. తన కాలము నధిగమించి యేకవియుఁ బోవఁజాలఁ డనుట కా దనరాని సత్యము. నన్నిచోడఁడును నిందుల కపవాదము కాఁజాలఁడు. అతని కుమారసంభవమునం దాకాలమునాఁటి కొన్నివిషయములు ప్రస్తావవశమున స్పృశింపఁబడినవి. అవి యాకాలపు సాంఘికజీవితమును, నాగరకతను మనకుఁ బట్టి యిచ్చుచున్నవి. సమగ్ర మయిన సాంఘికచరిత్రను నిర్మింప నుద్యమించిన శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు తమ 'యాంధ్రుల సాంఘికచరిత్ర'లో నన్నిచోడుని కాలమునాఁటి యొక కొన్ని సాంఘికాచారములను మాత్రమే స్పృశింపఁ గలిగిరి. కాని వా రయినను దమకున్న పరిమితావధిలో నా విషయమై సమగ్ర మయినజతనము కావింప లేదు. మఱికొన్ని తావులఁ గూడ నీవిషయ మానుషంగికముగా స్పృశింపఁబడినను నందుఁ గూడ నాకాలపువిషయము లన్నియుఁ జర్చింపఁబడ లేదు. ఇట నాకాలపుసాంఘికజీవిత మేస్థితియం దుండెనో కుమారసంభవమునే యాధారము చేసికొని యించుక విపులముగాఁ దెలిసికొందము.

ఆ కాలమున వర్ణాశ్రమధర్మములు మిక్కిలి శ్రద్ధాభక్తులతో నాచరింపఁబడుచుండెను. బ్రహ్మహత్య మహాపాప మనియుఁ, బంచమహాపాతకములలో నది యొకటి యనియు నానాఁటి ప్రజలు కూడ విశ్వసించుచుండిరి.

సీ. ఎంత ద్రోహంబు సేయు నితఁడు వధార్హుఁడే
యభవ! యేని నీవ యవధరింపు
మవని 'బ్రాహ్మణో న హంతవ్య' యనుపలు
కీవు నిలుపకున్న నేల నిల్చు.

—2 ఆ. 97 ప.

అని తననాఁటి నమ్మకమునే నన్నిచోడుఁడు బ్రహ్మదేవునినోటఁ బలికించినాఁడు. పంచముల నాకాలమున గ్రామాదులయందలి చెఱువులలోనికి రానిచ్చెడివారు కారు. తెలిసియో, తెలియకయో వారు చెఱువులో స్నానము చేయుటో, జలములఁ ద్రాగుటో, గుడ్డ లుతుకుకొనుటో గావించినయెడల సవర్ణు లగువారు ముఖ్యముగా బ్రాహ్మణులు దానిని వర్జించి యందు స్నానపానాదులు పరిహరించుచుండిరి. ఈవిషయమును నన్నిచోడుఁడు శ్లేషలో నీ క్రిందిపద్యమునఁ దెలిపినాఁడు.

గీ. కొలను వన్యేభములు సొచ్చి కలయఁ గలఁపఁ
బులువు లుండక వెలువడి పోయెఁ జోక
తగదె మాతంగదూషితం బగుసరోవ
రంబు సద్ద్విజవర్జనీయంబు గాదె.

—1 ఆ. 92 ప.

వైశ్యులలోఁ బెక్కెసెట్లనువారాకాలముననే యుండిరి. వారు గాడిదలమీఁదనో, పోతులమీఁదనో యుప్పు పెంటికెలను వైచుకొని యూరూరు పోయి యుప్పమ్ముకొని జీవించుచుండిరి. (1 ఆ. 13 ప.) రజస్వలను దాఁకినచో స్నానము చేయవలె ననుట యానాఁటి యాచారము. ఆ విషయ మీ క్రిందిపద్యమునఁ జమత్కారముగాఁ దెలుపఁ బడినది.

క. పోంక నలినీరజస్వల
సోంకినదోషంబు వాయ సూర్యుఁడు గలితా
శంక నపరాంబునిధిలోఁ
గ్రుంకె నొకో యనఁగఁ బ్రొద్దు గ్రుంకుడు నంతన్.
—8 ఆ. 88 ప.

అట్లే యింట నేదైన శుభకార్యము జరగినప్పుడు బంధుమిత్రాదులను ముత్తైదువలు పోయి పేరంటము పిలుచుటయు నానాఁటి యొకయాచారము. 'తన విభవము దక్షుఁడు గ్రదినయను దేవికిఁ జూపి మెఱయ నని ముందఱు' కొందఱు వనితలను బంచినాఁడు. వారు కైలాసమునకుఁ బోయి పరమేశ్వరునిఁ గని సర్వాంగీణప్రణాము లై నిజాగమన ప్రయోజనం బెఱింగించి పరమేశ్వరానుజ్ఞాత లై సతీదేవిని దోడ్కొని దివ్యవిమానారూఢ లై వచ్చిరి.

రాజునకు భటులకు నాకాలమునఁ జక్కనిసంబంధము లుండెను. రాజు సేవకుల కుచితవేతనముల నిచ్చి వారిని మన్నించుచుండెను. సేవకులును యుద్ధములందుఁ బ్రాణ

ములను సైతము లెక్కసేయక తమరాజునకై వీరావేశముతోఁ బోరాడుచుండిరి. ఈయర్థ మీ క్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

క. ఈవలయునర్థ మిచ్చియు
సేవకు మన్నింపవలయు జీతముచే విభుఁ డా
యీవికి మన్ననకుం దగఁ
జావలయు భటుండు పతికి జయముగఁ బోరన్.

—11 ఆ. 45 ప.

రాజు తనసేవకులకు జీతము లిచ్చుటకై బంగారు నాణెముల నొకచో రాశి పోసి వారివారికిఁ జెందవలసినజీతములను జెల్లించుట యానాఁటియాచారము కాఁబోలును. అది యీ క్రిందిపద్యమున సూచింపఁబడినది.

క. భావజవిభుఁ డలిసేనకపిక
సేవకతతి కెడరు దీర జీతము సేయన్
గా వెలిఁ బోసినపసిఁడుల
ప్రోవులు నాఁ దమ్మి లెలమిఁ బూచె బెడంగై.

—4 ఆ. 99 ప.

పెద్దజీతములవారికి నాణెము లిచ్చినట్లే చిన్నజీతములవారికి గింజలు కొలుచుట నేఁటికిని గలదు. జొన్నలు పండుచోట జొన్న లిచ్చెదరు. ఇది పంపభారతమునుండి గ్రహింపఁబడినవిషయముగాఁ దోఁచుచున్నను పంపనివలెనే యీకవి కూడ జొన్నలు పండెడిదేశమున నుండినవాఁ డగుటచే నితఁడు పంపనిఁ జూచి కాక తనదేశాచారమునే తన యీ క్రిందిపద్యమునఁ జేర్చికొని యుండును.

చ. మునుమిడి వైరివాహినుల
 ముట్టి పడల్వడ వ్రేసినట్టికై
పునఁ బయి కెత్తువాహకుల
 పొంక మఱం దల కొంత కోసి ము
న్కొని వడిఁ బాఱుపంద
 లను గోవుల సూరెలు దోలి మార్చుపే
ర్చునఁ బరికెల్లి గాల్లలన
 జొన్నలు గొన్న ఋణంబు నీఁగుదున్.

—11 ఆ. 42 ప.

జొన్నలవలెనే యాళ్లు కూడఁ దక్కువకులములవారు విరివిగా నుపయోగించుచుండిరి. ఆ యాళుల పొల్లులు పోవుటకై యాకాలపుజనులు తూర్పారఁ బట్టెడివారు. (11–46).

ఆ కాలమునఁ బిల్లలకు శివపంచాక్షరీ మంత్రముతో నక్షరాభ్యాసము చేయించుట యాచారము. ఆ యాచారము నేఁటికిని బాటింపఁబడుచున్నది. ఇది యాకాలముననే యుండిన ట్లీ క్రిందిపద్యమువలనఁ దెలియును.

క. గిరిసుత దొలుపలుకల సు
 స్వర మొదవఁగ 'నోం నమశ్శివాయ సదాస్మ
 ద్వరదాయ నమ శ్శంకర
 శరణు మహాదేవ నీవ శర' ణనఁ జొచ్చెన్.

—3 ఆ. 34 ప.

ఆఁడుపిల్లల కా కాలమునందు నాట్యము, సంగీతము, చిత్రలేఖనము, పత్రచ్ఛేదము, కుసుమబంధనము మొదలగు విద్యలు నేర్పుచుండిరి. పార్వతి యీ విద్యల నెల్ల నేర్చిన దఁట!

సీ. హరుప్రమోదం సద్భక్తి నాడుచోటన నాట్య
విషయమ్ము లన్నియు వెలయఁ గఱచె
ప్రీతి నీశ్వరునకు మాలికల్ వాడుచో
గీతభేదంబుల రీతు లెఱిఁగె
శివురూపు పటములు చిత్రించి చూచుచో
వినుతంబుగాఁ జిత్రవిద్య వడసె
శశివహాళిఁ జిత్రపూజలు సేయుచోటఁ బ
త్రచ్ఛేదకుసుమబంధములు నేర్చె
గీ. మఱియు సకలలోకమాన్యంబు లగువిద్య
లెల్ల నిశ్శేషముగ నెసక మెసఁగ
నభ్యసించె నీశ్వరార్చనాబలమున
హరుఁడు గురుఁడు గాఁగ నగతనూజ!

—3 ఆ. 33 ప.

ఆకాలమునాఁటి పిల్లల యాటవస్తువులు, వారి గుజ్జెనగూళ్లు, బొమ్మపెండ్లిండ్లు మొదలయినవి పార్వతీశైశవక్రీడా వినోదములయం దభివర్ణింపఁబడినవి. చిలుకబొమ్మలు, దంతపుబొమ్మలు, గాజుబన్నరులు, మ్రానిచొప్పికలు వారి యాటవస్తువులు. అవి నాలుగువైపులఁ జేర్చుకొని బొమ్మరిండ్లు గట్టి యందు గుజ్జెనగూళ్లు వండి భుజించుచు బొమ్మపెండ్లిండ్లు చేసికొనుచు వారు వినోదించువారు. ఈ క్రిందిపద్యముఁ జూడుఁడు :—

చ. తరుణులు చిల్కబొమ్మ
లును దంతపుబొమ్మలు మేలి గాజుబ

న్నరులును బ్రమానిచోప్పికలు
నల్లడ నోలిన పేర్చి లీల చే
కుర బొమరిండ్లఁ జేయ నగు
కూళ్లను వండుచు బొమ్మపెండ్లి మా
నరముగఁ జేసి యాడ నగ
జాత శివార్చన సేయు నయ్యెడన్.

—3 ఆ. 36 ప.

పశువులపై ముద్రలు వేసి తమ హక్కులను జెల్లించు కొనునాచార మాకాలమున నుండెనది. దానికే అచ్చు పోయుట, అచ్చు వేయుట యని పేరు. దానిమీఁద నేర్పడినదే 'యచ్చు పోసినయాఁబోతు' అను జాతీయము. ఈ క్రింది పద్యభాగముఁ జూడుఁడు:—

అమరారి దనపేరి యచ్చులు వెట్టించి
సురధేనుసమితిఁ గీలరము సేసె.

—3 ఆ. 11 ప.

బ్రతికి యున్న మృగములకు నాలుగుకాళ్లు గట్టి కావడించి వేఁటకాండ్రు వానిని గ్రామములలోనికిఁ గొని వచ్చెడివారు.

గీ. ప్రమథగణము దక్షుఁ బడఁగొట్టి కట్టుచుఁ
గాలుఁ జేయుఁ బడియుఁ గావడించి
మనుమృగంబు గట్టికొని వచ్చుబలు వేఁట
కాఱుపోలె వచ్చి కనిరి శంభు.

—2 ఆ. 86 ప.

కంసాలులు బంగారము మేలిమి నెఱుంగుటకై నొరగల్లు నుపయోగించుచుండిరి. (1–32) దీపస్తంభాయమున నిధు లున్న తావుల గుర్తించుచుండిరి. (1–13; 1–26) కిల్లె వ్రాయుట చాల వింత మయినవృత్తిగాఁ బరిగణింపఁ బడు చుండెను. (4–25) ఇష్టిక నమలి శపథము చేయుటయు (4–67) నభ్యాగతులకుఁ గర్పూరవాసితరాజితము లగు విడి యము లిచ్చుటయు (7–130) నానాఁటి దేశీయాచారములు. సురరాజు నరరాజు సుందరాకారంబు గని ముదితహృదయుం డగుచు సముచితాసనతాంబూల దాన సన్మానముల చేఁ బ్రహృష్టమనస్కుఁ జేసినాఁడు. (4–40) పిదప మఱొక చోట మన్మథుండు దేవేంద్రుని నియోగము నొప్పుకొనుచు 'నాకుం దగినకెలసంబుఁ గంటి దీనికింతకు మైకొంటిఁ దాంబూ లంబు దయసేయు మని వసంతసహితంబుగా సురరాజుచేత నపారసత్కారంబులు గొని' విడుకొనినాఁడు (4–52). ఇది యానాఁటిదేశీయాచారమును సూచించుచున్నది. మేళముల వారు మేళ మాడించువారినుండి కార్యనిర్ణయసూచకముగఁ దాంబూలము పుచ్చుకొనుట నేఁటికిని శుభకార్యావసర ములలో నాచారముగా నున్నది. ఇట్లే యెవ రిచ్చినతాంబూల ములను వారు తిరిగి పుచ్చుకొనుట విడాకు లిచ్చుట. విడాకు లిచ్చునాచారము కూడ నాఁడు కలదు. (11–54) స్త్రీలచ్చన గాయ లాడుచుండిరి (2–79) తల యంటుకొనియు, నలుగు పూసికొనియు వారు 'అభ్యంజనోద్వర్తనస్నానములు' చేయు చుండిరి. (9–23). ఉద్వర్తనస్నానములో నామలకోద్వర్తనము శ్రేష్ఠ మయిన దని వారు తలఁచిరి. (7–78; 10–107) ఓలి

(ఉంకువ)యిచ్చుటయు (7–136),అరణ మిచ్చుటయు (7–136; 8–139) నాఁటి వివాహాచారములు. ఇల్లడ ముండుట కూడ నాఁడు కలదు. (6–91 ; 10–148) పెండ్లిండ్లు వివాహ మంటపములందు జరగెడివి (9–3). అట్టిసమయముల స్తంభ ములకు వస్త్రములఁ జుట్టెడివారు. వానికి కంబకట్లు (9–3) అని పేరు. మఱియు నాసమయముల పల్లవ, వస్త్ర, మకర, ముకుర తోరణములు (8–42), కలువలతోరణములుఁ గట్టు చుండిరి. మేలుకట్లు (9–3) కూడఁ గట్టెడివారు. ఆ కాలమునఁ గొందఱు కన్యలను దెచ్చి వివాహము చేసి సొమ్ము సంపా దించెడివారు. (10–96) వారికిఁ గన్యావాదు లని పేరు. సంబంధ నిశ్చయసూచకముగా వధువుశిరస్సుపైఁ బేలా లుంచుట యొక శాక్తేయసంప్రదాయముగాఁ గానవచ్చుచున్నది. దానికి ముద్రారోహణ మని పేరు. (7–139) నవమాశ్వాసము నందలి యీశ్వరుని పెండిలిపసదన మంతయు నానాఁడు క్షత్రియకుటుంబములలోఁ బెండ్లికుమారునికిఁ జేయుపెండిలి పసదనముగాఁ దోఁచును. అమరేంద్రుఁ 'డనేకసరత్రిసర పదకరాంగుళీయకోదరబంధకకటిసూత్ర శింజినికాద్యనేకాలం కారాలంకృతుం జేసి పసిండియాయగంబున సుఱియ సురం గంబుగాఁ దొంగలిపట్టియం గట్టి చెన్నుమిగులఁ గైసేసె నఁట! (9–25). ఉప్పరు లుప్పరిపెనములలో నుప్పు వండుచుండిరి. (6–155) కుమ్మరులు సారెపైఁ గుండలు చేయుచుండిరి. కుమ్మరిసారెవలె మనము భ్రమించిన దఁట. సాలెవాండ్రు పడుగు, పేక నేఁత నేయుచుండిరి. (10–125)

వారు నేసినవస్త్రములు మిక్కిలి సన్నగా నుండెడివి. ఈ క్రింది పద్యము చూడుఁడు——

ఉ. అంబరనాను డేయు ముచి
తార్ద్రముగా జలసిక్త మైన దుకూ
లంబు నదృశ్య మయ్యెఁ
గను లజ్జఁ జలింప సతుల్ విటాళి మో
హంబునఁ జూడ గాలిఁ
దడి పోఁజె తదంబరముల్ గట్టి ప్రదే
శంబులఁ బొల్చెఁ దత్సతులు
సంతసమంద విటాళి సందఁగన్. —9 ఆ. 93 ప.

వానికి నేత్రంపు (బడగలు), నేత్రపట్టికామయము లని పేరు. (8–74; 8–25) పొంబట్టుచేలలు (3–12) వారు కట్టుచుండిరి. వస్త్రములకు నీలి పెట్టుట యానాఁటి చాకళ్లకుఁ దెలియును. (8–99) వా రుపయోగించుచుండినయద్దములు పిడియద్దములు. (చూ. అద్దంబుపిడియొ. 3–5; ఆదర్శంబుపిడి 3–60). ఇవి కాక నిలువుటద్దములను గూడ వా రుపయోగించుచుండిరి. (9–17) ధనికులయిండ్లలో బంగారుటద్దము లుండినవి. (మహారజతాదర్శము 6–156). అద్దములకుఁ జిత్రములకు గవుసెన వేయుచుండిరి. ఈ గవుసెనకే కండెఱ యని కూడఁ బేరు. (5–118; 7–78). వారు కరయంత్రములయందుఁ గాశ్మీరజలము నింపి వసంతము చల్లుకొనుచుండిరి. (9–51; 10–24). అవి బంగారముతోఁ జేసినవి. (9–51). ఇట్టి క్రీడకు ముజ్జట లాడుట యని పేరు. ఇవి కాక - రాటనము లనఁబడు పెద్దజల

యంత్రములు కూడ నుండినవి. రాటన మనఁగాఁ జుట్టుఁ గుండ లమర్చినజలయంత్రము. ఒక చక్రముచుట్టు నమర్చిన కుండలలోఁ గొన్ని నీటిని ముంచుకొనునవి, కొన్ని పయినుండి నీటిని బోయునవి యగుటచే సంతతధార కలుగునట్టుగా నేర్పఱుపఁబడినవి. ప్రత్యేకముగా ధారాయంత్రములు నిలిపిన ధారాగృహములు కూడ నుండినవి. ఆ ధారాయంత్రము కీలు మూలమునఁ దిరుగునేర్పా టుండినది. అది సడలినచో ధారా గృహ మంతయు నీటితో నిండిపోయెడిది. (5–86). దుర్గముల గోడలపైఁ బావురముల బొమ్మలు నిలుపుచుండిరి. (7–111) నాఁటి గృహములందు మండియలును—ఇదే మండువాలు— (11–30) సోపానములును (8–74) నుండినవి. వారు శీతలిక లనఁబడు వట్టివేళ్లను, జల్లని పర్ణవిశేషములను (5–136) నుపయోగించెడివారు. సూర్యతప్తములై చంద్రకిరణ ములచేఁ జల్లనయినహంసోదకములను వారు త్రాగుచుండిరి. (7–78; 8–5). స్త్రీలు బొట్టు పెట్టుకొనెడివారు. (చూ. ఇడ్డ బొట్టుసోల. 6–15) నున్నని కోరకొప్పులు ధరించువారు. (8–143). అధరములకు రంగు పూసికొనెడివారు. దానికి వన్నువ యని పేరు. వన్ను పూన్చి (9–10), వన్నువు వెట్టిన మాడ్కి యని యా విషయము ప్రస్తావింపఁబడినది. నాఁటి స్త్రీలు తమ ముంగురులయం దెఱ్ఱని యకరువులవంటిపోడి నలంకరించుకొనుచుండిరి. దానికి 'చిన్నిపువ్వు' అని పేరు. (9–126). 'హంసతిలక' మనుపేరు గలరాగిడిబిళ్లను వారు శిరోలంకారముగా ధరించెడివారు. ఆ కాలమువారు ఉప్పులో నూరవేసినమాంసపుముక్కలను నంజుకొనుచుండిరి. వానికి

‘ఉప్పుగండ’ అని పేరు. వారికి యుప్పుగండలను బందిరిపై నెండఁబెట్టెడువారు (చూ. పందిరిపైఁ బెట్టి యుప్పుఁ గండ లెండఁబెట్టినరీతి. 11–172) ఇది కాక మాంసపు ముక్కలను నంజుళ్లుగాఁ గూడ నుపయోగించుచుండిరి. అది మాంసోపదంశకము అని పేర్కొనఁబడినది (9–132). ఆ కాలమున శైవులలో నాహారనియమములను గూర్చి యభి ప్రాయభేదము లుండినట్లు తెలియుచున్నది. పరమార్థసాధన మునకు సరసాహారము భంజకము కాదనియు. మనస్సే ప్రధాన మనియు నన్నిచోడుని యభిప్రాయము. (12–210) మధుపాన మాకాలమున సర్వసామాన్యము. (9–127) వారు జీలకల్లు (6–43) త్రావుచుండిరి. కల్లు తీయువారు ‘గౌడ గీతములు’ పాడెడివారు. (6–45). ఆకాలపు స్త్రీలు దంపుళ్ల పాటలను,ఊయలపాటలను (4–89), పుష్పాపచయగీతములను (4–98) పాడుచుండిరి. బండి యిరుసులకుఁ గందెన పూసెడి వారు. (12–3). పురుషులు గంధపుష్పముల నమ్మెడివారు. వారికి ‘గట్టివాలు’ అని పేరు. కనుకట్టువిద్య–ఇది మాలోకన విద్య యని పేర్కొనఁబడినది—(8–103), వశ్యౌషధములు (10–96), ధనుర్విద్యారహస్యములు (12–95) నాకాలములోఁ గొందఱికిఁ దెలిసి యుండినవి. ఇతరులను వశము చేసికొనుటకై వశ్యాక్షతలు చల్లుటయు (4–117), వశ్యాధిదేవత (5–29) నారాధించుటయు నాఁటిజనుల యాచారము. చెఱకు గాను గాడుట వారికిఁ దెలియును. (1–30) గానుగునఁ బెట్టి యాడించుట మిక్కిలి కఠిన మయినశిక్షగా భావింపఁబడుచుం డెను. (2–96). నాలుక కోసి యుప్పు నింపుట, త్రపుద్రవము

నోడ లంతయుఁ బూయుట, లోహమును గాచి నోటఁ బోయుట, చర్మపట మొలుచుట, కనుగ్రుడ్లు పెఱుకుట యనునవి నాఁటి శిక్షావిధానములలో మిక్కిలి తీవ్రము లయినవి. ముండ్లపైఁ బరుండి కొందఱు యోగులు యోగాభ్యాసము చేయుచుండిరి. దానికి 'కంటకశయనవ్రత' మని పేరు. యుద్ధములలో యుద్ధప్రారంభమును సూచించుచుఁ జేయి వీచుటయుఁ, దిరిగి యుద్ధావసానమునఁ జేయి పీగుటయు నాఁటి యాచారము. (2–65; 11–207; 12–4;) యుద్ధభూమి లోనికిఁ దొలుత కొంతసైన్యము పంపఁబడెడిది. దానికిఁ దల తంత్ర మని పేరు. (11–3). యుద్ధములో నెవ రైనఁ బాఱి పోయినయెడల నాతనికి శిక్ష విధించి యుద్ధమునందుఁ బాఱినవారి కెల్ల నిట్టిశిక్ష విధింపఁబడు నని యాతని దృష్టాంతముగాఁ జూపెడివా రఁట! అట్టివానికి 'ఓగులవాఁ' డని పేరు. (4–16) శత్రుమారణవశీకరణాదులకై యభిచారహోమము చేయుట యలవాటు. (4–94)

నన్నిచోడుని కాలమునాఁటి సంఘ మెట్టి నాగరికత, సంప్రదాయము, జీవనవిధానముఁ గలిగి యుండెనో యిందు శృంగగ్రాహికగాఁ గొంత వివరింపఁబడినది. రాజశిఖామణి యయ్యును నితఁడు కవిరాజశిఖామణి కూడ నగుటచే సంఘము లోని యన్నితరగతులవారి జీవనవిధానములను సూక్ష్మముగాఁ బరిశీలించి యుండె నని దీన్నిఁబట్టి నిరూపిత మగుచున్నది.

# అనుబంధము

118 వ పుటలో 15 వ పంక్తి తరువాత నీ క్రింది భాగముఁ జదువుఁడు—

ఈ క్రింది సంస్కృతశ్లోకము కూడఁ బ్రసంగరత్నావళి యనుసంకలనగ్రంథమునం దుద్ధరింపఁబడినది. చూడుఁడు :

పాతు వో గిరిజామాతా
యస్య ద్వాదశలోచనః
తస్యైవ గిరిజామాతా
ద్వాదశార్ధార్ధలోచనః.

ఇందలి చమత్కారము నన్నిచోడునికి ముచ్చట గొలిపి యుండ వచ్చును. ఆ చమత్కారమును దన కుమార సంభవమునందు నెక్కొలిపినాఁడు. చూడుఁడు :

తే. ద్వాదశార్ధార్ధనయను నా ద్వాదశార్ధ
వదనుఁ డొాగిఁ జుట్టె నిజభుజద్వాదశమున
నుదయదశశతకిరణుఁ డయ్యుదయనగముఁ
గిట్టి దశశతకరములఁ జుట్టినట్లు.

—12 ఆ. 214 ప.

*　　　*　　　*

127 వ పుటలో 18 వ పంక్తికిఁ దరువాత నిటు చదువుఁడు.

ఈ క్రింది శ్లోకము చూడుఁడు :

యతో హస్త స్తతో దృష్టి
ర్యతో దృష్టి స్తతో మనః
యతో మన స్తతో భావో
యతో భావ స్తతో రసః.

పయిశ్లోక మీ క్రింది పద్యమునకు మూల మని యున్నది.

పార్వతీపరమేశ్వరుల వివాహఘట్టమున నాట్యము చేయుసందర్భమునం దీ పద్యము కలదు.

చం. అలఁతులు నిల్వ హ స్తములు
హ స్తవిలాసముతోఁ బెనంగఁ జూ
పులు తెలి చూపులం దెలమిఁ
గూడి రమింప మనంబు తన్మనో
బలమున నుల్లసిల్లి నిజ
భావము భావవిశేషసంపదల్
వెలయ రసంబునం దభిన
వించె రసంబులు సాంగకంబు గాన్.

——6 ఆ

# కృతజ్ఞత

ఈ గ్రంథమును రచించుసందర్భమున ఈ క్రింది గ్రంథములు సంప్రతింపఁబడినవి. ఆయా గ్రంథములను రచించినవిద్వాంసులకు, వానిఁ బ్రకటించినప్రకాశకులకు మిక్కిలి కృతజ్ఞుఁడను.

1. కుమారసంభవము - (ప్రథమ ద్వితీయభాగములు) శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిచే సంపాదితము.
2. కుమారసంభవము - వావిళ్ల వారిచేఁ బ్రకటితము.
3. కుమారసంభవము - మదరాసు విశ్వవిద్యాలయ ప్రచురణము. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారిచేఁ బరిష్కృతము.
4. కుమారసంభవవిమర్శము - శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి.
5. విమర్శతరంగిణి - శ్రీ నడకుదుటి వీరరాజు.
6. ఆంధ్రకవులచరిత్రము - శ్రీ కందుకూరి వీరేశలింగము.
7. తెలుఁగుకవుల చరిత్రము - శ్రీ నిడుదవోలు వెంకటరావు.
8. ఆంధ్రవాఙ్మయచరిత్రసర్వస్వము-శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి.
9. ఆంధ్రుల సాంఘికచరిత్ర - శ్రీ సురవరము ప్రతాపరెడ్డి.
10. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - దుర్ముఖి
11. నన్నిచోడకవి - అనుకరణౌచిత్యము - భారతి (1934) లో శ్రీ కట్టె సాంబమూర్తి శాస్త్రిగారి వ్యాసము.

---